# కర్మయోగము

## శ్రీ వివేకానంద ప్రవచనము

అనువాదకుడు:

శ్రీ చిరంతనానందస్వామి



శ్రీ రామకృష్ణమఠము

మైలాపూరు :: మద్రాసు-600004

చెన్నపురి శ్రీరామకృష్ణమఠాధ్యక్షులచే ప్రకటింపబడినది.

(సర్వస్వామ్య సంకలితము)

ఎనిమిదవ కూర్పు—LIII—1-'75

ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారిచే బి. ఎ. (1947-వ సం॥) పరీక్షకును మద్రాసు విశ్వవిద్యాలయమువారిచే విద్వాన్ (1947, '48, '49-వ సం॥) ప్రీ పరీక్షలకును ప్రధాన పాఠ్యగ్రంథముగా నియమింపబడినది.

వెల :
రూ. 4.00

ఫ్రీడమ్ ప్రెస్.
188-ఏ, టి. హెచ్. రోడ్డు
మద్రాసు-600021.

# తొలిపలుకు

ఫలాభిసంధిరహిత కర్మాచరణమున మోక్షమును బొందు మార్గమే కర్మయోగము. శాస్త్రోక్తమైన ఆచరణ విధానమును గ్రహించి కర్మముల నొనర్చునపుడే కర్మాచరణము కర్మయోగమై యొప్పును. "ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ" యనురీతిని ఆత్మమోక్ష జగత్కల్యాణములు కర్మయోగాదర్శములు. "స్వీయమోక్షముచే నేమి లాభము ? ప్రతిజీవిని మోక్షమార్గమున నాతో గొనిపోయెదను", "బిడ్డలారా! లోకశ్రేయమునకై మనము ధార పోయు రక్తధారలనుండి ప్రపంచమును మార్చివేయునట్టి వీరాధివీరులును భాగవతయోధులును వెలువడియెదరని నమ్ముడు!" "తమస్సున మునిగి నిర్జీవులై యున్న నా భారత సోదరులను కర్మయోగప్రభావముచే పునరుజ్జీవింపజేసి, స్వశక్తిపై నిల్చు ధీరుల నొనర్చుటకై మహానందముతో వేయినరకములైన ననుభవించెదను" అని ప్రకటించి, బహు విధముల నేడు దేశసేవనే కాక ప్రపంచసేవను సల్పుచున్న శ్రీరామకృష్ణమఠ సేవాసంఘములను దేశదేశాంతరములలో స్థాపించి, కర్మయోగాచరణమున మెఱుపుదీగవలె మెఱసిన కర్మయోగాదర్శమూర్తి - శ్రీవివేకానందస్వామి - యొసగిన మహోపన్యాసతరంగిణియే ప్రస్తుతగ్రంథము. స్వామి యిందు

కర్మయోగతత్త్వము నరటిపంఱొలిచినరీతిని విశదీకరించి యున్నాడు,—కర్మమెటుల మోక్షసాధనమో స్పష్టీకరించి యున్నాడు. వేదాంతవాఙ్మయమున, మఱియు నందు వివేకానందవాఙ్మయమున ఈ కర్మయోగోపన్యాసములు మహోత్తమస్థానము నలంకరించుచున్నవి.

అనువాదవిధానమున, "తెల్గుసేయుచో, మక్కికి మక్కి యన్నటుల మార్చిన కావ్యము శ్రావ్యమెట్లగున్!" అను పెద్దలవచనమును పాటించియున్నాను. పాఠకులకు స్వామిభావములు సుబోధమగుటకై ఆవశ్యకమగు తావు లందు మూలగ్రంథములనుండి ప్రమాణముల నుల్లేఖించి యున్నాను; మఱియు టిప్పణులను వ్రాసియున్నాను.

శ్రీరామకృష్ణమఠము,
మైలాపూరు,
మద్రాసు-600004

అనువాదకుడు

# విషయ సూచిక

కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషే చ్ఛతం సమాః
ఏవం త్వయి నాన్యథేతోఽస్తి న కర్మ లిప్యతే నరే.

—ఈశావాస్యోపనిషత్తు, 2.

ఈ లోకమున విహితకర్మముల నాచరించుచునే నూఱుసంవత్సరములు జీవింపగోరవలయును. జీవితేచ్ఛగల నీవు కర్మబంధమునుండి విముక్తుడవగుట కింతకంటె మఱి యొకమార్గము లేదు.

కర్మణ్యే వాధికార స్తే మా ఫలేషు కదాచన.
మా కర్మఫలహేతుర్భూ ర్మా తే సఙ్గోఽస్త్వకర్మణి.

—భగవద్గీత, 2-47.

విహితకర్మముల నాచరించుటకేగాని వాని ఫలములను గోరుటకు నీకు ఎన్నడును అధికారము లేదు. కర్మఫలములను బొందుటకు నీవు కారణము గావలదు, అట్లని కర్మముల ననుష్ఠింప కుండుటయందును తగిలియుండవలదు. (అనగా ఫలములను గోరకుండ విహితకర్మముల నాచరించుచుండవలయును.)

య త్కరోషి య దశ్నాసి య జ్జుహోషి దదాసి యత్.
య త్తపస్యసి కౌన్తేయ త త్కురుష్వ మదర్పణమ్.
శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబన్ధనైః.

* * *

—భగవద్గీత, 9-27,28.

"అర్జునా! నీ వేమి యొనర్చినను, భుజించినను, వ్రేల్చినను, దానమొసగినను, తపమొనర్చినను, దానినెల్ల నాకు సమర్పణముగా జేయుము, పుణ్యాపాపములనెడి కర్మబంధములనుండి విముక్తుడవు కాగలవు.



శ్రీ వివేకానంద స్వామి

ఓమ్

నమో భగవతే శ్రీ రామకృష్ణాయ

# కర్మయోగము

---

## మొదటి అధ్యాయము

## కర్మము : శీలముపై కర్మప్రభావము

కర్మమనుపదము 'కృ' అను ధాతువునుండి జనించు చున్నది; సమస్త వ్యాపారమును కర్మమే. కర్మమను శబ్దమునకు సాంకేతికముగా కర్మఫలమనియు నర్థము కలదు. తత్త్వశాస్త్రానుసారము ఈ శబ్దమునకు ఒక్కొక్కప్పుడు మన పూర్వకర్మముల ఫలితమని యర్థమగును. కాని కర్మయోగమున మనము 'క్రియ' లేక 'వ్యాపారము' అను నర్థమున కర్మమును గూర్చి వివేచింపనగును. మానవజీవిత పరమావధి జ్ఞాన మనునదియే తత్త్వశాస్త్రముచే మనకు దెలియనగు నద్వితీయాదర్శము. మానవజీవితపరమావధి సుఖము కాదు, జ్ఞానము. సుఖమే పరమావధి యనుకొనుట భ్రాంతి; మానవులు తమ యజ్ఞానముచే సుఖమును పరమావధి యనుకొనుటయే లోకమున తా మనుభవించు దుఃఖము లన్నిటికిని మూలకారణము. దుఃఖానుభవముతో గొంత కాలము గడచినంతనే మానవుడు తన గమ్యము జ్ఞానమే కాని సుఖము కాదనియు, సుఖదుఃఖములు రెండును సమాన

ముగా తనకు గుణపాఠములను గఱపుచున్నవనియు, మేలు తన కెంత ప్రబోధకమో కీడును అంత ప్రబోధకమే యనియు గ్రహింప నారంభించును. సుఖదుఃఖము లాతని మానసఫలకమున భిన్నసంస్కారములను ముద్రించును. ఈ సంస్కారము లన్నిటిఫలితమే మానవుని 'శీలము' అనబడుచున్నది. ఎవ్వని శీలమునైనను బరిశీలించినచో అది కేవల మాతని మనోభావముల మొత్తమని, చిత్తవృత్తుల సాముదాయకఫలితమని వెల్లడియగును; అతని శీలమును నిర్మించుటలో సుఖదుఃఖములు రెండిటికిని సమానాధికారము కలదని వెల్లడియగును. శీలనిర్మాణమున మంచి చెడుగులు రెండును సమానభాగస్వాములు. కొన్ని యెడల సుఖముకంటె దుఃఖమే విశేషముగా లోకులకు జ్ఞానాంజనమగుచుండును. లోకమున గల గుణగరిష్ఠుల—మహనీయుల—శీలమును బరిశీలించినచో, అందు అధికసంఖ్యాకులకు సుఖముకంటె దుఃఖమే విశేషప్రబోధకరమైనదని—సంపదలకంటె దారిద్ర్యమే జ్ఞానాంజనమైనదని—అభినుతులకంటె అంతరాయములే, విఘ్నములే అంతర్గతమగు శక్తిసామర్థ్యములను బ్రజ్వలింపజేసినవని నిశ్శంకముగా వక్కాణింతును.

ఇకను ఈ జ్ఞానమో, మానవునకు స్వతస్సిద్ధము; బాహ్యమునుండి జ్ఞానము కలుగుట లేదు. మానవుడు "తెలిసికొనుచున్నాడు" అనునప్పుడు వస్తుతః చెప్పునెడల "కనిపట్టుచున్నాడు" లేక "నిరాచ్ఛాదిత మొనర్చుచున్నాడు" అని చెప్పవలసియున్నది. ఇట్లే మానవుడు "నేర్చుకొనుచున్నాడు" అనునది నిజముగా అతడు అఖండ జ్ఞాననిలయ

మగు తన యాత్మను గప్పియున్న అజ్ఞానావరణమును (తాత్కాలికముగా తొలగించుకొని "కనిపట్టుచున్న" సంగతియే కాని మఱియొకటి కాదు. న్యూటన్ అను నాతడు గురుత్వాకర్షణ శక్తిని (Gravitation) కనిపట్టినాడని చెప్పుచుందుము. అది యాతనికొఱకు నిరీక్షించుకొని యొక మూల గూర్చుండెననియా దాని తాత్పర్యము? అది యాతని మానసముననే యుండెను; సమయము వచ్చినంతనే దాని నాతడు కనుగొనినాడు. లోక మింతవఱకు గ్రహించిన జ్ఞానమంతయు మానసమునుండియే కలుగుచున్నది; అనంతవిశ్వ భాండాగారము నీ మానసముననే యున్నది. నిన్ను నీ మానసమును బరిశీలింప జేయుటకు బాహ్యప్రపంచము కేవలము సూచనను—సమయమును గల్పించుచున్నది. కాని పరిశీలన విషయముమాత్ర మెప్పుడును నీ మానసమే. రేగుచెట్టునుండి పండు క్రింద బడుట న్యూటనుకు (అందేదియో ప్రకృతినియమ ముండునను) సూచనకా నాతడు తన మానసమును బరిశీలించుకొని తన పూర్వానుభవముల నన్నిటిని పునఃపరిష్కరించుకొనినంతనే ఆతనికి వానిలో నూతనమగు సమన్వయము పొడకట్టెను; దాని కాతడు గురుత్వాకర్షణ నియమము (Law of Gravitation) అని పేరిడెను. ఈ నియమము రేగుపండులో గాని భూగర్భమున మఱిదేనియందుగాని లేదు. జ్ఞానమంతయు, విద్యయంతయు—వ్యావహారికము గాని పారమార్థికముగాని —మానవ మానసముననే కలదు. పెక్కెడల నియ్యది ఆవృతమై, కనుగొనబడకుండును; ఈ యావరణము క్రమముగా తొలగింప బడునప్పుడు మనము "గ్రహించు

చున్నాము'' అని చెప్పుదుము. మఱియు దీనిని తొలగించిన కొలదియు జ్ఞానాభివృద్ధి యగుచుండును. ఎవ్వనియందుండి ఈ మాయావరణము తొలగింపబడుచుండునో అతడే జ్ఞానాభివృద్ధి గాంచుచుండు మానవుడు; ఎవ్వనియం దిది సాంద్రమై యుండునో అతడే అజ్ఞాని; ఎవ్వనియందుండి పూర్తిగా తొల గునో అతడే సర్వజ్ఞుడు. సర్వజ్ఞు లితఃపూర్వము వెలసి యున్నారు. ముందును వెలయగలరనియు భవిష్యద్యుగము లందు అసంఖ్యాకులై యుండగలరనియు నా నిశ్చయము. మానసమున జ్ఞానము చెకుముకిఱాతియందలి అగ్నికణము వలె నున్నది; దానిని వెలువడజేయు సంఘటనమే వలయు నొఱపిడియని చెప్పవచ్చును. మన కామక్రోధాది మనో భావము లన్నిటి విషయముకూడ నిట్టిదే—మన సుఖములు మనదుఃఖములు, మననవ్వులు మన యేడ్పులు, మన యాశీ ర్వచనములు మనశాపములు, మననుతులు మననిందలు— ప్రశాంతముగా మనము ఆత్మపరీక్ష చేసికొనినచో నివి యన్నియు—బాహ్యసంఘట్టనముచే మనయందుండియే వెలు వడుచున్నవని మనకు తెల్లమగును. వీని యన్నిటి ఫలితమే మన ప్రస్తుతస్థితి; ఈ సంఘట్టనములే సాముదాయకముగా కర్మమనబడుచున్నవి. ఆత్మతేజము వెలువరించునదని చెప్ప దగునట్టి ఆత్మయందలి శక్తిజ్ఞానములను తెలియజేయు ప్రతి మానసిక వ్యాపారమును కర్మమే—కర్మమను శబ్దమున కియ్యది అత్యంతవిపులార్థమని గుర్తింపనగును. మన మిట్లు సదా కర్మమొనర్చుచున్నాము. నేను మీతో మాటలాడు చున్నాను: ఇది కర్మము. మనము ఊపిరి పీల్చుచు విడుచు

చున్నాము : ఇది కర్మము. నడచుచున్నాము: ఇదియు కర్మమే. మన శారీరమానసిక వ్యాపారమంతయు కర్మమే; కర్మము మానసమున సంస్కారములను గల్గించుచున్నది.

కొన్ని కర్మములు చిన్న చిన్నవగు ననేక కర్మముల సముదాయమై లేక మొత్తమై యుండును. సముద్రతీరమున నిలువబడి అలలతాకుడుచే గలుగు శబ్దమును వినునప్పు డయ్యది మహాఘోషగా దోచును; ఐనను అందలి ప్రతి తరంగమును లక్షలకొలది చిన్నచిన్న తరంగములచే నేర్పడు చున్నదని మన మెఱుగుదుము; వీనిలో ప్రతితరంగము లేక వీచికయు సద్దుచేయుచున్నను మనము దానిని వినుటలేదు; అవియన్నియు గలిసి మహాతరంగమైనపుడే మనము తరంగ ఘోషను వినుచున్నాము. ఇట్లే ప్రతి హృదయస్పందనమును కర్మమే : కొన్ని విధములగు కర్మములు మనకు అనుభూత మగుచున్నవి—విస్పష్టముగా గోచరించు చున్నవి; ఐన నవియు చిన్నచిన్న కర్మముల సముదాయమే కాని మఱి యొకటి కాదు. నీవొకనిశీలమును నిజముగా బరిశీలింప దల చినచో—విమర్శింపదలచినచో—అత డొనర్చిన ఘనకార్య ములను గైకొనకుము. ఎప్పుడో యొకప్పుడు ప్రతిమూర్ఖుడును మహావీరుడు కావచ్చును—అగుచునే యుండును. అత్యంత సామాన్య కృత్యములలో మానవుని బరిశీలింపుము. నిజమగు మహాపురుష స్వభావమును వెల్లడించునవి అట్టి సామాన్య కృత్యములే. ఉత్కృష్టసమయము లత్యల్పులను సైతము ఏదైన నొకవిధమగు ఘనతవహింప—ఘనకార్యములనొనర్ప —బురికొల్పును; కాని యెవ్వనిశీల మెప్పుడును మహానీయమై

యుండునో—తా నెట్టి పరిస్థితులలో నున్నను ఒకేవిధముగా నుండునో—ఆతడే నిజముగా మహాసీయుడు, మహాపురుషుడు.

(శీలమును నిర్మించుటలో కర్మప్రభావము అద్వితీయము. కర్మమిందు అఖండ శక్తివంతమైయున్నది; మనము ఈ శక్తిని వశమొనర్చుకొనవలయును. విశ్వశక్తు లన్నిటిని తనవైపునకు ఆకర్షించుకొను కేంద్రమే మానవుడని చెప్పవచ్చును; ఈ కేంద్రమున ఈ శక్తులనన్నిటి నాతడు ఏకమొనర్చి మఱల మహాశక్తి ప్రవాహరూపమున వానిని వెలువరించుచున్నాడు. ఇట్టి కేంద్రమే నిజమగు మానవుడు, సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు; ఇట్టి మానవుడు విశ్వమునంతను తనవైపున కాకర్షించుకొనుచున్నాడు; మంచి, చెడుగు, సుఖము, దుఃఖము, సమస్తము ఆతనివైపునకు బరుగిడి యాతని నావరించుచున్నవి; అందుండి శీలమను మనోభావ మహాప్రవాహము నాతడు వెలువఱచుచున్నాడు. అతనికి సమస్తము నాకర్షించుకొను శక్తి యున్న చందముననే వెలికి ద్రోయు శక్తియు గలదు.)

లోకమున మనకు గోచరించు సమస్తకార్యములు, మానవసంఘమందలి సమస్తోద్యమములు, మనచుట్టు నున్న సమస్తవ్యాపారములును కేవలము మనోభావ ప్రదర్శనములు, మానవసంకల్పరూపములు. యంత్రములు, సాధనములు, నగరములు, ఓడలు, యుద్ధనావలు—అన్నియు కేవలము మానవసంకల్ప స్వరూపములు. ఈ సంకల్పము శీలము నుండియు శీలము కర్మమునుండియు ఉత్పన్నమగుచున్నవి. "బుద్ధిః కర్మానుసారిణీ" యనునట్లు కర్మానుగుణమగుబుద్ధి

గలుగుచుండును. ప్రపంచమున జనించిన సంకల్పబలాన్వితు లెల్లరును మహాకార్యశూరులు—లోకమును తలక్రిందు చేయజాలిన యఖండ శక్తిమంతులు. యుగయుగములనుండి చేయుచున్న నిరంతరకృషిచే వారికట్టి సంకల్పబలము చేకూరినది. బుద్ధుని లేక జీసస్ యొక్క సంకల్పశక్తినిపోలు మహాసంకల్పశక్తి ఒక్కజన్మమున లభింపజాలదు. మనకు వారి తండ్రు లెవ్వరో తెలియునుగదా! విశ్వమానవ కల్యాణము నకై వారితండ్రు లొక్కమాటనైనను పలికినట్లు కానరాదు. జీసస్ తండ్రియగు జోసఫ్ వంటి వడ్రంగులు లక్షలకొలది గతించినారు: లక్షలకొలది యింకను సజీవులై యున్నారు. బుద్ధుని తండ్రివంటి క్షుద్రరాజులు లక్షలకొలది ప్రపంచమున మనిరి. బుద్ధుని మహాసంకల్పశక్తి కేవల వంశపరంపరాను గతమే యగుచో బహుశః సేవకులచేతనే తనయాజ్ఞలు మన్నింపబడని యీ క్షుద్రరాజన్యుడు ప్రపంచార్ధభాగముచే పూజల నందుకొను పుత్రరత్నమును బడయగల్గుటకు గల కారణమేమో చెప్పుడు. వడ్రంగికిని, కోట్లకొలదిజనులు భగవంతునిగా నారాధించు నాతని పుత్రునికిని గల హాస్తిమశ కాంతరమునకు మీ రేమి కారణము చూపెదరు? పారంపర్య వాదము (Heredity) చే దీని కెట్టి సమాధానమును బొంద జాలము. బుద్ధుడును జీసస్‌ను లోకమున ప్రదర్శించిన నిరుప మాన సంకల్పశక్తి యెచ్చటనుండి వచ్చినది? ఈ మహాశక్తి సంఘాతము ఎందుండి వెలువడినది? నిరంతరాభివృద్ధి నొందుచు తుదకు జీసస్ రూపముననో బుద్ధరూపముననో ఒక్కమ్మడి సంఘముపై బడువఱకు—నేటిపర్యంతము అనుగత మగునట్టి

యీ శక్తి యుగయుగములనుండియు ప్రపంచమున నుండియే తీరవలయును.

కర్మమే ఈ సంఘటనములనన్నిటిని నియమించుచున్నది; ఇయ్యది శాశ్వతనియమము; మన మొక్కొక్కప్పుడిది యథార్థము కాదనుకొనుచుందుము కాని కాలక్రమమున నియ్యది మనకు ధ్రువపడగలదు. సిరిసంపదలకొఱకై యావజ్జీవ మొకడు యాతనపడుగాక, అందులకై వేలకొలది జనులను మోసగించుగాక, కాని తుదకు తనకు ధనవంతుడగుట కర్హత లేదని గ్రహించును: జీవితమంత నరకప్రాయమై, అసహ్యమై యాతని వేధించును. మన శరీరసౌఖ్యమునకై వస్తువాహనముల నన్నిటిని ప్రోగుచేసికొనుచుందుముగాక, కాని యేది మన సముపార్జితమో అదియే మనకు దక్కును. ఎవ్వడేని మూర్ఖుడు ప్రపంచములో నున్న గ్రంథజాలము నంతను కొని తన భాండాగారమున నిడుకొనుగాక, కాని తన కే గ్రంథములను జదువుట కర్హతకలదో వానినే యాతడు చదువగల్గును; ఈ యర్హత కర్మముచే గలుగుచున్నది. మనము దేని కర్హులమో, దేని నవగాహ మొనర్చుకొనగలమో మనకర్మమే నిర్ణయించుచున్నది. మన ప్రస్తుత స్థితికి మనమే బాధ్యులము; ఎట్లు కాగోరుదుమో అట్లగుటకును మనకు శక్తికలదు. మన వర్తమానస్థితి పూర్వకర్మముల ఫలితమైనచో మనము పొందగోరుస్థితి ప్రస్తుత కర్మసంజనితమని నిశ్చితమగుచున్నది. కావున మనము కర్మ మొనర్పవలయు క్రమమును తెలిసికొనవలయును. "కర్మ మెట్లొనర్పవలయునో తెలిసికొనుటవలని ఫలమేమి? లోక

మున ప్రతివ్యక్తియు ఏదేనొకవిధమున కర్మ మొనర్చుచునే యుండునుగదా" యని మీరు శంకింపవచ్చును. కాని మన శక్తిసామర్థ్యములను దుర్వినియోగ మొనర్చుకొనుచుందు మని గుర్తింపవలయును. కౌశలముతోడను* శాస్త్రదృష్టి తోడను కర్మ మొనర్పవలయుననియు ఇదియే కర్మయోగ మనియు భగవద్గీత వెల్లడించును; కర్మ మొనర్పవలయు విధానమును దెలిసికొని కర్మ మాచరించినచో ఉత్కృష్ట మగు ఫలమును బడయవచ్చును. స్వతస్సిద్ధముగా మానస మందున్న శక్తిని వెలికి దీసికొనివచ్చుటయే, ఆత్మశక్తిని మేల్కొల్పుటయే, కర్మములయొక్క ప్రయోజనమని మనము గుర్తింపవలయును. ప్రతిమానవునియందును ఈ శక్తి కలదు; వివిధకర్మములు ఈ శక్తిని జ్ఞానమును వెలువడజేయుటకై—ఈ భూతములను మేల్కొల్పుటకై వినియోగించు ఘాతములవంటివి.

వివిధ సంకల్పములతో—వివిధ మనోభావములతో—మానవుడు కర్మ మొనర్చుచుండును; సంకల్పరహితమగు కర్మము ఉండనేరదు. కొందఱు ప్రఖ్యాతి నభిలషించి యందుకొనుటకై కర్మ మొనర్చుచుందురు. కొందఱు ధనము కోరి యందులకై కర్మము చేయుచుందురు; మఱికొందఱు అధికారవాంఛచే కర్మ మాచరింతురు, ఇంక గొందఱు స్వర్గాభిలాషచే కర్మపరు లయ్యెదరు. మరణానంతరము తమపేరు నిలువవలయునని చైనాదేశస్థులవలె గొందఱు కోరుకొందురు; మరణపర్యంతము అచ్చట నెవ్వనికి బిరుద

---

* "యోగః కర్మసు కౌశలమ్." —భగవద్గీత, 2-50.

ములు లభింపవు. ఏమైనను ఘనకార్యము చేసినపక్షమున గౌరవచిహ్నముగా నొక బిరుదును గతించిన వానితండ్రికో తాతకో యొసగుదురు. కొంద ఱిందులకై కృషి చేయుదురు. కొన్ని మహమ్మదీయ సంప్రదాయములందలి కొందఱు మరణానంతరము తమపేర నొక పెద్దగోరీ కట్టించుకొనుటకై యావజ్జీవము పాటుపడుచుందురు. బిడ్డ పుట్టినంతనే ఆ బిడ్డకొఱకై గోరీని నిర్మించునట్టి కొన్ని సంప్రదాయములను నే నెఱుగుదును; అది వారిలో ప్రధానకర్మము—విధ్యుక్త కర్మము—గోరీ యెంత పెద్దదో, చక్కనిదో తత్సంబంధమగు మానవు డంతటి ఉత్కృష్టుడుగా పరిగణింపబడుచుండును. కొందఱు తపశ్చర్యగా—ప్రాయశ్చిత్తముగా—నెంచి కర్మ మొనర్తురు; సమస్త దుష్కార్యములను జేసి తుదకొక దేవాలయమును గట్టుదురు; లేదా పురోహితులను లోబఱచుకొని వారివలన స్వర్గగమనాధికారమును బొందుటకై వారికి దక్షిణ లిత్తురు. ఈ విధమైన ఔదార్యమును త్యాగమును తమ్ము పునీతులను జేయుననియు, ఎన్ని పాపములు చేసియున్నను వానివలన తమకు లేశమేని బాధలేదనియు వారి యభిప్రాయము. కర్మాచరణమునకు బురికొల్పు సంకల్పములు ఈ విధముగా నున్నవి.

నిష్కామముగా కర్మ మొనర్పుము. నిష్కామ కర్మపరాయణులు, పేరుప్రఖ్యాతుల నాశింపనివారు, స్వర్గలోకమునకు బోవుటనుగూడ వాంఛింపనివారు నగు మహనీయులు ప్రతిదేశమునందును గొందఱుందురు. శ్రేయస్కరమను హేతువుచేతనే వారు కర్మ మొనర్తురు. ఇంతకంటెను ఉన్న

తాశయములతో లోకకల్యాణమందలి అవ్యాజప్రేమచే లోకహితాభిలాషచే, దీనులకు హితమొనర్చుచు మానవ కోటికి దోడ్పడు మహాత్ములు కొందఱున్నారు. సర్వసాధారణ ముగా, పేరు ప్రఖ్యాతులను బొందవలయునను ఆశయము ఎన్నడో కాని సద్యఃఫలము నొసగజాలదు. ముదుసలులపై కాటికి కాళ్లు జాచుకొనునప్పుడు అవి లభించుచుండును. స్వార్థరహితముగా మానవుడు కర్మమొనర్చినయెడల దాని వలన నాతని కెట్టిలాభమును లేదా? ఉన్నది, దానివలన మహోత్కృష్టలాభమును బొందును. స్వార్థరాహిత్యమే విశేష ఫలదాయకము: కాని స్వార్థరాహిత్యము నవలం బించునంతటి ఓరిమి మనకు లేదు. మన శ్శరీరకహితము నాలోచించి చూచినను అయ్యది విశేషలాభదాయకమే. ప్రేమ, సత్యము, స్వార్థరాహిత్యము అనునవి మనయొక్క మహోన్నతాదర్శములు కాని కేవలము నైతిక భాషాలంకార ములు కావు; వలన నీ యాదర్శములు అఖండ శక్తిమంత ములు. ముఖ్యవిషయము, ఎట్టి స్వార్థమును మనసులో నిడు కొనక భవిష్యత్తును — స్వర్గమును — నరకమును — మఱి దేనినిగూర్చియు చింతింపక, ఐదుదినములు, కానిచో ఐదు నిమిషములు కర్మ మొనర్పగల్గినవాడు నైతిక మహావీరుడు కాగలడని గుర్తింపవలయును. ఇయ్యది కష్టసాధ్యమనుట నిజము; కాని దీని ఘనతయు, దీనివలన గలుగు మహో త్కృష్ట ప్రయోజనమును మన యంతరంగమున మనకు దెలియును. మహత్తరమైన యీ నిగ్రహము అఖండశక్తిచే గాని కలుగజాలదు; బాహ్యవ్యాపారము లన్నిటికంటెను

ఆత్మనిగ్రహము అధికతరమగుశక్తిని బ్రకటించును. నాలుగు గుఱ్ఱములబండి యెట్టినిరోధమును లేనియెడల కొండమీద నుండి మహావేగముతో క్రిందికి రావచ్చును. లేదా బండి వాడు గుఱ్ఱములను నిరోధింపవచ్చును. యథేచ్ఛముగా గుఱ్ఱములను బోనిచ్చుటయా, వానిని నిగ్రహించుటయా— వీనిలో నేది విశేషమగుశక్తిని బ్రకటించును? ఫిరంగిగుండు మహావేగమున వాయుమండలమునుండి పోయి పోయి యెచ్చటనో పడును. మఱియొకటి మార్గమధ్యమున నే గోడకో తగులుటచే ననుకొనుడు, అచట నిలిచిపోవును; ఆ తాకుడు అచట అమితమైన వేడిమిని బుట్టించుచున్నది. స్వార్థపరము, బహిర్ముఖము నగు శక్తిసామర్థ్యములన్నియు వ్యర్థమగుచున్నవి. అట్టివ్యాపారమువలన నీయందుండి వెలువడు శక్తిసామర్థ్యములు మఱల నిన్ను బొందవు; కాని స్వార్థచింతను నిగ్రహించినచో నీ కది బలాభివృద్ధికరమగును. క్రమముగ నిట్టి యాత్మనిగ్రహము సాటిలేని సంకల్పశక్తిని, ఏ క్రీస్తునో బుద్ధునో నిర్మించుశీలము నుద్భవింపజేయును. మూర్ఖు లీరహస్యము నెఱుగరు, కాని మానవకోటినంతను పాలింపదలంతురు. మూర్ఖుడైనను కృషియొనర్చి ఓరిమి వహించినచో ప్రపంచమునంతను బరిపాలింపవచ్చును. ఆతని గొన్ని సంవత్సరములవఱకు వేచియుండనిండు; పాలింపవలయు నను ఆ మూర్ఖాభిప్రాయమును నిగ్రహింపనిండు; ఆ భావము పూర్తిగా తొలగినంతనే లోకమున నాతడు అఖండశక్తి సంపన్నుడగును. జంతువులు కొన్ని కొన్ని యడుగులకు ఆవల చూడజాలనియట్లే మనలో ననేకులము కొన్ని సంవ

త్సరముల కవ్వల పరిణమించు సంఘటనములను జూడజాల కున్నాము. సంకుచితమైన చిన్న సంసారమే మన లోకము. దీని కవ్వల మన దృష్టిని బ్రసరింపజేయుటకు వలయు తాలిమి మనయొద్ద లేకుండుటచే అవినీతిపరులము, దుర్జనులము అగుచున్నాము. ఇది మన బలహీనత, శక్తిహీనత కాని మఱి యొకటి కాదు.

(అత్యంత నికృష్టకర్మములను సైతము నిరసింపరాదు. విశేషజ్ఞానవంతుడు కానివానిని స్వప్రయోజనమునకై, పేరు ప్రఖ్యాతులకొఱకై ప్రవర్తింపనిండు; కాని ప్రతిమానవుడును క్రమముగా ఉన్నతాశయములను బొందుటకై, ఉన్నతాశయములను గ్రహించుటకై సదా యత్నింపవలయును.)

"కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కదాచన*— కర్మ మొనర్చుటకు మాత్రమే కాని కర్మఫలముల నాశించుటకు నీకు అధికారము లేదు." కర్మఫలముల నటుండ నిమ్ము. కర్మఫలములను నీవు లక్షింపనేల? నీ వొకనికి సాయ మొనర్పగోరితివేని అతనికి నీయెడ నెట్టి మనోభావము ఉండవలయునను విషయమునుగూర్చి యెన్న డాలోచింపకుము. నీవొక సత్కార్యమునో ఘనకార్యమునో చేయగోరినయెడల దాని కెట్టిఫలము గలుగునో యను చింత నీకు వలదు.

ఈ కర్మాదర్శవిమర్శనమున నొక క్లిష్టసమస్య వెలువడుచున్నది. తీవ్రకర్మాచరణము ఆవశ్యకము; సదా మనము కర్మము నాచరింపవలయును. కర్మ మొనర్పనిదే

---

* భగవద్గీత, 2—47.

నిముసమైనను మనము జీవింపజాలము.† అట్టిచో విశ్రాంతి మాటయో యందురా? జీవిత మను యుద్ధరంగమున నొక వైపున నున్నది కర్మము—కర్మ మను నీ సుడిగుండములో మన మందఱము దిర్దిర మహావేగముతో త్రిప్పివేయబడు చున్నాము: మఱియొకవంక ప్రశాంతము, ఏకాంతమునగు సర్వసంగ పరిత్యాగము — సన్న్యాసజీవనము — భాసించు చున్నది. ప్రశాంతి రాజ్య మేలుచుండ సందడియు ఆడంబ రము నట నుండ నేరవు; తన మృగములతో, పూవులతో, పర్వతములతో ప్రకృతికాంత యచట విహరించు చుండును. జీవితదృశ్యములగు నీ రెంటిలో నేదియు సమగ్రమైనది కాదు. అగాధ సముద్రజలమున నుండు చేపను పైకి దీసికొని వచ్చి నంత నే అయ్యది తన్ను పరీక్షించుచున్న నీటియొత్తిడి తొల గుటచే ముక్కముక్కలై పోవురీతిని; ఏకాంతవాసమున కల వడినవానిని ప్రపంచమహాకల్లోలములోనికి దీసికొని వచ్చిన యెడల దానిచే నాతడు వికలమతియైపోవును. ఉద్వేగవంత మగు జీవితమున కలవడినవాడు ప్రశాంతినిలయమగు తావు నకు వచ్చెనేని మనస్సమాధానము నందగలడా? కలవరపడి యాతడొకవేళ మనోవైకల్యము నొందవచ్చును. ఏకాంత వాసమున, అఖండమౌనమున నెవ్వడు తీవ్రకర్మ పరత్వమును గాంచునో, తీవ్రకర్మపరత్వమున నెవ్వడు ఎడారియందు గాన నగు నిశ్శబ్దతను ఏకాంతతను గాంచునో వాడే ఆదర్శపురు షుడు. ఆత్మనిగ్రహరహస్యము నాతడు గ్రహించి యాత్మ

† "నహి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్"
—భగవద్గీత, 3-5.

నిగ్రహాసంపన్నుడై ప్రకాశించుచున్నాడు. విశేషవ్యాపార ముచే అత్యంతసంకులమగు మహానగరవీథులనుండి యాతడు వెడలుచుండునపుడు నిశ్శబ్దమగు గుహాంతరాళమున నుండెనో యనునట్లు లాతని మానసము ప్రశాంతినిలయమై యుండును; ఐన నాతడు తీవ్రకర్మాచరణపరుడై యున్నాడు. ఆతడే ఆదర్శకర్మయోగి. ఈ స్థితిని నీవు పొందినచో నిజముగా కర్మరహస్యమును గ్రహించిన వాడ వయ్యెదవు.

కాని ప్రాప్తకార్యముల నొనర్చుచు స్వార్థరాహిత్య మున దినదినాభివృద్ధి గాంచుచు ప్రారంభస్థితినుండియు మనము కర్మయోగము నారంభింపవలయును. మనము కర్మ మొనర్ప వలయును, మఱియు కర్మాచరణమునకు మనలను బురికొల్పు నాశయము లెట్టివో గమనింపవలయును, కాని ప్రారంభమున గొన్ని సంవత్సరములవఱకు మన యాశయములు విధిగా స్వార్థ పరములని గ్రహింతుము; ఐనను పూనికచే క్రమముగా ఈ స్వార్థపరత్వము తఱుగింప తుదకు నిక్కముగా స్వార్థరహిత కర్మ మొనర్ప గల్గునట్టి సమయము వచ్చితీరును. ఎన్నటి కైనను ఈ స్థితిని బొందగలమని మన మందఱము ఆశింప వచ్చును; బహుమార్గములతో నొప్పు కర్మరంగమున పూని కతో జీవయాత్ర సాగించుచుండునెడ పరిపూర్ణమగు స్వార్థ రహితస్థితిని బడయగల్గు సమయము వచ్చితీరును. ఈ స్థితిని ప్రాప్తించినంతనే మన శక్తిసామర్థ్యము లన్నియు ఏకాగ్రత నొందును; స్వతస్సిద్ధమగు జ్ఞానము దేదీప్యమానమై ప్రకాశించును.



## రెండవ అధ్యాయము

## "తనధర్మము ననువర్తించు ప్రతివ్యక్తియు మహనీయుడే"

సాంఖ్యదర్శనమునననుసరించి ప్రకృతి సత్త్వ రజస్తమస్సులను మూడు శక్తులతో గూడుకొని యున్నది. భౌతిక ప్రపంచమున నివి వ్యక్తమగువిధానము ననుసరించి వీనిని సమత్వము, సంచలనస్థితి, జడత్వము నని చెప్పవచ్చును. అంధకారము లేక చైతన్యరాహిత్యమే తమస్సనియు, రాగ ద్వేష రూపమున వ్యక్తమగు సంచలనస్థితియే రజస్సనియు, రజస్తమస్సుల సామ్యావస్థయే సత్త్వమనియు జెప్పబడును.

ఈ మూడు శక్తులును ప్రతిమానవునియందును గలవు. ఒకప్పుడు తమస్సు విశేషించి యుండును; అంతట మనము సోమరులమై కదలలేకుందుము; చైతన్యము కోల్పోయి, ఏవో కొన్ని మనోభావములచే బద్ధులమై కేవలస్తబ్ధులమై యుందుము. మఱికొన్ని వేళల రజోగుణమును ఇంకను గొన్ని వేళల నీరెండింటిసామ్యావస్థయు ప్రాబల్యమునొందియుండును. మఱియు, ఈ శక్తులలో నేదియో యొకటి సాధారణముగా ప్రకోపించియుండును. నిర్వ్యాపారత లేక సోమరితనము ఒకని లక్షణముగను, కార్యపరత లేక శక్తిసామర్థ్య ప్రకటనము మఱియొకని లక్షణముగను కర్మాకర్మములు సామ్యస్థితి నొంది యుండుటచే గలుగు సాధుత్వమును మాధుర్యమును వేఱొకని స్వభావముగను నుండవచ్చును. జంతువులలోనేమి, వృక్షములలో నేమి, మనుష్యులలో నేమి—సమస్తసృష్టియందును

వివిధములగు నీశ_క్తులించుమించుగా నేదియో యొక ప్రత్యేక రీతిని వ్య_క్తమగుచుండును.

ముఖ్యముగా కర్మయోగము స_త్త్వ రజ_స్తమస్సులను నీ ప్రకృతిశ_క్తుల యొక్క వశీకరణముతో సంబంధించి యున్నది. ఈ శ_క్తు లెట్టివో, వాని నెట్లు వినియోగించుకొన వలయునో బోధించుటచే కర్మములను మనము నేర్పుతో నొనర్చుటకై కర్మయోగము మనకు దోడ్పడును. మానవ సంఘము వివిధాంతరువులతో గూడిన వ్యవస్థ. నీతిని గూర్చి మన కందఱకును దెలియును, ధర్మమును గూర్చియు దెలియును; కాని భిన్న దేశములలో నైతికనియమములును ధార్మిక నియమములును భిన్నముగా నుండును. ఒక దేశములో నేది నీతిగను ధర్మముగను పరిగణింపబడునో అదియే మఱియొక దేశములో అవినీతిగను అధర్మముగను పరిగణింపబడవచ్చును. వివాహవిషయమున నొక దేశములో మేనరిక మంగీకరింప బడుచుండ మఱియొక దేశమున నది కేవల మధర్మముగా పరిగణింపబడుచున్నది; ఒక దేశపు జనులు తమ వదినెలనుగాని మఱదంద్రనుగాని పెండ్లియాడవచ్చును; మఱియొక దేశమున కేవల మది నీతిబాహ్యము. ఒక దేశమున జను లొక్కసారి మాత్రమే వివాహమాడనగును, మఱియొక దేశమున ననేక పర్యాయములు పెండ్లిచేసికొనవచ్చును—వైవాహిక నీతి నియమము లీ విధముగా నున్నవి. ఇట్లే ఇతర నైతిక నియమములందును అభిప్రాయభేదములు విశేషముగా గలవు. ఐనను విశ్వజనీనమగు నైతికనియమము లుండవలయునని మనము భావింతుము.

ధార్మికవిషయముకూడ నిట్టిదే. ధర్మతత్త్వమును గూర్చి వివిధజాతులలో విశేష భిన్నాభిప్రాయములు కలవు. ఒకదేశమున నొకడు కొన్ని కార్యములు చేయనియెడల జను లాతడధర్మముగా బ్రవర్తించెనందురు. ఐనను సమస్తజను లకును వర్తించు ధార్మికనియమము లుండవలయునని మనకు దెలియును. ఇదే విధమున సంఘములో గొందఱు కొన్ని కర్మములు తమకు విధ్యుక్తములని భావించుచుండ మఱి కొందఱు అందులకు కేవలవ్యతిరిక్తముగా దలచుచు, ఆ కర్మ ములను జేయవలసివచ్చుచో మహాపరాధము వాటిల్లునని భయమందుదురు. మనకివ్విషయమై రెండుమార్గములు తేట తెల్లముగానున్నవి,—తత్త్వాన్వేషణమున నొకేమార్గము కల దనియు తదితరములన్నియు అధర్మములనియు, అక్రమము లనియు భావించు మూర్ఖులవిధాన మొకటి,—మన మనఃస్థితి ననుసరించి లేక మన స్థితిగతుల ననుసరించి విధ్యుక్త కర్మ మును ధర్మమును మాఱుచుండవచ్చునని యంగీకరించు ధీమంతుల విధానము మఱియొకటి. విధ్యుక్తధర్మములలో— నీతి నియమములలో—వివిధాంతరువులు గలవనియు జీవితమున నొక స్థితికిగాని, ప్రత్యేక పరిస్థితులకుగాని అనువర్తించు నీతి నియమములు తదితరమున కనువర్తింపవనియు అనువర్తింప జాలవనియు గ్రహించుటయే ఇందలి ముఖ్య విషయము.

ఇందుల కొక యుదాహరణము:—మహనీయులగు నాచార్యులందఱును "చెడుగునకు ప్రతికారము చేయకు" మనియు, "అప్రతికారమే అత్యున్నతమగు నైతికాదర్శ" మనియు బోధించియున్నారు. మనలో గొందఱు పూర్తిగా

ఈ సూత్రము ననుసరింప యత్నించిరేని సాంఘికవ్యవస్థ యంతయు తాఱుమాఱై దుర్మార్గులు మన సంపదలను ప్రాణములనుగూడ హరించుటయు, యథేచ్ఛగా విహరించుటయు, సంభవించునని మన మెఱుగుదుము. అట్టి యప్రతికారమును ఒక్కదిన మాచరించిననుగూడ మహాప్రమాదము వాటిల్లవచ్చును. ఐనను "చెడుగునకు ప్రతికారము చేయకుము" అను బోధనయందలి సత్యమును సహజముగా మన యంతరంగమున మన మెఱుగుదుము. ఇయ్యది మహోన్నతాదర్శముగా మనకు గాన్పించును; ఐనను ఈ సిద్ధాంతమునుమాత్రమే బోధించినచో మానవకోటిలో విశేషభాగమును నిరసించుటయు, సదా తాము చేయుచున్నది అధర్మమని గణుతింపజేసి లోకులకు కార్యాచరణమున మనోవ్యథగల్గించుటయు సిద్ధించును; దానిచే వారికి మనోదౌర్బల్యము సంభవించును. మఱియు నిరంతరమగు నిట్టియాత్మనిరసనము మఱియేయితర దౌర్బల్యముకంటెను విశేషమగు దౌర్జన్యమునకు హేతువగును. తన్ను తాను ద్వేషించుకొన నారంభించినవానికి పతనద్వారము ఈవలనే తెఱవబడియున్నది; సంఘువిషయముకూడ నిట్టిదే.

మనలను మనము ద్వేషించుకొనకుండుటయే మన ప్రథమధర్మము. ఏలన, అభివృద్ధినొందుటకు మొదట మనయందును తరువాత భగవంతునియందును విశ్వాసము గలిగి యుండవలయును,—శ్రద్ధగలిగి యుండవలయును. ఆత్మవిశ్వాసములేనివానికి భగవంతునియందు విశ్వాసము గలుగుట కలలోనివార్త. చెడుగునకు ప్రతికారము చేయువాడు

సదా స్వతస్సిద్ధమగు నధర్మము నవలంబించువాడనికాక, పరిస్థితుల ననుసరించి, ప్రతికారము ఆతని విధ్యుక్తధర్మము గూడ కావచ్చుననియు, నీతిధర్మములు భిన్నపరిస్థితులలో భిన్నముగా నుండవచ్చుననియు మనము గుర్తింపక తప్పదు.

అప్రతికారము అత్యున్నత ప్రేమాదర్శమను నెపమున అర్జునుడు యుద్ధరంగమున దన ప్రతిపక్షులు తనకు బంధువులు, మిత్రులునని చెప్పి యుద్ధమొనర్ప నిరాకరించినందులకై శ్రీకృష్ణుం డాతని కపటియనియు, పిఱికివాడనియు భగవద్గీత యందలి రెండవ యధ్యాయమున బలికియున్నాడు.* భగవద్గీతను జదువునపుడు ఈ యధ్యాయమును జూచి పాశ్చాత్యులగు మీలో ననేకు లాశ్చర్యపడి యుండవచ్చును. సర్వవిషయములందును అత్యంతమైన అన్వయస్థితియు అత్యంతమైన వ్యతిరేకస్థితియు నొకేవిధముగా నున్నట్లు తోచును; ఇయ్యది మన మందఱము గ్రహింపవలసిన గొప్ప గుణపాఠము; తేజఃస్పందనములు అత్యంతమందముగా నున్నప్పుడు మనము వానిని గనజాలము, అత్యంత తీవ్రముగా నున్నను గనజాలము. శబ్దముయొక్క విషయముకూడ నిట్టిదే; మిక్కిలి తక్కువస్థాయిలో నున్నప్పుడు దానిని మనము వినజాలము; మిక్కిలి హెచ్చుస్థాయిలో నున్నప్పుడును వినజాలము. ప్రతికారమునకును అప్రతికారమునకును

---

* శ్లో. "క్లైబ్యం మాస్మగమః పార్థ నైత త్త్వయ్యుపపద్యతే,
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరన్తప."
—భగవద్గీత, 2—3.

గల భేద మిట్టిది. బలహీనుడగుటచే, సోమరితనముచే, ప్రతిఘటింపజాలక యొకడు ప్రతిఘటింపడు—అంతియే కాని మనఃపూర్వకముగా గాదు. మఱియొకడు తాను కోరినచో అప్రతిహతమైన దెబ్బకొట్టుటకు సమర్థుడనని యెఱుగును; ఐన నాతడు కొట్టకుండుటయేగాక తన శత్రువుల నాశీర్వదించును. దౌర్బల్యముచే ప్రతిఘటింపనివాడు పాపము చేయుచున్నాడు. అందుచే తాను ప్రతిఘటింపకుండుటవలన నెట్టిలాభమును బొందజాలడు. ఇక రెండవవాడో, ప్రతిఘటించినయెడల పాపమున కొడిగట్టుకొనును. బుద్ధుడు సింహాసనమును బరిత్యజించి చక్రవర్తి పదవిని త్యజించెను; అట్టి దాతని త్యాగము. కాని త్యజించుట కేమియు లేని బిచ్చగాని విషయమున త్యాగమునుగూర్చి ప్రస్తావింపబనియే లేదు. కాబట్టి యీ యప్రతికారమునుగూర్చియు ఆదర్శప్రేమను గూర్చియు నిజముగా మన యభిప్రాయమేమో బాగుగా ఆలోచించుకొనవలయును. కావున శక్తిగలిగియుండియు దానిని త్యజించి ప్రతిఘటింపకుండునెడల ప్రేమపూర్ణమగు ఘనకార్యము నొనర్చినవారల మగుదుము; కాని ప్రతిఘటింపజాలకుండియు మహోన్నతప్రేమ ప్రేరితులమని భ్రమించునెడల కేవల నీచకార్యము చేసినవార మయ్యెదము. అర్జునుడు యుద్ధరంగమున దన్నెదిర్చియున్న మహాసైన్యములను జూచి పిఱికివా డయ్యెను; దేశమునెడను రాజునెడను ఆతని విధ్యుక్తధర్మము నాతని "ప్రేమ" మఱపించెను. శ్రీకృష్ణు డాతని కపటి యనుట కిదియే కారణము.

"క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వ య్యుపపద్యతే,
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరన్తప.
* * *
అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే,
గతాసూ నగతాసూంశ్చ నానుశోచన్తి పణ్డితాః"*

"ఓ పరంతపా; భయపడకుము, నీకిది యుచితము కాదు. ఈ తుచ్ఛమైన యధైర్యమును విడిచి యుద్ధమునకు లెమ్ము!

"దుఃఖింపదగనివారినిగూర్చి దుఃఖించుచు పండిత వచనములను బలుకుచున్నావు. ఆత్మానాత్మ వివేకజ్ఞులగు పండితులు చనిపోయినవారలనుగూర్చికాని బ్రదికియున్న వారలనుగూర్చికాని దుఃఖింపరు."

కర్మయోగప్రధానాశయ మిట్టిది. అప్రతికారమే మహోన్నతాదర్శమని—ప్రత్యేకముగా దన యధీనమున నున్న శక్తి నీ యప్రతికారము మహోత్తమముగా బ్రకటించునని—చెడుగునకు బ్రతికారముచేయు టనునది యీ దివ్యశక్తిని బడయుటకు కేవల సాధనభూతమని—గ్రహించు నాతడే కర్మయోగి. ఈ మహోత్తమాదర్శమును బ్రాపించుటకుముందు చెడుగునకు బ్రతికారమును జేయుటయే మానవుని కర్తవ్యము; అందులకై యాతని కృషిచేయనిండు, పోరాడనిండు; దుర్జనుని చేతికొలదియు, బలిమికొలదియు గొట్టనిండు. ఇట్లు ప్రతికారమును జేయుశక్తిని బొందిననే కాని అప్రతికారము సుగుణము కాజాలదు.

---

* భగవద్గీత, 2—3, 11.

మా దేశమున నన్నొకప్పు డొకడు కలిసికొనినాడు. ఆతడు జిజ్ఞాసయనునది లవలేశమును లేక కేవల పశు ప్రాయుడై, మందుడై యున్నవాడని అంతకుముందే నాకు దెలియును. భగవంతుని దెలిసికొనుటకు దా నేమిచేయ వలయుననియు ముక్తి తనకెట్లు లభింపగలదనియు అతడు న న్నడిగినాడు. "అసత్యము చెప్పగలవా?" అని నే నతనిని బ్రశ్నించితిని. "నాచేతగాదు" అని యాతడు సమాధానము చెప్పెను. "ఐనపక్షమున అసత్యము చెప్పుట నీవు నేర్చు కొనవలయును. ఎవ్వడైనను కేవల పశుప్రాయుడై లేక కాష్ఠప్రాయుడై యుండుటకంటె అసత్యము చెప్పుట మంచిది. నీవు మందుడవు; నిర్మలము, ప్రశాంతము, నిష్క్రియమునగు మహోన్నతస్థితిని పొందినవాడవుకావు; ఏదేని దుష్కార్యమును జేయుటకుగూడ శక్తిచాలనంతటి మందుడవు నీవు." ఇది యాతనికి నేను చేసిన హితబోధ. అది యత్యంతము అసాధారణ సందర్భమనుట నిజము; నే నాతనితో పరిహాసముచేసితిని. కాని రాజసికస్థితినుండి ప్రశాంతినిలయమగు సంపూర్ణసాత్త్వికస్థితిని బొందుటకై మానవుడు కర్మపరుడై యుండవలయుననియే నాతాత్పర్యము.

అలసతను, మాంద్యమును సర్వవిధములను తొలగించుకొనవలయును. కార్యపరత్వమనగా ప్రతికారమని భావము. సర్వవిధములగు దౌర్జన్యమును ప్రతిఘటింపుము, శారీరమానసిక దౌష్ట్యము నెదుర్కొనుము. "ఎవ్వరిని ద్వేషింపకుము, చెడుగునకు ప్రతికారముచేయకు"మని చెప్పుట సులభమే కాని, అనుష్ఠానమును జూచుసరికి అ

విధమగు బోధనలయొక్క తాత్పర్యమేమో మనకు బోధపడును. లోకము మనవైపు చూచునప్పుడు అప్రతీకారమును నటింపవచ్చును, కాని మన యంతరంగమున మన క్రుళ్లు మనకు తెలియును. అప్రతీకారమునకు వలయు ప్రశాంతి మనయొద్ద పూజ్యమని మనకు అనుభవవేద్యమే! ప్రతీకారము చేయుటయే మంచిదని మనకు దోచును. నీవు ధనమును వాంఛించుచు ధనాపేక్షగలవానిని లోకమంతయు పరమ దుర్మార్గునిగా పరిగణించునని తెలిసికొని, తత్కారణమున బహుశః ధనార్జనప్రయత్నమునకు దిగనిపక్షమున నీ మనసు మాత్రము రేయింబవళ్లు ధనచింతయందే లగ్నమై యుండును. ఇట్టి కాపట్యమువలన లేశమును ప్రయోజనములేదు. సంసారమున నిమగ్నుడవుకమ్ము. అట్లు కొంతకాలమైన వెనుక, అందలి సుఖదుఃఖముల నన్నిటిని అనుభవించిన పిమ్మట వైరాగ్యము కలుగును, ప్రశాంతి రొండవును. కావున నీ యధికారవాంఛను తదితరవాంఛలను తీర్చుకొనుము. తీర్చుకొనిన పిమ్మట ఇవియన్నియు కేవల తుచ్ఛవిషయములని గ్రహించు సమయము వచ్చితీరును; అంతియే కాని ఈ వాంఛలు నెఱవేఱనిదే, ఈ వ్యాపారమును జేయనిదే—ప్రశాంతినిలయమగు ఆత్మసమర్పణస్థితికి నీవు వచ్చుట యసంభవము. త్యాగవైరాగ్యములనుగూర్చి వేలకొలది సంవత్సరములనుండియు బోధనలు జరుగుచునేయున్నవి. చిన్ననాటినుండియు ప్రతిమానవుడును వానినిగూర్చి వినుచునే యున్నాడు. కాని నిజముగా ఆ స్థితిని బొందిన మానవులు అరుదుగా గాని లేరు. నిజముగా ప్రశాంతియుతులు, ప్రతి

కారమన నెట్టిదో యెఱుగనివారునగు వ్యక్తులను నా జీవిత మున నిరువదిమందిని జూచితినో లేదో చెప్పజాలను; మఱి నేను ప్రపంచార్ధభాగమున బర్యటన మొనర్చియున్నాను.

ప్రతిమానవుడును తనయాదర్శమును గైకొని దాని నవలంబించుటకు బ్రయత్నింపవలయును; తా నెన్నటికిని అవలంబింపజాలని యితరాదర్శములను గైకొనుటకంటె అభివృద్ధి కిదియే నిశ్చితమార్గము. ఉదాహరణమునకు మన మొక బిడ్డను గైకొని తోడ్తోడనే దానిని ఇరువదిమైళ్లు నడువ నియమించినయెడల ఆ బిడ్డ చావనైన జచ్చును, లేదా వేయింట నొకటి ఆ యిరువదిమైళ్ల పర్యంతము ప్రాకి, యలసిపోయి, సగముచచ్చి, గమ్యస్థానము జేరుకొనును. లోకములో సర్వసాధారణముగా మనముచేయ యత్నించు కార్యము లీ విధముగా నున్నవి. ఏ సంఘమునగాని స్త్రీ పురుషు లెల్లరు ఒకేవిధమైన ధోరణిగలవారు కారు. కార్యాచరణమున నొకేవిధమైన శక్తిసామర్థ్యములు గలవారును కారు; వారికి భిన్నాభిప్రాయము లుండితీరవలయును. ఏ యాదర్శమునుగాని నిరసించుటకు మనకు హక్కులేదు. స్వీయాదర్శసిద్ధికై యథాశక్తిగా ప్రతివ్యక్తివి ప్రయత్నింపనిండు. నేను నీ యాదర్శమునుబట్టిగాని, నీవు నా యాదర్శమునుబట్టికాని విమర్శింపబడదగదు. రేగుచెట్టును మఱ్ఱిచెట్టుయొక్కస్థితి ననుసరించికాని, మఱ్ఱిచెట్టును రేగుచెట్టుయొక్కస్థితి ననుసరించికాని పరీక్షింపదగదు. మఱ్ఱిచెట్టును బరీక్షించుటకు మఱ్ఱిచెట్టుయొక్క పరిస్థితులనే గైకొనవలయును; రేగుచెట్టునకు రేగుచెట్టుయొక్క పరిస్థితులనే పాటింపవలయును.

అనేకత్వమం దేకత్వమనునది సృష్టినియమము. వ్యక్తిగతముగా స్త్రీ పురుషులలో నెట్టి తారతమ్యము లున్నను మూలమునం దేకత్వము గలదు. సాంఘికముగా నేమి, వ్యక్తిగతముగానేమి, స్త్రీపురుషులందుగల భిన్నభావములు, భిన్నశీలములు, సృష్టిలోనున్న సహజమైన భేదములు. కావున ఒకేనియతి ననుసరించి వారి గుణదోషములను విమర్శింపరాదు. ఒకే యాదర్శమును వారందఱును అవలంబింపవలయు ననరాదు. కేవల మది అస్వాభావికమైన అలజడిని గల్గించును. తత్ఫలితముగా మానవుడు ఆత్మద్వేషమున కెరయై పారమార్థిక శీలమునకును సౌజన్యమునకును దూరు డగును. స్వీయోన్నతాదర్శము ననుసరింప యత్నించుటకును ఆయాదర్శము వీలైనంతవఱకు సత్యసమ్మతమై యుండ బ్రయత్నించుటకును బ్రతిమానవుని బ్రోత్సహించుటయే మన కర్తవ్యము.

అతి ప్రాచీనకాలమునుండియు హైందవ ధర్మశాస్త్రములం దీ తత్త్వము పాటింపబడియున్నది. బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్న్యాసము అనెడు వివిధాశ్రమముల ననుసరించు వివిధవ్యక్తులకు హైందవ ధర్మశాస్త్రములందు వివిధధర్మములు విధింపబడియున్నవి.

హిందువుల సనాతన ధర్మశాస్త్రముల ననుసరించి ప్రతివ్యక్తిజీవితమును, సర్వజన సాధారణ ధర్మముల మాటయటుండ ప్రత్యేకధర్మములచే నిబద్ధమై యున్నది. బ్రహ్మచర్యాశ్రమముతో హైందవుడు జీవిత మారంభించును; పిమ్మట గృహస్థు డగును. వృద్ధదశలో సంసారమునుండి

తొలగి వర్తించును. తుదకు సర్వసంగ పరిత్యాగియై సన్న్యాస మవలంబించును. ఇందలి ప్రత్యాశ్రమమునకును ప్రత్యేక ధర్మములు విధింపబడియున్నవి. వస్తుతః ఈ యాశ్రమములలో న్యూనతాధిక్యము లనునవి లేవు. పారమార్థిక కర్మ పరాయణుడగు బ్రహ్మచారియొక్క జీవిత మెంత గొప్పదో గృహస్థుని జీవితమును అంత గొప్పది యే. సింహాసనమునందలి చక్రవర్తి యెంతటి ఘనుడో, స్తవనీయుడో, వీథులందలి పాకివాడును అంతటి ఘనుడే, స్తవనీయుడే. సింహాసనమునుండి యాతని దొలగించి పాకివానిపని చేయుమనుడు. అపు డాత డెట్లు వర్తించునో కనుడు. పాకివానిని చక్రవర్తిని జేసి యాత డెట్లు పాలించునో చూడుడు. సంసారమున మెలగువానికంటె సంసారమును త్యజించినవాడు ఘను డనుట నిష్ప్రయోజనము; సంసారమును పరిత్యజించి, స్వేచ్ఛగా, సుఖముగా, జీవించుటకంటె సంసారమున మెలగుచు భగవంతుని గొలుచుట నిక్కముగా కష్టతరము. కాలక్రమమున భారత దేశమందలి చతురాశ్రమములును గార్హస్థ్యసన్న్యాసాశ్రమములలోనికి దిగినవి. గృహస్థుడు పౌరుడై తనవిధ్యుక్త ధర్మములను నిర్వహించుచుండ, సన్న్యాసి భగవదుపాసనమును ధర్మప్రచారమును జేయుచు కేవల పారమార్థికవిషయములందు తన శక్తిసామర్థ్యములను వినియోగించుచుండును. మహానిర్వాణతంత్రమునుండి యివ్విషయమునకు సంబంధించిన కొన్ని ఘట్టములను మీకు జదివి వినిపించెదను;* దానివలన

* స్వామి మూలశ్లోకముల యొక్క తాత్పర్యమును దెలుపుచున్నాడు. మూలము నిట నుదాహరించుచున్నాము :

మానవుడు గృహస్థుడుగానుండి తన ధర్మముల నన్నిటిని సమగ్రముగా నిర్వర్తించుట యెంత కష్టసాధ్యమో మీకు దెలియగలదు.

గృహస్థుడు భగవద్భక్తుడై యుండవలయును; భగవ ద్ద్యానమే ఆతని జీవితపరమావధి. సదా కర్మనిరతుడై తన విధ్యుక్తధర్మములను నిర్వహించుచు కర్మఫలముల నీశ్వరార్పణ మొనర్పవలయును.[1]

కర్మ మొనర్చుచు కర్మఫలము నాశింపకుండుట— అనగా ఒకనికి సాయ మొనర్చి యాతడు నీయెడ కృతజ్ఞుడై యుండవలయునని భావింపకుండుట— ఏదేని సత్కార్య మొనర్చి దానివలన నీకు పేరు ప్రఖ్యాతులు గలుగునో కలుగవో యనువిషయమే తలపెట్టకుండుట—లోకమున నిజముగా మహాకష్టసాధ్యము. వట్టి పిఱికిపందకూడ లోకము తన్ను మెచ్చుకొనునప్పుడు ధైర్యశాలి యగును. లోకులు తన్ను స్తుతించునపుడు మూర్ఖుడును ధీరుడై వర్తించును, ధీర పురుషోచితకార్యముల నొనర్చును; కాని లోకులు తన్ను గూర్చి చేయు స్తుతులను లేశమేనియు గణింపక సర్వదా సత్కార్యముల నొనర్చుచుండుట నిజముగా మహోన్నత స్వార్థత్యాగము. జీవనోపాధి నార్జించుట గృహస్థునకు మహా విధ్యుక్తధర్మము. కాని తత్కార్యమును కల్లలాడుటచేతను పరులను మోసగించుటచేతను, పరద్రవ్యాదుల నపహరించుట

1. "బ్రహ్మనిష్ఠో గృహస్థస్స్యాత్ బ్రహ్మజ్ఞానపరాయణః,
యద్యత్ కర్మ ప్రకుర్వీత తద్బ్రహ్మణి సమర్పయేత్."

చేతను మాత్రము చేయదగదు; మఱియు ఈశ్వర సేవయు దీనజనసేవయు తన జీవిత ధర్మములని యాతడు గుర్తింప వలయును.[2]

తలిదండ్రులు సాక్షాద్భగవత్స్వరూపులని గ్రహించి గృహస్థుడు సదా, సర్వవిధములను వారల సంతుష్టుల నొనర్ప వలయును.[3] ఎవ్వని తల్లిదండ్రులు సంతుష్టులో వానిచే భగవానుడు సంతుష్టుడగును. తల్లిదండ్రులతో పరుషవాక్యము లాడని నందనుడు నిజముగా నందనుడు.[4]

తల్లిదండ్రులయెదుట నెన్నడును పరిహాసము చేయరాదు. ఔద్ధత్యముగాని, కోపముగాని, క్రోధముగాని చూపరాదు.[5] తల్లిదండ్రులయెదుట అవనతుడై నిలువవలయును. కూర్చుండ నాజ్ఞాపితుడగువఱకు కూరుచుండరాదు.[6]

---

2. న మిథ్యాభాషణం కుర్యాత్ నచ శాఠ్యం సమాచరేత్,
దేవతాతిథిపూజాసు గృహస్థో నిరతో భవేత్." 24

3. "మాతరం పితరం చైవ సాక్షాత్ ప్రత్యక్షదేవతామ్,
మత్వా గృహీ నిషేవేత సదా సర్వప్రయత్నతః. 25

4. తుష్టాయామ్ మాతరి శివే తుష్టే పితరి పార్వతి,
తవ ప్రీతిర్భవేద్దేవి పరబ్రహ్మ ప్రసీదతి. 26

5. ఔద్ధత్యం పరిహాసఞ్చ తర్జనం పరిభాషణమ్,
పిత్రోరగ్రే నకుర్వీత యదిచ్ఛే దాత్మనో హితమ్. 30

6. మాతరం పితరం వీక్ష్య నత్వోత్తిష్ఠేత్ ససంభ్రమః,
వినాజ్ఞయా నోపవిశేత్ సంస్థితః పితృశాసనే. 31

—మహానిర్వాణతంత్రము, అష్టమోల్లాసము.

తల్లికిని, తండ్రికిని, బిడ్డలకును, భార్యకును, పేదలకును బెట్టనిదే, గృహస్థుడు భుజింపరాదు; అటుల భుజించుట పాప కార్యము.[7] ఈ శరీరమునకు తలిదండ్రులే కారణభూతులుం కావున వారలకు హితమొనర్చుటకై మానవు డెన్నికష్టముల నైన ననుభవించుట కర్తవ్యము.[8]

తనభార్యయెడలను అతని విధ్యుక్తధర్మ మిట్టిదే; భార్య నాతడు దూషింపరాదు. కేవలము తల్లిగా భావించి యామెను పోషింపవలయును. తా నెంతటి మహాకష్టముల ననుభవించుచున్నను భార్యపై కోపింపరాదు.[9]

పరస్త్రీనిగూర్చి చింతించువాడు——కేవల మానసికముగా పరస్త్రీని స్పృశించినను ——ఘోర నరకమునకు బోవును.[10]

---

7. మాతరం పితరం పుత్రం దారా నతిథి సోదరాన్,
హిత్వా గృహీ నభుఞ్జీయాత్ ప్రాణైః కణ్ఠగతైరపి. 33
వఞ్చయిత్వా గురూన్ బన్ధూన్ యో భుఙ్క్తే స్వోదరంభరః,
ఇహైవలోకే గర్హ్యోఽసౌ పరత్ర నారకీ భవేత్. 34

8. "జనన్యా వర్ధితో దేహః జనకేన ప్రయోజితః,
స్వజనైః శిక్షితః ప్రీత్యా సోఽధమస్తాన్ పరిత్యజేత్. 36
ఏషామర్థే మహేశాని కృత్వా కష్టశతాన్యపి,
ప్రీణయేత్ సతతం శక్త్యా ధర్మో హ్యేష సనాతనః. 37

9. నభార్యాం తాడయేత్క్వాపి మాతృవత్ పాలయేత్ సదా,
నత్యజేత్ ఘోరకష్టేఽపి యది సాధ్వీ పతివ్రతా. 39

10. స్థితేషు స్వీయదారేషు స్త్రియమన్యాం నసంస్పృశేత్,
దుష్టేన చేతసా విద్వాన్ అన్యథా నారకీ భవేత్. 40

——మహానిర్వాణతంత్రము, అష్టమోల్లాసము.

స్త్రీలయెదుట అసభ్యసంభాషణ చేయరాదు. తనశక్తి సామర్థ్యములనుగూర్చి ప్రగల్భము లాడరాదు. నే నిది చేసితి నది చేసితినని చెప్పరాదు.[11]

ధనముచే, వస్త్రములచే, ప్రేమచే, నమ్మికచే, మధుర వాక్కులచే గృహస్థుడు తన భార్యను సంతుష్ట నొనర్పవల యును; ఆమెమానసము క్షోభించుకార్య మెన్నడును చేయ రాదు. పతివ్రతయగు భార్యయొక్క ప్రేమను బొందగల్గిన వాడు సమస్త ధర్మములందును కృతకృత్యు డగుచున్నాడు; సమస్త సద్గుణముల నార్జించుచున్నాడు.[12]

బిడ్డలయెడ గృహస్థు డవలంబింపవలసిన ధర్మము లివి:—నాలుగేండ్లప్రాయము వచ్చువఱకును పుత్త్రుని ప్రేమానురాగములతో పెంచుచు పదునారేండ్లవఱకును విద్యాబుద్ధులను గఱపవలయును.[13] ఇరువదియేండ్లప్రాయ మున నాతని నేదియో యొక యుద్యోగమున లేక కృషి యందు నియోగింపజనును. తండ్రి యపు డాతని ప్రేమతో

11. విరలే శయనం వాసం త్యజేత్ ప్రాజ్ఞః పరస్త్రియా,
అయుక్త భాషణం చైవ స్త్రియం శౌర్యం నదర్శయేత్." 41

12. "ధనేన వాససా ప్రేమ్ణా శ్రద్ధయామృతభాషణైః,
సతతం తోషయేత్ దారాం నాప్రియం క్వచిదాచరేత్. 42
యస్మిన్ నరే మహేశాని తుష్టా భార్యా పతివ్రతా,
సర్వోధర్మః కృతస్తేన భవతీ ప్రియ ఏవసః. 43

13. చతుర్వర్షావధి సుతాన్ లాలయేత్ పాలయేత్ సదా,
తతః షోడశపర్యన్తం గుణాన్ విద్యాంచ శిక్షయేత్. 44
—మహానిర్వాణతంత్రము, అష్టమోల్లాసము.

తన సమానునిగా జూడవలయును.[14] సరిగా నిదియే విధముగా కుమార్తెను పెంచి విశేషశ్రద్ధతో నామెకు విద్యాబుద్ధులను గఱపవలయును. వివాహ సమయమున తండ్రి యామెకు నగలను ధనము నొసగవలయును.[15]

ఇక నాతనికి దనయన్నదమ్ములయెడ, అక్కచెల్లెండ్ర యెడ, పేదలై యున్నయెడల వారిబిడ్డలయెడ, మిగిలిన తన బంధువర్గము నెడ, స్నేహితులయెడ, సేవకులయెడ విధ్యుక్త ధర్మములు కలవు.[16] పిమ్మట తన గ్రామవాసులయెడలను, బీదలయెడలను, ఎవరైన గానిండు—తనసాయము నర్థించు వారలయెడలను గృహస్థునకు ధర్మము లేర్పడి యున్నవి.[17] తగినంత స్థితిపరుడై యుండియు గృహస్థుడు తన బంధుగులకును పేదలకును బెట్టనియెడల నట్టివాడు మానవమాత్రుడు గాడనియు వట్టి పశువనియు గ్రహింపుడు.[18]

---

14. వింశత్యబ్దాధికాన్ పుత్రాన్ ప్రేరయత్ గృహకర్మసు,
    తతస్తాం స్తుల్యభావేన మత్వా స్నేహం ప్రదర్శయేత్." 45
15. "కన్యాప్యేవం పాలనీయా శిక్షణీయాతి యత్నతః,
    దేయా వరాయ విదుషే ధనరత్న సమన్వితా. 47
16. ఏవం క్రమేణ భ్రాతౄంశ్చ స్వసృభ్రాతృసుతానపి,
    జ్ఞాతీన్ మిత్రాణి భృత్యాంశ్చ పాలయేత్ తోషయేత్ గృహీ. 48
17. తతః స్వధర్మ నిరతాన్ ఏకగ్రామ నివాసినః,
    అభ్యాగతా నుదాసీనాన్ గృహస్థః పరిపాలయేత్. 49
18. యద్యేవం నాచరేత్ దేవి గృహస్థో విభవే సతి,
    పశురేవ సవిజ్ఞేయః సపాపీ లోకగర్హితః. 50

—మహానిర్వాణతంత్రము; అష్టమోల్లాసము.

వస్త్రాహారములయందు—శరీరపోషణము నందు—తలదువ్వుకొనుటయందు—వ్యామోహము కూడదు.[19] గృహస్థుడు పవిత్రహృదయుడై, పరిశుద్ధశరీరుడై యుండుటయేగాక కర్మపరాయణుడై యుండవలయును.[20]

శత్రువుల విషయమున గృహస్థుడు వీరుడై వర్తింప నొప్పును. శత్రువుల కాతడు ప్రతికారము చేయవలయును. ఇది గృహస్థుని విధి. అంతియే కాని యొక మూల గూర్చుండి యేడ్చుచు అప్రతికారమునుగూర్చి యర్థరహితప్రలాపము లాడగూడదు. శత్రువులయెడ శౌర్యమును బ్రకటింపనియెడల ఆతడు తన విధ్యుక్తమును నెఱవేర్పనివా డగును. గురువుల యెడలను బంధుగులయెడలను ఆతడు మేకపిల్లవలె శాంతమూర్తియై మెలగవలయును.[21]

దుర్మార్గులను గౌరవింపకుండుట గృహస్థుని విధ్యుక్తధర్మము; దుర్మార్గులయెడ గౌరవము చూపినచో దౌర్జన్యమును పోత్సహించినవా డగును. మఱియు గౌరవార్హులగు సజ్జనుల నవజ్ఞ చేసినను తప్పు చేసినవా డగును. స్నేహము నొనర్చుటలో మైమఱచి సంచరింపరాదు; కనబడినవారితో నెల్ల

19. నిద్రాలస్యం దేహయత్నం కేశవిన్యాసమేవచ,
ఆసక్తిమశనే వస్త్రే నాతిరక్తం సమాచరేత్." 51

20. "యుక్తాహారో యుక్తనిద్రో మితవాక్ మితమైథునః,
స్వచ్ఛో నమ్రః శుచిర్దక్షో యుక్తః స్యాత్ సర్వకర్మసు. 52

21. శూరశ్శత్రౌ వినీతస్స్యాత్ బాంధవే గురుసన్నిధౌ,
జుగుప్సితాన్ నమన్యేత నావమన్యేత మానినః." 53

—మహానిర్వాణతంత్రము, అష్టమోల్లాసము.

స్నేహము చేయుచు నియమితమార్గమును విడువదగదు. తాను స్నేహము చేయదలచినవారి చర్యలను, పరులతో వారి వ్యవహారధర్మములను గనిపట్టి వానినిగూర్చి పర్యాలోకించి మఱి వారితో స్నేహము చేయవలయును.[22]

తన పేరు ప్రఖ్యాతులనుగూర్చి పలువురి యెదుటను సంభాషింపరాదు. తన శక్తిసామర్థ్యములను గూర్చియు, తన సంపదను గూర్చియు లేక రహస్యముగా దనకు దెలుపబడిన విషయములను గూర్చియు ప్రసంగింపరాదు. ఈ మూడు విషయములను గూర్చియు గృహస్థుడు మాటాడరాదు.[23]

తాను దరిద్రుడనని కాని భాగ్యవంతుడనని కాని చెప్పరాదు—తన సిరిసంపదలనుగూర్చి ప్రగల్భములు పలుకజనదు. తన యభిప్రాయములను వెలిబుచ్చరాదు. ఇది యాతని పరమధర్మము. ఇయ్యది కేవల లౌకికజ్ఞానముకాదు. ఇటు లొనర్పని యెడల లోకు లాతని నధర్మవర్తను డందురు.

సంఘమున కంతటికిని గృహస్థుడే ఆధారభూతుడు, ఆతడే ప్రాపు; ముఖ్యమగు నార్జనపరుడు. దరిద్రులు, దుర్బలులు, పనిచేయని బిడ్డలు, స్త్రీలు—ఎల్లరును గృహస్థుని మీదనే నిర్భరపడియుందురు; కావున నాతడు పరిపాలింప

22. "సౌహార్దం వ్యవహారాంశ్చ ప్రవృత్తిం ప్రకృతిం నృణామ్,
సహవాసేన తర్కైశ్చ విదిత్వా విశ్వసేత్తతః. 54

23. స్వీయం యశః పౌరుషంచ గుప్తయే కథితం చ యత్,
కృతం యదుపకారాయ ధర్మజ్ఞో న ప్రకాశయేత్." 56

—మహానిర్వాణతంత్రము, అష్టమోల్లాసము.

వలసిన కొన్ని ధర్మము లుండవలయును, ఈ ధర్మము లాత నికి కార్యాచరణమునకు వలయు మనోదార్ఢ్యము గల్గించు నవై యుండవలయునుకాని, ఆదర్శవ్యతిరిక్తములగు కార్య ములను జేయుచున్నట్లాతనికి దోపించునవై యుండరాదు. కావున నాత డేదైన పొరపాటు చేసినప్పుడుకాని, దౌర్బల్య మున కధీను డైనప్పుడుకాని నలువురియెదుటను తనగుట్టు వెల్లడించుకొనగూడదు; మరియు నేదేని యుద్యమము నారం భించియుండునప్పుడు తన కందు జయము లభింపదని నిశ్చయ ముగా నెఱిగియుండియు దానిని వెల్లడింపరాదు.[24] తన లోప మును తా నట్లు వెల్లడిచేయుట పిలువనిపేరంట మగుటయే గాక మనోదౌర్బల్యహేతువై జీవితమున విధ్యుక్తకర్మాచరణ మునకు ద న్నసమర్థుని జేయును. విద్యాధనముల నార్జించు టకై శక్తివంచనలేక ప్రయత్నించుట విధ్యుక్తము. తనవిధిని నెఱవేర్పనిచో ఆతడు గృహస్థు డనిపించుకొనజాలడు. ధనా ర్జనమునకు గడంగనిగృహస్థుడు అధర్మవర్తను డగును.[25] అల సుడై పనికిమాలిన జీవితముతో తృప్తివహించువా డవినీతి పరుడు. ఏలన తనపై వందలకొలదిమంది ఆధారపడి యుందురు. ఆతడు ధనవంతు డైనచో తన్మూలమున వందల కొలది యితరులు సంరక్షింప బడుదురు గదా.

---

24. "జుగుప్సితః ప్రవృత్తౌచ నిశ్చితేపి పరాజయే,
గురుణా లఘునా చాపి యశస్వీ ననివాదయేత్. 57

25. విద్యా(ఽ)ధన యశో ధర్మాన్ యతమాన ఉపార్జయేత్,
వ్యసనం చాసతాం సఙ్గం మిథ్యాద్రోహం పరిత్యజేత్." 58

—మహానిర్వాణతంత్రము, అష్టమోల్లాసము.

పాటుపడి ధనసంపన్నులైనవారు వందలకొలది జనులీ పురమున లేకుండినయెడల ఈ నాగరకతయంతయు, ఈ ధర్మసత్రము లన్నియు, ఈ మహామందిరములన్నియు నెచట నుండెడివి !

సద్వినియోగమునకై ధన మార్జించుట తప్పుగాదు. ఏలన, అది పదిమంది కుపయోగపడును. సంఘమునకును సాంఘికజీవనమునకును గృహస్థుడే ఆధారభూతుడు. ధర్మ మార్గమున ధన మార్జించి, ఉదారబుద్ధితో దానిని వినియోగించుట ఆరాధనవంటిది. ఏలన, సన్మార్గమున ధనమార్జింప, దానిని సత్కార్యములకై వినియోగింప ప్రయత్నించువాడు గుహాలో ధ్యానమొనర్చు తపస్వి యెట్టి మోక్షసాధన జేయు చున్నాడో అట్టి మోక్షసాధననే ప్రాయికముగా జేయు చున్నాడు; ఎట్లన భగవద్భక్తిచే, భగవంతునిదే యగు సమస్తసృష్టిజాతమునందలి భక్తిచే ప్రేరితమగు నాత్మార్పణము, స్వార్థత్యాగము నను సుగుణములే యీ యిరువురి యందును భిన్నవిధములుగా వ్యక్తమగుచున్నవి.

మంచిపేరు సంపాదించుటకై గృహస్థుడు సర్వవిధము లను ప్రయత్నింపవలయును. అతడు జూదమాడరాదు; దుర్మా ర్గుల సాంగత్యము చేయరాదు. అసత్యమాడజనదు. ఇతరులకు తనవలన బాధ గల్గింపదగదు.

లోకులు తఱచు తాము నెఱవేర్ప సాధనసంపదలు లేని కార్యములలో దిగుచు స్వలాభార్థమై పరులను వంచించు చుందురు. మఱియు సర్వవిషయముల సాఫల్యమునకును కాల

మనునది యొకటి యున్నదిగదా; ఒకసమయమున అపజయ
మగా పరిణమించునదియే వేఱొక సమయమున దిగ్విజ
యమై పరిణమింపవచ్చును.[26]

జనహితము నొనగూర్చునవియు జనులకు ప్రీతికర
ములు నగు మాటల నుపయోగించుచు గృహస్థుడు మృదుల
మగురీతిని సత్యసంభాషణ మొనర్పవలయును; పరుల వ్యాపార
ములనుగూర్చి యాతడు పలుకరాదు.[27]

చెఱువులను త్రవ్వించుచు, బాటలకిరువైపులను చెట్లను
నాటించుచు, మానవులకును జంతువులకునుగూడ విశ్రాంతి
మందిరములను నిర్మించుచు, బాటలను వేయించుచు, వంతె
నలను గట్టించుచు గృహస్థుడు యోగీంద్రలభ్యమగు నుత్త
మోత్తమగతిని బొందుచున్నాడు.[28]

గృహస్థునకు విధ్యుక్తమగు నిట్టికార్యపరత కర్మ
యోగమున నొకభాగము. మహానిర్వాణతంత్రమునందే
వేఱొక తావున నిట్లు చెప్పబడియున్నది: "స్వదేశముకొఱకు
గాని, స్వధర్మముకొఱకుగాని యుద్ధరంగమున ప్రాణములను
బాయు గృహస్థుడు ధ్యానముచే యోగి పొందు పరమపద

26. "అవస్థానుగతాశ్చేష్టాః సమయానుగతాః క్రియాః,
తస్మాదవస్థాం సమయం వీక్ష్య కర్మ సమాచరేత్. 59

27. సత్యం మృదు ప్రియం ధీరో వాక్యం హితకరం వదేత్.
ఆత్మోత్కర్షం తథా నిన్దాం పరేషాం పరివర్జయేత్. 62

28. "జలాశయాశ్చ వృక్షాశ్చ విశ్రామగృహమధ్వని,
సేతుః ప్రతిష్ఠితో యేన తేన లోకత్రయం జితమ్." 68

—మహానిర్వాణతంత్రము; అష్టమోల్లాసము.

మునే పొందుచున్నాడు."[29] దీనివలన నొకని విధ్యుక్త ధర్మము మఱియొకనిది కాదనియు, ఏనను ఒకటి యుత్తమగతిని గల్గించునదియు మఱియొకటి అధోగతిని గల్గించునదియు మాత్రము కాదనియు నేర్పడుచున్నది. మఱియు ప్రతివిధికిని నియమితస్థానము కలదనియు, మనయొక్క పరిస్థితుల ననుస రించి మనధర్మములను విధులను నిర్వర్తించుచుండవలయు ననియు గ్రాహ్యము.

దౌర్బల్యనిరసనమే ఈ వివేచనమంతటికిని ముఖ్య విషయము. ధర్మమునగాని, కర్మమునగాని, వేదాంతమున గాని కానవగు సమస్తబోధనలందును ఇదియే నా కభిమత మగు తత్త్వము. మీరు వేదములను జూచినచో "అభీః"— దేనినిగూర్చియు భయపడకుము—అను మాటయే మఱల మఱల మీకు గాన్పించుచుండును. భయము దౌర్బల్యలక్షణము. లోకుల వెక్కిరింతలను హేళనలను లక్ష్యపెట్టక మానవుడు తన విధ్యుక్తమును, దాను నిర్వహింపనగును.

సర్వేశ్వరుని గొలుచుటకై సంసారత్యాగియగువాడు సంసారవర్తనులై లోకకల్యాణార్థము కృషిచేయునట్టి గృహస్థులు భగవంతు నారాధించుటలేదని భావింపరాదు. ఇట్లులే భార్యాపుత్రులకొఱకై సంసారమును జేయువారును సంసార త్యాగులగు సన్న్యాసులను నీచులగు దేశద్రిమ్మరులుగా

29. "నబిభేతి రణాద్యోవై సఙ్గ్రామేఽప్యపరాఙ్ముఖః,
ధర్మయుద్ధే మృతోవాపి తేన లోకత్రయం జితమ్."
—మహానిర్వాణతంత్రము, అష్టమోల్లాసము.

తలపోయరాదు. తనధర్మము ననువర్తించు ప్రతివ్యక్తియు మహాత్ముడే. ఈ భావము నొక కథచే నిరూపించెదను.

"ఎవ్వ డధికుడు? సంసారమును త్యజించి సన్న్యాసి యగు నాతడా? లేక స్వధర్మానురక్తుడగు గృహస్థుడా" అని యొకరాజు తన దేశమునకు వచ్చిన సన్న్యాసుల నందఱను ప్రశ్నించువాడు. ధీమంతు లనేకు లాసమస్యకు సమాధాన మొసగ ప్రయత్నించిరి. కొందఱు సన్న్యాసియే అధికుడని వక్కాణింప రాజు వారిని, "మీ వాదమును నిరూపింపు" డనియెను. అది వారికి అసాధ్యమగుటచే రాజు వారిని, వివాహితులై గృహస్థులు కం"డని యాజ్ఞాపించెను. అంత మఱికొందఱు వచ్చి, "స్వధర్మానువర్తనుడగు గృహస్థుడే గొప్పవాడు" అనిరి. వారినిగూడ రాజు, "అది యెట్లో నిరూపింపు" డనియెను. వారి కది యసాధ్యముకా నాతడు వారినిగూడ గృహస్థులను జేసివైచెను.

తుద కొక బాలసన్న్యాసి తన రాష్ట్రమునకు రాగా, రా జాతని యథారీతిని ప్రశ్నించెను. అంత నా బాలసన్న్యాసి యిట్లు సమాధాన మొసగెను: "ఓ రాజా! వినుము. సన్న్యాసి కానిమ్ము, గృహస్థుడు కానిమ్ము, మఱియెవ్వరు కానిమ్ము. తన ధర్మము ననువర్తించు ప్రతివ్యక్తియు మహానీయుడే." "అది యెట్లో ఋజువుచేయుడు" అని రాజు పలికెను. "ఋజువుచేసెదను కాని నే జెప్పు విషయమును నీవు నిరూపింపగలుగుటకై మొదట నీవు వచ్చి కొన్నిదినముల వఱకు నావలె జీవింపవలయును" అని సన్న్యాసి వచించెను. అందులకు రాజు వల్లెయని సన్న్యాసితో తన రాష్ట్రమును

వీడి పయనమయ్యెను. అనేక దేశములను దాటి తుదకు వా రొక పెద్ద రాజ్యమును జేర నందలి ముఖ్యపట్టణమున నొక మహోత్సవము జరుగుచుండెను. రాజును సన్న్యాసియు అందలి వాద్యఘోషను వినిరి; ఉత్సవోచితములగు దుడుపు లను దాల్చి జనులు వీథులలో గుమిగూడియుండిరి. ఉత్సవ మున నొక పెద్ద చాటింపు జరుగుచుండెను. దాని నాలకించు టకై రాజును సన్న్యాసియు అట నిలిచిరి. యువరాణియగు నా దేశపు రాజకుమారి అచట సమావేశమైనవారినుండి యొకని వరించునని బిగ్గఱగా చాటింపబడుచుండెను.

రాజపుత్రికల కీ విధమగు స్వయంవరము భారత దేశ మందలి పూర్వాచారము. ప్రతి రాజపుత్రికకును తా నెట్టి వానిని వరింపవలయు నను విషయమున గొన్ని భావము లుండెడివి; వారివారి మనోభావములనుబట్టి కొందఱు మిక్కిలి సుందరుడగు వానిని, మఱికొందఱు అధిక విద్యావంతుని, ఇంకను గొందఱు విశేషభాగ్యవంతుని తమ భర్తగా బడయ దలచువారు. స్వయంవరము జరుగు రాష్ట్రమునకు సమీప మున నున్న రాజులందఱును తమతమ శౌర్యగాంభీర్యము లను ప్రకటించు దుడుపులను దాల్చి స్వయంవరమునకు విచ్చేయుదురు. రాజకుమారి తమ్ము వరించుటకై అపు డపుడు వారును తమతమ విశేషములను గూర్చి చాటింపు లను నడిపించుచుందురు. ఆకర్షణీయమగు వలువలనుదాల్చి, సింహాసనమున నాసీనయైయున్న రాజకుమారిని ప్రతిరాజు నొద్దకును భటులు గొంపోవుదురు. వారి నవలోకించి యావా వారి చరిత్రలను విని యసంతృప్తయైనచో "సాగిపొండు"

అని భటుల కాజ్ఞాపించుచు పరిత్యజింపబడినవారల నిక
క్రేగంటనైనను లక్ష్యింపకుండును. కాని వారిలో నెవ్వరై
నను తనకు నచ్చినయెడల వాని కంఠమున నామె పూల
మాలికను వేయును; అతడే యామె భర్త యగును.

మనరాజును సన్న్యాసియు ప్రవేశించిన దేశమందలి
రాజకుమారి కట్టి వింతయగు స్వయంవరోత్సవము జరుగు
చుండెను. లోకమంతటియందును ఆమె మహోత్తమ
సౌందర్యవతి. ఆమెకు భర్తయగువా డామె తండ్రి యనంత
రము రాజ్యాధికారము నొందును. మిక్కిలి చక్కని వానిని
వివాహమాడవలయునని యామె యభిలాష; కాని యామె
మనసునకు నచ్చిన వరుడు దొరకకుండెను. చాలసారు లిట్టి
స్వయంవర సమావేశములు జరిగినవి. కాని యా రాజ
కుమారి మనోరథము నెఱవేఱకుండెను. ప్రస్తుత సమా
వేశము అతిదివ్యమైన సమావేశము; మునుపటివాని కన్నిటి
కంటెను దీని కధిక సంఖ్యాకులు వచ్చియుండిరి. సింహాస
నాసీనయై యున్న రాజకుమారిని భటు లొకతావునుండి
మఱియొక తావునకు గొంపోయిరి. సమావేశమం దెవ్వరి
నామె లక్ష్యించునట్లు కాన్పింపమి జనులు నిరుత్సాహులై,
"ఈ సమావేశమును నిష్ఫలమగును కాబోలు" నని తలచిరి.
ఆ సమయమున సూర్యు డాకసమునుండి దిగివచ్చెనా యని
తోపించు దివ్యసుందరమూర్తియగు నొక బాలసన్న్యాసి
సమావేశమున నొక మూల నిలిచి యచట జరుగుచున్న
వినోదమును జూచుచుండెను. భటులు రాజపుత్త్రిక నటకు
గొనితేర నామె యా జగన్మోహనాకారుడగు సన్న్యాసిని

గాంచినంతనే యచట నాగి పూలమాలిక నాతని మెడలో వైచెను. వైచుటయు, "ఇది యేమి యవివేకము? నేను సన్న్యాసిని గదా. నా కేమి! పెండ్లి యేమి!" యని యా బాలసన్న్యాసి పూలమాలికను గైకొని యవ్వల విసరి వైచెను. అంత నా దేశపురాజు, "ఇతడు పేదవాడై యుండుటచే రాజకుమారిని పెండ్లియాడుటకు జంకుచున్నాడు కాబోలును" అని తలచి యాతని కిట్లు తెల్పెను: "నా పుత్త్రికతో గూడ అర్ధరాజ్యము మీ కొసగుచున్నాను. నా యనంతరము రాజ్యమంతయు మీ యధీనమగును!" ఇట్లు వచించి రాజు పూలదండను మఱల సన్న్యాసి మెడలో వైచెను. "చాలు చాలును! నాకు పెండ్లి వలదు" అని సన్న్యాసి ఱివ్వున నా సమావేశమునుండి వెడలిపోయెను.

రాజకుమారి యా యువకుని మోహించి, "ఈతని చేపట్టనిచో నాకు మృత్యువే శరణ్యము" అనుచు నాతని గొనివచ్చుటకై యాతని ననుగమించెను. తనతో గూడ రాజు నటకు గొనివచ్చిన మన రెండవ సన్న్యాసి, "వీ రిరువురను అనుసరింతము, రమ్ము!" అని రాజుతో గూడ తగినంత దూరము నుండి వారి వెనుక నడువసాగెను. రాజకుమారిని పెండ్లియాడ నిరాకరించిన బాలసన్న్యాసి యా దేశమును విడిచి చాలదవ్వు నడిచి యొక యరణ్యమును ప్రవేశించెను. రాజకుమారియు నాతని వెంబడించుచుండెను. మనరాజును సన్న్యాసియు వారి వెనుకనే యుండిరి. బాల సన్న్యాసికి, ఆ యరణ్యమును అందలి నిగూఢమార్గములును చిరపరిచితములై యుండుటచే అకస్మాత్తుగా నాత డొక

మార్గమును బట్టి యదృశ్యుడయ్యెను. ఆతని గనిపట్టుటకై రాజకుమారి యెంతయో ప్రయత్నించి తుదకు విఫలమనోరథయై యొక్క చెట్టుక్రింద జడికిలబడి విలపింపసాగెను; పాపము, ఆమెకు ఆ యరణ్యమునుండి వెలువడు మార్గము కూడ తెలియదయ్యెను. అంతట మనరాజును సన్న్యాసియు నామెను సమీపించి యామెకిట్లనిరి: "అమ్మా! విచారింపకుము; ఈ యరణ్యము వెలువడు మార్గము నీకు మేము చూపెదము. కాని యిపుడు మిక్కిలి చీకటిగా నుండుటచే సాధ్యము కాదు. ఇచ్చట నొక పెద్ద చెట్టు కలదు గదా. దీనిక్రింద మన మీ రాత్రి విశ్రమింతము. వేకువజామున లేచి వెడలుదము. నీకు మేము దారి చూపెదము."

ఆ చెట్టుమీదనే గూడుకట్టుకొని మూడుపిల్లలతో నొక కపోతపు జంట నివసించుచుండెను. అందు మగపిట్ట క్రిందనున్న మువ్వురు జనులను జూచి తన భార్య కిట్లులని యెను: "ప్రేయసీ! ఇపు డేమి చేయుదము? వీరు మన యింటికి వచ్చిన యతిథులు గదా. శీతకాలమిది, చలి కాచుకొనుటకు మనయింట నిప్పు లేదు." ఇట్లని యా పిట్ట తీవ్రాన నెగిరి వెడలి ముక్కున నొక చంద్రనిప్పు గఱచుకొనివచ్చి, యతిథులముందు బడవైచెను. వారు దానికి నెండుటాకులను గట్టెలను జేర్చి మంటచేసికొనిరి. కాని యా పిట్ట యంతటితో తృప్తినొందక మఱల తన భార్య కిట్లులనియెను: "ప్రియా! వీరి కాకలి యగుచున్నది, మనయింట వీరి కిడుట కేమియు లేదే. మనమా గృహస్థులము; ఇంటికి వచ్చినవారి యాకలి బాపుట గృహస్థధర్మముకదా. నా యోపినపని నేను చేయు

వలయును, కావున నా శరీరమును వీరికి సమర్పింతును." ఇట్లని యా పిట్ట యగ్నిజ్వాలలో బడి మ్రగ్గెను. అతిథు లా పిట్ట యగ్నిలో బడుచుండుట గాంచి రక్షింప బ్రయత్నించిరి కాని తత్పతనవేగముచే వారి కది సాధ్యము కాదయ్యెను.

ఆ కపోతముయొక్క భార్య తన భర్త యొనర్చిన పనిని గాంచి యిట్లు తలపోసెను: "ఇచ్చట నున్నవారు ముప్వురు. వీరు తినుట కొక చిన్న పక్షిమాత్రమే కలదు. వీరల కిది చాలదు. భర్తయొక్క యత్నము వృథా గావింప కుండుటయే భార్యా ధర్మము. కావున నా శరీరమును కూడ వీరలకు సమర్పింతును." ఇట్లు సంభావించి యా పక్షి యగ్నిలో బడి మృతి నొందెను.

అంత నా కపోతముపిల్లలు మూడును తమ తల్లిదండ్రు లొనరించిన కృత్యమును గాంచి ముప్వురతిథులకును జాలి నంత యాహారము లేమి కిట్లు చింతింపసాగెను: "మన తల్లి దండ్రులు యథాశక్తిగా బ్రయత్నించినను వీరలకు తగినంత యాహారము లేదయ్యెను. తల్లిదండ్రుల యుద్యమము నెఱ వేర్చుట బిడ్డల ధర్మముగదా; కావున మన శరీరములను గూడ సమర్పింతము." ఇట్లు సంభావించి యా పక్షిశాబక ములును అగ్ని కాహుతి యయ్యెను.

కట్టెదుట జరిగిన యీ కృత్యమునుగాంచి వార లాశ్చర్యచకితులై యా పక్షులను దినజాలరైరి; నిరాహారులై వార లా రాత్రి గడపిరి. ఉదయమున రాజును సన్న్యాసియు రాజకుమారికి త్రోవ జూప నామె మఱల తన తండ్రియొద్ద కేగెను.

అంతట సన్న్యాసి రాజున కిట్లనియె: "రాజా!
సన్న్యాసి కానిమ్ము, గృహస్థుడు కానిమ్ము, మఱి యెవ్వరు
కానిమ్ము, తన ధర్మము ననువర్తించు ప్రతివ్యక్తియు మహా
నీయుడే యనువిషయము నీ కిపుడు తెల్లమైనదికదా. సంసా
రివై వర్తింపదలతువేని ఏ నిముసమునవైనను పరహితార్థమై
సర్వస్వమును త్యజింప సంసిద్ధమైన యా పక్షులవలె జీవిం
పుము. సంసారమును త్యజింపదలతువేని సౌందర్యస్వరూపిణి
యగు కాంతాలలామను రాజ్యమును తృణప్రాయముగా
గణించిన యా యువకునివలె వర్తింపుము. గృహస్థుడవై
యుండ నెంతువా, పరశ్రేయమునకై నీ జీవితమును ఆహుతి
యొనర్ప సంసిద్ధుడవు కమ్ము; సన్న్యాసివి కానెంచెదవా,
ధనమును, సౌందర్యమును, అధికారమును కలనైనను దలప
కుము. సన్న్యాసి కానిమ్ము, గృహస్థుడు కానిమ్ము, మఱి
యెవ్వరు కానిమ్ము, తనధర్మము ననువర్తించు ప్రతివ్యక్తియు
మహానీయుడే; కాని యొకని ధర్మము మఱియొకని ధర్మము
కానేరదు."

---

## మూడవ అధ్యాయము

## కర్మయోగరహస్యము

జనులకు శరీరావశ్యకములను దీర్చుచు భౌతికముగా
దోడ్పడుట నిజముగా ఘనకార్యమే; కాని ఆవశ్యకమనునది
యెంతవఱకు విశేషమైనట్టిదియో, మనము చేయు సాయ
మెంతవఱకు అధికతరప్రయోజనకరమో మనయొక్క

తోడ్పాటును అంతవఱకు మహత్తరమైనట్టిదని చెప్పవలసి యున్నది. ఒక గంటవఱకు నొకని యక్కఱలను దీర్పగల్గినచో నిజముగా నది యతనికి తోడ్పడుటయే; ఒక యేడాదివఱకు నాతని యక్కఱలను దీర్పగలిగినచో అది యంతకంటె విశేషమగు తోడ్పాటగును; కానియాతని కొఱతలను శాశ్వతముగా దీర్పగల్గినచో నిశ్చయముగా నది యాతని కొనర్పగలిగిన మహోత్తమమగు తోడ్పాటుగదా. మన బాధలను శాశ్వతముగా తొలగింపగలిగినది తత్త్వజ్ఞానము. ఇతరమగు నెట్టి జ్ఞానమైనను మన యక్కఱలను గొంతకాలమువఱకు మాత్రమే తీర్పగలదు. తత్త్వజ్ఞానము ఒక్కటియే మానవుని కొఱతలను శాశ్వతముగా బాపును; కావున మానవున కొనర్చు నాధ్యాత్మిక సాహాయ్యమే మహోత్తమ సాహాయ్యము. తత్త్వజ్ఞానదానమొనర్చు నాతడే లోకమునకు మహోపకారి. కావున మానవునకు ఆధ్యాత్మికవిషయములలో సాయమొనర్చినవారలే అఖండప్రతిభాశాలులై అతులిత శక్తిసంపన్నులై యున్నారు; ఏలన జీవితమున సమస్తవ్యాపారములకును ఆధ్యాత్మికశీలమే మూలాధారము. ఆధ్యాత్మిక శక్తిసంపన్నుడు అగు నాతడు తలచినచో సర్వవిషయములందును శక్తిమంతుడు కాగలడు; ఆధ్యాత్మికబలముండిననే కాని మానవుడు విషయవాంఛలను సైతము తృప్తిపొందించుకొనజాలడు. ఆధ్యాత్మిక సాహాయ్యమునకు తరువాత వచ్చునది విద్యావిషయకసాహాయ్యము. విద్యాదానము అన్నదాన వస్త్రదానములకంటెను ఉత్తమదానము; విద్యాదానము ప్రాణదానముకంటెకూడ అధికతరమని చెప్పవలసియున్నది;

వలన, మానవజీవితమును సార్థక మొనరించునది జ్ఞానమే. అజ్ఞానముకంటె మృత్యువు వేఱొండులేదు, జ్ఞానముకంటె జీవనము వేఱులేదు. దుఃఖాజ్ఞానములలో గోరాడునట్టి అంధకారబంధురమగు జీవితమువలన నేమి ప్రయోజనము! విద్యాదానమునకు తరువాతిది శారీరసాహాయ్యమనుటకు సందియములేదు. కావున పరోపకార విషయమై శారీర సాహాయ్య మొక్కటియే సాయమని భ్రమింపకుండుటకై యత్నింపవలయును. ఇయ్యది శాశ్వత సంతృప్తి నొసగ జాలమి దానములలో కడపటిదగుటయేకాక అధమము కూడనై యున్నది. భుజించుటచే నాయాకలి తీరును, కాని మఱల నాకాకలియగుచున్నది. నాయక్కఱ శాశ్వతముగా తీరినప్పుడే కదా నా బాధ తొలగగలదు. ఆకలి నన్నపుడిక బాధింపదు: ఎట్టి దుఃఖమును దుఃస్థితియు గూడ నన్నిక గదల్పజాలవు. కావున మనల నాధ్యాత్మికముగా బలిష్ఠుల నొనర్పఁబూనున దేదియో అదియే మహోత్తమమగు సాహాయ్యము. తరువాతిది విద్యావిషయక మగు సాహాయ్యము, కడపటిది శారీరక సాహాయ్యము.

శారీరకసాహాయ్యము లభించినంతనే సంసారబాధలు తొలగునవి కావు; మానవుని స్వభావము మాఱుపర్యంతము ఈ శారీరావశ్యకములును బాధలును కలుగుచునే యుండును; ఎంతటి బాహ్యసాహాయ్యమైనను వానిని పూర్తిగా తొలగింప జాలదు. మానవులను పరిశుద్ధహృదయుల నొనర్చుటొక్కటే ఈ సమస్యను పరిష్కరించుట కుపాయము. లోకమున గాన్పించు చెడుగున కంతకును, దురవస్థకంతకును అజ్ఞానమే

మూలకారణము. మానవులు జ్ఞానులై, విశుద్ధహృదయులై, ఆత్మబలాఢ్యులై, విద్యావంతులై యున్నప్పుడే లోకమందలి దుఃఖము నివర్తించును, ప్రతిగృహమును మనము ధర్మసత్రముగా నొనర్తుము గాక, దేశమునంతను చికిత్సాలయములతో నింపుదుము గాక, మానవుని శీలము మార్పుచెందనిదే దుఃఖనివృత్తి కానేరదు.

సదా మన మందఱము కర్మమొనర్చుచుండవలయునని భగవద్గీతలలో ఎన్నియోసారులు చెప్పబడియున్నది.* సమస్తకర్మమును స్వాభావికముగా మంచి చెడుగులతో సమ్మిశ్రితమై యున్నది. ఎచ్చటనో కొంతమేలు చేయని కర్మమును చేయనే చాలము; ఎచ్చటనో కొంతకీడు కల్గింపని కర్మ ముండుటయే అసంభవము. ఐనను సదా కర్మనిరతులమై యుండుట మన కర్తవ్యము. మంచి చెడుగులు రెండును వానివాని ఫలితముల నొసగుచుండును; అట్టి కర్మముల నుద్భవింపజేయుచుండును. సత్కర్మమువలన మనకు సత్ఫలమును దుష్కర్మమువలన దుష్ఫలమును గలుగుచున్నది. కర్మమునకు గల యిట్టి బంధనస్వభావము నెంచి కర్మఫలములయందు మన మాసక్తులము గానిచో కర్మములు మనలను బంధింపజాలవనునదియే భగవద్గీతలందు దెలుపబడిన తరణోపా

---

* "నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః."
—భగవద్గీత, 3-8.

"తస్మాదసక్తః సతతం కార్యంకర్మ సమాచర." ,, 3-19.

"కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్.",,4-15.

"తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్యచ." ,, 8-7.

యుము.‡ నిష్కామకర్మాచరణ మన నేమో కర్మములయం దసక్తత యనగా నేమో గ్రహింప యత్నింతము.

"తస్మాదసక్తస్సతతం కార్యంకర్మ సమాచర"†-నిరంతరముగా కర్మముల నాచరింపుము; కాని వానియందు ఆసక్తుడవు గాకుము—అనునదియే భగవద్గీతయొక్క ముఖ్యోద్దేశము. సంస్కార మనగా స్వాభావిక ప్రవృత్తియని చెప్పవచ్చును. చిత్తమును సరస్సుతో బోల్చునెడల అందలి ప్రతివృత్తివీచికయు అం దుదయించి మఱల నణగునప్పుడు పూర్తిగా నశింపక, ఒకవిధమైన జాడను, ఆ (చిత్త) వృత్తి మఱల నుదయించు నవకాశమును గలుగజేయుచున్నది. అట్టి యవకాశముతో గూడిన యీ జాడయే సంస్కారమని చెప్పబడును. మనము చేయు ప్రతికార్యమును, శరీరము ప్రతిచలనమును, మనము చేయు ప్రత్యాలోచనమును చిత్తమునం దిట్టి సంస్కారమును గల్గించుటచే నివి పైకి మనకు గోచరింపకున్నను అంతర్గతముగా నుండి యజ్ఞాతముగా పనిచేయుటకు తగినంత శక్తిమంతములై యుండును. చిత్తమునందలి సంస్కారసమామ్నాయముచే మనయొక్క స్థితిగతులు అనుక్షణమును నిర్ణీతమగుచున్నవి. ఇప్పు డీ క్షణమున నాయొక్కస్థితి ఇంతవఱకు నా జీవితమం దేర్పడి

---

‡ "యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసియత్.
యత్తపస్యసి కౌన్తేయ తత్కురుష్వ మదర్పణమ్.
శుభాశుభ ఫలై రేవం మోక్ష్యసే కర్మబన్ధనైః."-భగవద్గీత, 9-27, 28.

† భగవద్గీత, 3-19.

యున్న సంస్కారములయొక్క సాముదాయిక ఫలితము. నిజముగా శీలమనగా నిదియే; ప్రతిమానవునియొక్క శీలమును ఈ సంస్కారముల మొత్తముచే నిర్ణీతమగుచున్నది. మంచి సంస్కారములు విశేషముగా నున్నయెడల శీలము లేక స్వభావము మంచి దగును; చెడ్డసంస్కారములు విశేషముగా నున్నయెడల స్వభావము చెడ్డదగును. నిరంతర మొకడు చెడ్డమాటలను వినుచు, చెడ్డ యాలోచనలను జేయుచు, చెడ్డపనులను జేయుచుండు నెడల వాని మానసము చెడ్డసంస్కారములతో నిండియుండును; వానికి తెలియకుండగనే అవి వాని తలంపులందును కర్మములందును తమ ప్రభావమును జూపుచుండును. నిజమునకీ దుష్టసంస్కారములు సదా పనిచేయుచునే యుండ వాని ఫలితము చెడుగై యుండుటలో ఆశ్చర్యము లేదు; చెడుసంస్కారములు గలవాడు చెడ్డవాడగుచున్నాడు, కాక తీరదు; ఆతనియందలి యీ సంస్కారసముదాయము దుష్కార్యములను జేయు నాతని ప్రబలముగా బ్రేరేపించుచున్నది. దుష్టసంస్కారముల చేతులలో నాతడు కీలుబొమ్మయై యుండ దౌర్జన్యముచేయు నవి యాతని బురికొల్పుచున్నవి. ఇట్టులే యొకడు సదాలోచనలు చేయుచు సత్కార్యములను జేయుచుండు నెడ వానివలన గలుగు సంస్కారసముదాయము మంచిదగుటచే నాతడు సంకల్పింపకున్నను సత్కార్యములను జేయు నది యాతని నిర్బంధించును. ఎన్నియో సత్కార్యములను జేసి సదాలోచనలు చేసియున్న వానికిక ముందును సత్కార్యములను జేయవలయునని అనివార్యమైన బుద్ధి పుట్టును; ఒక

వేళ చెడుగు చేయవలయునని యాతడు కోరినను, ఆతని సంస్కారము లన్నిటిఫలితముగా నాతని మానసమటుల చేయనీయదు; సత్సంస్కారము లాతనిబుద్ధిని మఱల్చును. వాని కాతడు సంపూర్ణముగా అధీనుడై యున్నాడు. అట్టివాని శీలము సుప్రతిష్ఠితమై యున్నదని చెప్పనగును.

తన యవయవములను తాబేలు తన బొరుసులోనికి లాగుకొనిన యపుడు నీవు దానిని జంపినను, ముక్కముక్కలుగా గోసినను అందుండి వెలువడనిచందమున తన యవయవములను చిత్తవృత్తులను ఎవ్వడు స్వవశ మొనర్చుకొనునో అట్టివాని శీలము సుప్రతిష్ఠితమై యొప్పును.* తన యాంతరంగిక శక్తుల నాతడు వశపఱచుకొనియుండ నాతని సంకల్పమునకు వ్యతిరిక్తముగా నేదియు వానిని బహిర్ముఖము చేయజాలదు. నిరంతర సద్భావములచే చిత్తమున నుదయించు సత్సంస్కారములచే సత్కార్యాచరణప్రవృత్తి బలీయమగునపు డింద్రియములను వశమొనర్చుకొనగల్గుదుము. అపుడే శీలము సునిర్మితమగును; అపుడే మానవుడు తత్త్వమును గ్రహించును. అట్టివా డిక నెవ్వరితో సాంగత్యముచేసినను ప్రమాదములేదు. ఇట్టి సత్ప్రవృత్తిని గల్గియుండుటకంటెను ఉత్తమమైన స్థితి కలదు. అదియే ముముక్షుత్వము, ఆత్మస్వాతంత్ర్యేచ్ఛ. సమస్తయోగములకును ఆత్మస్వాతంత్ర్యమే పరమావధియని-సమస్తయోగములును దానినే ప్రాప్తింపజేయు మార్గములని—మనము గమనింప

* "యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవ సర్వశః,
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా"-భగవద్గీత. 2-58

వలయును. బుద్ధుడు విశేషముగా ధ్యానముచేతను క్రీస్తు ప్రార్థనచేతను బొందిన పరమపదమును ఇతర యోగాపేక్ష లేక కేవల కర్మముచేతనే పొందనగును. బుద్ధుడు కర్మపరాయణుడైన జ్ఞాని; క్రీస్తో భక్తుడు. ఐనను వారిరువురును ఒకే గమ్యమును బొందిరి. ఉన్నచిక్కంతయు నిది. మోక్ష మనగా సంపూర్ణ విమోచనము—దుష్కర్మజనితబంధము నుండియేగాక సత్కర్మజనితబంధమునుండియు విమోచనము. ఇనుపసంకెలవలెనే బంగారుసంకెలయు సంకెలయే. నా వ్రేలికి ముల్లు గ్రుచ్చుకొనినయెడల దానిని తీసివేయుటకు మఱి యొకముల్లుపయోగింతును, పని తీరినంతనే రెంటి నవ్వల బాఱవైతును; రెండును ముండ్లే యగుటచే రెండవ ముల్లును పదిలపఱచుకొనుట నా కనావశ్యముగదా.* కావున దుష్ట సంస్కారములను సత్సంస్కారములచే నిరాకరింపవలయును.† మనస్సునందలి మాలిన్యమంతయు అదృశ్యమగుపర్యంతము, లేదా నిగ్రహింపబడి, మనస్సునం దొకమూలబడి మనవశమై యుండునంతవఱకు దుష్టసంస్కారములను సత్సంస్కారములచే తొలగించుకొనవలయును; గాని యటుపిమ్మట సత్సంస్కారములను సైతము నిర్జింపవలయును. అపుడు "ఆసక్తుడు" "అనాసక్తుడు" అగుచున్నాడు. కర్మ మొనర్పుము, కాని నీ వొనర్చు కార్యముగాని, తలచు తలంపుగాని నీ మానసమున ప్రబలమగు సంస్కారమునుమాత్రము గల్గింపకుండునట్లు

---

* ఇయ్యది శ్రీరామకృష్ణ పరమహంస సూక్తులలో నొకటి.

† "తే ప్రతి ప్రసవ హేయాస్సూక్ష్మాః"

—పాతంజల యోగసూత్రము, 2.1

చూడుము; చిత్తమున వృత్తు లుదయించుగాక, అస్తమించుగాక, వానితో నీకు జోక్యము వలదు; మనశ్శరీరములనుండి మహాఘనకార్యము లుద్భవించుగాక, కాని యవి నీ మానసమున ప్రబలమగు నెట్టి సంస్కారమును గల్గింపరాదు.

కాని దీనిని సాధించు టెట్లు? దేనియందు మన మాసక్తులమో అట్టి కార్యమువలన గలుగు సంస్కారము నిలిచి యుండును. పగలు నేను వందలకొలది జనులను గలిసికొనవచ్చును. వారిలో నాకు ప్రియుడగువాని నొకనినిగూడ గలిసికొనవచ్చును; రాత్రి నేను పరుండబోవునపుడు పగలు చూచిన ముఖముల నన్నిటిని గూర్చియు చింతింప యత్నింతు ననుకొనుడు; అపుడు బహుశః ఒక నిముసము మాత్రమే చూచినట్టియు ఐనను నేను ప్రేమించినట్టియు వదనము మాత్రమే నా మనోవీథిని నిలుచును; ఇతరము లన్నియు అదృశ్యములగును. మిగిలినవా రందఱియందుకంటెను ఈ ప్రత్యేకవ్యక్తియందు నాకు గలిగిన ఆసక్తత నా చిత్తమున ప్రబలతర సంస్కారమును గల్గించుచున్నది. శారీరకముగా జూచిన యెడల ఇందలి నా సంస్కారము లన్నియు నొకేవిధమైనవి; నేను చూచిన ప్రతివదనమును నా నేత్రాంతః పటలము (Retina) న ప్రతిబింబితమగునపుడు మేదస్సు వానిని లోనికి గొనిపోయినను చిత్తమున వానిచే ఒకేవిధమగు ప్రతిక్రియ గలుగుట లేదు. బహుశః ఆ ముఖములలో ననేకములు నాకు అచింతితమై పూర్తిగా క్రొత్తవై యుండవచ్చును. కాని క్షణకాలము నాకు గోచరించిన యా వదనము నా మానసమున సజాతీయమైన భావములను గనుగొని యుండవలయును. బహుశః

ఆతని రూపము నా మనఃఫలకమున అనేక సంవత్సరముల నుండి ముద్రితమై యుండియుండును; ఆతనిగూర్చి వందల కొలది విషయములను గ్రహించియుందును. ఆతనియొక్క యీ నూతనదర్శనము నా చిత్తమున నిద్రాణములై యున్న వందలకొలది స్మృతులను ప్రబుద్ధమొనరించియున్నది; ఇతర ముఖములచే గలిగిన సంస్కారము లన్నిటికంటెను ఈ సంస్కారము వందలకొలది పర్యాయములు పునర్భవమై యుండుటవలన మానసముపై విశేషప్రాబల్యమును జూపుచున్నది.

కావున "అసంగుడవై" వర్తింపుము; కార్యములను జరుగనిమ్ము, ఇంద్రియములను వ్యాపారములను జేయనిమ్ము; సదా, సర్వదా కర్మముల నాచరింపుము. కాని యెట్టి చిత్తవృత్తికిని అధీనుడవు గాకుము. క్రొత్తవానివలె ఆగంతుకునివలె, విదేశీయునివలె ఈ లోకమున కార్యముల నొనర్పుము. నిరంతర కర్మనిరతుడవయ్యు, బద్ధుడవు గాకుము. బంధము మహాఘోరము. ఈ ప్రపంచము మన నివాసము గాదు. ఇయ్యది మన జీవయాత్రలో మనము దాటవలసిన మజిలీలలో నొకటి. "ఆత్మార్థత్వాత్ సృష్టేః"* అనునట్లు సమస్త ప్రకృతియు ఆత్మార్థమై ఉద్దేశింపబడియున్నదని గుర్తింపుడు. పురుషుని లేక ఆత్మయొక్క అనుభవముకొఱకు మాత్రమే ప్రకృతి యేర్పడియున్నది; ప్రకృతియొక్క ఉనికి కింతకంటె మఱియొక కారణము లేదు. ఉద్దేశమును లేదు; పురుషుడు జ్ఞానవంతుడై కైవల్యము నొందవలయును కావుననే ప్రకృతి

* సాంఖ్యసూత్రము, 2-11.

సంస్థితమై యున్నది.* మన మీ తత్త్వమును సదా గుర్తించినచో ప్రకృతితో నెన్నడును సంగము నొందనేరము; జ్ఞానార్జనమునకై ప్రకృతి మనకు గ్రంథప్రాయమని గ్రహింతుము. ఆర్జింపవలసిన జ్ఞానము నార్జించినంతనే ఇక నీ పొత్తము మనకు నిష్ప్రయోజన మగును. ఏమైనను ఇందులకు బదులుగా మనము ప్రకృతితో తాదాత్మ్యము నొందుచు ప్రకృతి కొఱకు పురుషు డేర్పడియున్నాడని—శరీరముకొఱకే శరీరియని—తలంచుచున్నాము; తనువు నిల్పుటకై తినుటగాక తినుటకై తనువు నిల్పుకొనుచున్నాము; సదా ప్రకృతియే మన మని భ్రమించుచు ప్రకృతిమోహితులమగుచున్నాము. ఇట్టి మోహము లేక సంగము జనించినంతనే మానసమున ప్రబలసంస్కార మేర్పడుచున్నది. అయ్యది మనలను బద్ధుల నొనర్చి అస్వతంత్రులగు బానిసలవలె క్రియల నొనర్ప జేయుచున్నది.

కర్మయోగోపదేశ సారమంతయు నిది: బానిసవలె గాక ప్రభునివలె, యజమానునివలె, కార్యముల నొనర్పుము; నిరంతరము కర్మమొనర్పుము, కాని బానిసవలె క్రియల నొనర్పకుము. ప్రతి వ్యక్తియు నెట్లు కర్మాచరణమునకు గడంగునో మీరు చూచుచున్నారుగదా. ఎవ్వరికిని విశ్రాంతి యనునది లేదు; నూటికి తొంబదితొమ్మండుగురు బానిసల వలె క్రియల నొనర్చుచుందురు, దుఃఖమే అందులకు ఫలము; అదియంతయు స్వార్థపరమైన కర్మము. బంధరహితుడవై

* "...అపవర్గార్థం దృశ్యమ్"

—పాతంజలయోగసూత్రములు, 2-18.

కర్మ మొనర్పుము. "ప్రేమ" యను శబ్దముయొక్క తాత్ప ర్యమును గ్రహించుట దుర్లభము; స్వాతంత్ర్యమున్ననేకాని ప్రేమ మెన్నడును ఉత్పత్తిల్లదు. బానిసయం దెన్నటికిని నిజ మైన ప్రేమము ఉండజాలదు. నీ వొక బానిసను గొని, గొలు సులచే బంధించి నీకై కార్యముల నొనర్ప నియమించితివేని గులామువలె నాతడు పనిచేయవచ్చునుగాని వానికి ప్రేమము ఉండజాలదు. కావున మనముకూడ బానిసలవలె ప్రాపంచిక విషయములకొఱకు కర్మ మొనరించునెడల మన కర్మములం ప్రేమస్నిగ్ధములు కాజాలవు, అయ్యది నిజమైన కర్మము కానేరదు. స్నేహితులకొఱకును బంధుగులకొఱకును మాత్రమే కాక, మనకొఱకు మనము చేయు కర్మము విషయముకూడ నిట్టిదే. స్వార్థపరమగు కర్మాచరణము బానిసయొక్క కర్మా చరణము. కర్మయోగ్యతకు నిదర్శనమిది: ప్రేమసంజనిత మైన ప్రతికార్యమును ఆనందము నొనగూర్చును; శాంతి ప్రదము కానట్టి—ప్రేమసంజనిత కార్య మెద్దియు నుండ జాలదు. నిజమైన అస్తిత్వము, నిజమైన జ్ఞానము, నిజమైన ప్రేమము ఒండొంటితో శాశ్వతముగా సంబద్ధములై యున్నవి; ఇవి మూడును ఒక్కటే; ఇందొకటి యెచ్చట నుండునో తక్కిన రెండును అచట నుండి తీరవలయును; సచ్చిదానంద స్వరూపమగు నద్వితీయ బ్రహ్మమున కివి మూడును మూడు రూపములు – బ్రహ్మ మీ మూడింటి రూపముననుభాసించు చున్నది. ఆబ్రహ్మము సాపేక్షమగునపు డీ ద్వైతప్రపంచ రూపమున మనకు గోచరించుచున్నది; ఆ జ్ఞానమే ప్రాపంచిక జ్ఞానముగా పరిణమించుచున్నది; ఆ యానందమే మానవ

మానసవేద్యమగు నిశ్చలమైన ప్రేమకంతకును మూలాధారము. కావున నిజమైన ప్రేమమువలన ప్రేమికిగాని, ప్రియతమమగు వస్తువునకుగాని ఎన్నటికిని బాధ కలుగ జాలదు. ఒక డొక స్త్రీని ప్రేమించు ననుకొనుడు; ఆమె తనకు దాసురాలై యుండవలయునని—ఆమె జీవితమంతయు తన యధీనమై యుండవలయునని—యాతడు కోరును; ఆమె ప్రతి చలనమును గూర్చియు అత్యంతముగా అనుమానించు చుండును; ఆమె తనయొద్ద కూర్చుండవలయునని, నిలుచుండ వలయునని, భుజింపవలయునని, వేయేల, తన యాజ్ఞానుసార మామె వర్తింపవలయునని కోరును. ఆత డామె దాసుడు కావున నామెయు తన దాసురాలై యుండవలయునని కోరును. అది ప్రేమ కాదు; ప్రేమాంబరమును గప్పికొని యుండు మోహము. దానివలన బాధ గలుగుచున్నది; ఆమె యాతని కోరికప్రకారము వర్తింపనియెడల ఆతడు బాధపడుచున్నాడు. ప్రేమ మెన్నడును బాధాకరము కానేరదు. ఆనందమే ప్రేమకు ప్రతిఫలము. ఆనందప్రదము కానిచో అది ప్రేమగాదు, ప్రేమాన్యమగు దానిని ప్రేమమని భ్రమించుట. ఎట్టి బాధయు, అసూయయు, స్వార్థపరమైన భావమును గలుగనిరీతిని నీవు నీ భర్తను లేక భార్యను, బిడ్డలను, ప్రపంచమును, విశ్వప్రపంచమును ప్రేమింపగలిగిన నాడు నీవు అసంగుడవు కాదగిన స్థితిని బొందియున్నా వన్నమాట.

శ్రీకృష్ణు డర్జునితో నిట్లనును: "అర్జునా! ఇటు చూడుము. క్షణమైనను నేను కర్మమును విరమించినయెడల

ప్రపంచమంతయు నశించును. కర్మమొనర్చుటచే నేను పొంద దగిన లాభము లేశమును లేదు. జగత్ప్రభుడనగు నే నెందు లకు కర్మ మొనర్పవలయును? జగమును ప్రేమింతును కావున కర్మ మొనర్చుచున్నాను.''* భగవంతుడు విశ్వ మును ప్రేమించుటచే అసంగుడై యున్నాడు; అట్టి నిజమైన ప్రేమ మనలనుగూడ అసంగుల నొనర్చును. ఎచ్చట సంగ మున్నను, ప్రాపంచిక విషయములయెడ మమకారమున్నను, అదియంతయు భౌతికమని, ఒకవిధమైన ప్రాకృత రేణువులచే మఱియొకవిధమైన ప్రాకృత రేణువులకు గలుగు నాకర్షణమని, రెండు శరీరములను సన్నిహిత మొనర్చునట్టి యొకానొక శక్తి యని మీరు గ్రహింపవలయును. అయ్యవి సన్నిహితములు కాజాలనియెడల బాధ కలుగుచున్నది. కాని నిజమైన ప్రేమకు భౌతిక సంబంధముతో నిమిత్తము లేదు. అట్టి ప్రియులు ఒండొరులనుండి వేలకొలది మైళ్లదూరమున నుండవచ్చును, కాని వారి యన్యోన్యప్రేమము ఒకేవిధముగా నుండును; అయ్యది నశింపదు. అది యెన్నడును బాధాకరము కానేరదు.

---

* ఇయ్యది ఈ క్రింది శ్లోకముల భావార్థము :

శ్లో. "నమే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కిఞ్చన,
నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవచ కర్మణి.
యదిహ్యహం నవర్తేయం జాతుకర్మణ్యతన్ద్రితః,
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః.
ఉత్సీదేయురిమేలోకా నకుర్యాం కర్మచేదహమ్,
సఙ్కరస్యచ కర్తాస్యాముపహన్యామిమాః ప్రజాః."

—భగవద్గీత, తృతీయాధ్యాయము, 22, 23, 24.

ఇట్టి యనాసక్తి నలవరుచుకొనుటకు బహుశః జీవితకాలమంతయు బ్రయత్నింపవలసియుండును; కాని యీస్థితిని బొందినంతనే ప్రేమపరమావధినొంది విముక్తుల మగుదుము; ప్రకృతి బంధవినిర్ముక్తులమై యథారూపమున ప్రకృతిని దర్శింతుము. ప్రకృతి మనల నిక బంధింపజాలదు; సంపూర్ణ స్వతంత్రులమై యపుడు కర్మఫలముల నిసుమంతయు లక్షింపకుందుము; కర్మఫలము లెట్టివి సంప్రాప్తమైన నపు డెవరికి గావలయును ?

నీ బిడ్డలకు నీ వొసగు నన్నవస్త్రాదికములకు వారిని నీ వేమైన ప్రతిఫల మర్థింతువా? వారి యోగక్షేమములకై వర్తించుట నీ విధి, అంతియే. నీ బిడ్డలయెడ నీ వెట్టి మనోభావము వహింతువో అట్టి మనోభావమునే నీ వొక వ్యక్తికి గాని, పురమునకుగాని, రాష్ట్రమునకుగాని చేయు కార్యముల పట్ల వహింపుము—ప్రతిఫల మెన్న డపేక్షింపకుము. దాతవై వర్తించుచు లోకమునకు నీ వొసగు ప్రతివస్తువును ఫలాపేక్షారహితముగా సమర్పించినయెడల నీ కార్యములు నీకు బంధమును గల్పింపవు. ప్రతిఫలాపేక్ష యున్నప్పుడే బంధము గలుగుచున్నది.

బానిసవలె క్రియల నొనర్చుట బంధమును స్వార్థపరత్వమును గల్పించుచో ఆత్మ స్వాతంత్ర్యముతో కర్మమాచరించుట సంగరాహిత్యజనితానందము నొనగూర్చును. న్యాయమును గూర్చియు ధర్మమును గూర్చియు తఱచు మనము ఏమేమో చెప్పుచుందుముగాని న్యాయధర్మము లనునవి లోక

మున నిజముగా పసిబిడ్డల ప్రలాపములై యున్నవి. పశు బలము, కారుణ్యము అనునవి రెండే మానవవర్తనమును నిర్ణయించునట్టివి. పశుబలమును జూపుట విధిగా స్వార్థపరత్వమును జూపుటయే. తమకున్న అధికారమును ఆనుకూల్యమును వీలైనంతవఱకు ప్రతివ్యక్తియు వినియోగించుకొన జూచుచునే యుండును. కారుణ్యము నిజముగా దైవాంశము; యోగ్యుల మగుటకై మనమందఱము కరుణగలిగి యుండవలయును. న్యాయధర్మములు సహితము కారుణ్యముమీదనే ఆధారపడి యుండవలయును. కర్మాచరణమున మన ప్రతిఫలాపేక్షయంతయు మన ఆత్మాభివృద్ధిని నిరోధించును—నిరోధించు నననేల,—పర్యవసానమున దుఃఖకరమగును. కారుణ్యమును ఔదార్యమును మన యాచరణమున జూపుటకు మఱియొక విధానము కలదు; మనము సాకారదైవమును నమ్మునెడ మనయొక్క కర్మమును "ఆరాధన"గా భావించుటయే యీ విధానము. ఇందు మన కర్మఫలముల నన్నిటిని భగవానున కర్పింతుము; భగవాను నిట్లారాధించునెడ మనము చేయు కర్మములకు మానవకోటినుండి ప్రతిఫలమపేక్షింప మన కధికారము లేదు. సాక్షాద్భగవానుడును నిరంతర కర్మనిరతుడై అసంగుడై యున్నాడు. నీరు తామరాకును తడుపజాలని రీతిని స్వార్థరహితు డగువానికి ఫలసంగమును గల్పించి కర్మము వానిని బంధింపజాలదు. నిస్సంగుడు, స్వార్థరహితుడు నగువాడు పాపభూయిష్ఠము, జనాకీర్ణము నగు పట్టణపు నట్టనడుమ నివసించుచున్నను వానిని పాపము స్పృశింపజాలదు.

సంపూర్ణ స్వార్థరాహిత్య మన నెట్టిదో ఈ క్రింది కథచే నిరూపింపనగును:- కురుక్షేత్ర యుద్ధానంతరము పంచపాండవులు రాజసూయయాగ మొనర్చి బీదల కనేక దానధర్మము లొనర్చిరి. జను లెల్లరు ఆ యాగముయొక్క ఘనతను వైభవమును గాంచి యబ్బురపడుచు నట్టియాగము లోకమున నంతకుముం దెన్నడును జరుగలేదని చెప్పుకొన సాగిరి. యాగానంతరము ఒక చిన్న ముంగిస యచటికి వచ్చెను; దాని శరీరము సగము బంగారు వన్నెతోడను సగము గోధుమ వన్నెతోడను ఒప్పుచుండెను. అయ్యది యజ్ఞమంటపమున నటు నిటు పొరల నారంభించెను. తుద కది తన చుట్టునున్న జనులను జూచి యిట్లనియె: "మీ రందఱును అసత్యవాదులు. ఇది యొక యజ్ఞము కానే కాదు." అంతట జను లిట్లు పల్కిరి: "ఏమేమి? ఇది యజ్ఞమే కాదందువా? ధనమును నగలును బీదల కెట్లు ధారాపాతముగా కురిపింపబడినవో, ఎల్లరు నెట్లు భాగ్యవంతులై సుఖవంతులై యున్నారో నీ వెఱుగుదువా? నిశ్చయముగా లోకమున నిట్టి మహాద్భుతయాగము నింతకుముం దెవ్వరును జేసినది లేదు." అందులకు ముంగిస యిట్లు పల్కెను: "ఒకప్పు డొక గ్రామమున నొక పేదబ్రాహ్మణుడు తన భార్యతోడను, కుమారునితోడను, కోడలితోడను నివసించుచుండెను. నిరుపేదలగు వారు ధర్మప్రచారము చేయుచు తనస్వల్పములమున నెట్లో జీవయాత్ర చేయుచుండిరి. ఇట్లుండగా ఆ దేశమున మూడుసంవత్సరముల పర్యంతము గొప్ప కాటకము సంభవించెను. దానిచే ఆ పేదకుటుంబము

నకు గొప్ప యిక్కట్టు వాటిల్లెను. దినములకొలది కుటుంబము నిరాహారమైయుండ తండ్రి యెట్లో ఒక యుదయమున గొంత బియ్యపుపిండిని సంపాదించి దానిని నాలుగు భాగములుచేసి కుటుంబమునందలి నల్వురకు బంచెను. వారు దానిని ఉడుకబెట్టుకొని భుజింపబోవుచుండ నింతలో నెవ్వరో తలుపు తట్టుచున్నట్లు వినవయ్యెను. తండ్రి వెడలి తలుపు తెఱవ నెట్టయెదుట నొక యతిథి నిలువబడియుండెను. భారత దేశమున అతిథి పూజనీయుడు, వానిని దైవముగా నెంచి పూజింపవలయును.* కావున నా బీదబ్రాహ్మణుడు వానిని 'లోనికిరండు' అని యాహ్వానించి తనవంతునకు వచ్చిన యాహారమును వానికి సమర్పించెను. ఆతడు దానిని క్షణములో భక్షించి యిట్లు పలికెను: 'చంపివైచితివయ్యా! పదిదినముల నుండియు పస్తుపడియున్న నా కీరవంత పిండియు ఆకలిని వృద్ధిచేసినది.' అది విని భార్య భర్తతో తన వంతునకు వచ్చిన యాహారమును గూడ నాతనికి సమర్పింపుడని పలుక భర్త యంగీకరింపమి ఆమె యిట్లనియెను: 'ఈతడు మిక్కిలి పేదవాడు, ఈతని యాకలి బాపుట గృహస్థులమగు మన కర్తవ్యముగదా! ఈతని కిడుటకు మీ యొద్ద నిక నేమియు లేదు. ఇపుడు నా భాగమును సమర్పించుట భార్యనగు నా విధ్యుక్తము.' ఇట్లని యామె తన భాగమును అతిథి కొసగెను. ఆతడు దానిని వెంటనే తినివైచి, 'ఆకలిబాధచే తాళజాలకున్నాను' అని పలికెను. బ్రాహ్మణుని పుత్త్రు డంతట, 'నా భాగమును గూడ స్వీకరింపుడు; తండ్రి యాచరించు

* "అతిథి దేవో భవ"—తైత్తిరీయోపనిషత్తు.

ధర్మమును నిర్వహించుట పుత్రుని విధిగదా' యని తన భాగమును గూడ అతిథికి సమర్పించెను. అతడు దానిని భుజించియు తృప్తినొందలేదని గ్రహించి కోడలు తన భాగమును గూడ సమర్పించెను. అది తిని యాతడు సంతృప్తుడై వారలను దీవించి వెడలిపోయెను. నాటిరాత్రి యా కుటుంబమునందలి నలువురును క్షుద్బాధచే మరణించిరి. ఆ పిండియందలి కణములు కొన్ని నేలపై బడినవి. వానిపై నేను దొరలినంతనే నా శరీరము సగము మీాకు గాన్పించురీతిని సువర్ణవికారమైనది. అట్టి యజ్ఞమును గనుగొనుటకై నాటి నుండియు నేను లోకమంతయు దిరుగుచున్నాను; కాని యింతవఱకు నాకు గాన్పింపలేదు; నా శరీరమున రెండవ ప్రక్క మఱియెచ్చటను సువర్ణవికారము కాలేదు. నే నిది యజ్ఞమే కాదనుటకు కారణ మిది!"

భారతదేశమునుండి త్యాగము పలాయన మగుచున్నది; మహాత్ముల సంఖ్య నానాటికి క్షీణించుచున్నది. నే నాంగ్లభాష నేర్వ నారంభించినపుడు ఒక యాంగ్ల పుస్తకమున విధేయుడగు నొక బాలుని గూర్చి యొక కథ చదివితిని. ఆతడు ఇల్లు విడిచి పనిచేయ వెడలి ముదుసలియగు తన తల్లికి తాను సంపాదించిన ధనములో గొంత భాగ మిచ్చెనట. ఇది మూడు నాలుగు పుటలలో శ్లాఘింపబడినది. ఇందేమున్నది? భారతీయుడగు నే బాలుడును ఈ కథయందలి నీతి యోమో గ్రహింపజాలడు. "ఎవరికి వారే" యను పాశ్చాత్య ధర్మతత్త్వమును విన్న నాకిపు డా కథయందలి నీతి బోధపడుచున్నది. "చిన్న నా పొట్టకు శ్రీరామ రక్ష"

యని ఇక గొంద అన్నిటిని తమకొఱకే భద్రపఱచుకొను చుండ తల్లులు, తండ్రులు, భార్యలు, బిడ్డలు దిక్కులేనివా రగుచున్నారు. ఇది యెన్నటికిని గృహస్థాదర్శము కానేరదు.

కర్మయోగ మన నెట్టిదో మీ రిపుడు కనుగొని యున్నారు — ప్రాణములనైనను లక్ష్యింపక అవ్యాజముగా పరులకు దోడ్పడుటయే కర్మయోగము. ఇట్టి పరోపకార మున వేలకొలది పర్యాయములు వంచింపబడుదుముగాక, ఐననేమి? పరోపకార మొనర్చుచు నింత ఘనకార్య మొనర్చుచున్నామని కలనైనను తలపకుడు. బీదలకు మీరు చేయు దానధర్మములను గూర్చి యెన్నడును ప్రగల్భములు పలుకకుడు. సరికదా, దాన మొనర్చుటకు మీ కవకాశ మొసగినందులకై వారియెడ కృతజ్ఞులై యుండుడు. ఆదర్శ సన్న్యాసియై మనుటకంటెను ఆదర్శగృహస్థుడై మెలగుట కష్టతరమని మనకిపుడు స్పష్టమైనది. నిజమైన గృహస్థజీవ నము నిజమైన సన్న్యాసజీవనముకంటెను కష్టతరముకానిచో అంతటి దుర్లభమే యనుటకు మాత్రము సందియము లేదు.

---

## నాల్గవ అధ్యాయము

## కర్తవ్యమనగా నెట్టిది?

కర్మయోగవివేచనమున ధర్మము లేక కర్తవ్యమనగా నెట్టిదో గ్రహించు టావశ్యకము. నే నొకపని చేయవలసి యున్నప్పుడు అది నా ధర్మమని మొట్టమొదట నేను గ్రహింపవలసియున్నది. ధర్మమునుగూర్చి భిన్న దేశము

లందు భిన్నాభిప్రాయములు కలవు. మహమ్మదీయుడు కురానులో నేమి చెప్పబడియున్నదో అదియే తన ధర్మమనును; క్రైస్తవుడు బైబిలులో నేమి చెప్పబడియున్నదో అదియే తన ధర్మమని వక్కాణించును. భిన్నజీవితపరిస్థితులను, భిన్నచారిత్రకయుగములను, భిన్నజాతుల ననుసరించి ధర్మమునుగూర్చి భిన్నాభిప్రాయము లేర్పడియున్నవి. సర్వజనసామాన్యములును గ్రహింప దుర్లభములు నగు నితరశబ్దములను నిర్వచించు టెట్లు అసాధ్యమో అట్లే ధర్మమును గూర్చియు నిట్టిదని నిర్వచించుట యసాధ్యము. ఆచరణమున ధర్మముయొక్క రీతిని, ధర్మానుష్ఠానమువలని ఫలములను గమనించితిమేని ధర్మమనగా నెట్టిదో ఇంచుక మనకు బోధపడును. కొన్ని సంఘటనములు మనయెదుట జరుగునపుడు సహజముగనో, అభ్యాసముచేతనో ఒకానొకవిధమున వర్తింప ప్రేరితులమగుచుందుము; ఇట్టి ప్రేరణ కలిగినంతనే సంగతి సందర్భములనుగూర్చి మనస్సు ఆలోచింప మొదలిడును; ఒక్కొక్కప్పుడు కొన్ని పరిస్థితులలో ఒకానొకవిధముగా వర్తించుట మంచిదని మనస్సు తలచును; మఱియొకప్పు డా పరిస్థితులందే ఆ విధమున వర్తించుట మంచిదికాదని తలచును. యోగ్యుడగు ప్రతిమానవుడును తన యంతఃకరణప్రవృత్తి ననుసరించు ననునది ధర్మమును గూర్చి సర్వత్ర ఉన్న సామాన్యాభిప్రాయము. కాని యొక కార్యమును ధర్మమని నిర్ణయించు టెట్లు? కష్టెదుట గోమాంసముండగా క్రైస్తవుడు ప్రాణరక్షణార్థము దానిని తాను తినకుండినగాని, మఱియొకనికి బెట్టకుండినగాని తన

ధర్మమును తాను నెఱవేర్పలేదని భావించుననుట నిశ్చయము. కాని హిందువుడగువాడు గోమాంసమును తాను తినుటకుగాని పరులకు బెట్టుటకుగాని సాహసించెనేని తన ధర్మమును తాను నెఱవేర్పలేదని భావించుననుటయు నిశ్చయమే; హైందవుని విద్యాబుద్ధులును, శిక్షణమును ఆతని నట్లు భావింపజేయుచున్నవి. గత శతాబ్దమున భారతదేశమున పేరుమోసిన థగ్గులను బందిపోటు దొంగలు అనేకులు తమచేతనైన వారినెల్ల జంపి వారి ధనమును దోచుకొనుట తమయొక్క ధర్మమని తలచిరి; ఎంతమందిని జంపిన అంత ఘనకార్య మొనర్చితిమని వారు భావించిరి. వీథిలోనికి వెడలి యొకడు మఱియొకనిని తుపాకితో గాల్చి చంపినయెడల సాధారణముగా అట్టివాడు తన కృత్యమునుగూర్చి పశ్చాత్తాప పడవచ్చును. కాని యాతడే పటాలములో సైనికుడై యొకనిని గాదు, ఇరువదిమందిని జంపినను అందులకై యానందించి తన ధర్మమును తాను అద్భుతముగా నిర్వహించితినని భావించుననుటకు సుంతయు సందియములేదు. కావున ధర్మనిర్ణయమనునది చేయబడిన కార్యమునుబట్టి కానేరదనుట తెల్లము; వస్తుతః ధర్మనిర్ణయముచేయుట కేవలము అసాధ్యము. కాని కర్తయొక్క స్థితిననుసరించి ధర్మమనునది కలదు. మనలను భగవదున్ముఖుల నొనర్చునట్టి కార్యమేదియో అదియే సత్కార్యము, అదియే మన ధర్మము; మనల నధోగతి నొందించునదేదియో అదియే దుష్కార్యము, అది మనధర్మము గానేరదు. ఇట్లు కర్మ మొనర్చువారలమగు మనయొక్క మనఃస్థితి ననుసరించి

కొన్ని కార్యములు మనల నుద్ధరించి మనహృదయమున కౌదార్యము గల్పింప గల్గినవై యుండ మఱికొన్ని మనలను పశుప్రాయులనుగా జేసి అధోగతి నొందింపగలవని గ్రహింప నగును. కాని వివిధపరిస్థితులలో నుండు జనులందఱకును ఏ కార్యము లెట్టి ప్రవృత్తిని గల్గించునో, ఎట్టి పరిణామమును గల్గించునో నిర్ణయించుట కష్టసాధ్యము. ఐనను సర్వకాల సర్వావస్థలయందును, సర్వదేశీయులును ఆమోదించిన ధర్మ నిర్వచనసూత్ర మొకటి కలదు—"పరోపకారః పుణ్యాయ, పాపాయ పరపీడనమ్"*—పరుల కుపకార మొనర్చుటయే పుణ్యము, పరులను పీడించుటయే పాపము.

భగవద్గీత తఱచు వర్ణాశ్రమ ధర్మములను గూర్చి వక్కాణించును. వర్ణాశ్రమములు వివిధ వ్యాపారములయెడ వ్యక్తులయొక్క మనోభావమును ధార్మికదృష్టిని జాలవఱకు నిర్ణయించుచున్నవి. కావున మన మేజాతియందు లేక ఏ సంఘమున జన్మించితిమో తదాదర్శములకును ఆచారములకును అనుగుణమగు నున్నతిని గలుగజేయు కర్మముల నొనర్చుటయే మనధర్మము. కాని యన్నిసంఘములందును, అన్ని దేశములందును ఒకేవిధమగు నాదర్శములుగాని ఆచారములుగాని ప్రాబల్యము నొందియుండజాలవని ముఖ్యముగా మనము గమనింపవలసియున్నది; ఇట్లు మనము గమనింప కుండుటయే వివిధజాతుల కొండొంటియందలి ద్వేషమునకు

* శ్లో. "శ్లోకార్ధేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రన్థకోటిభిః,
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్."

జాలవలెకు మూలకారణము. అమెరికాదేశస్థుడు దేశాచారమున ననుసరించి తన దేశీయు లేమిచేయుచున్నారో అదియే ఉత్తమోత్తమ కర్మమనియు ధర్మమనియు భావించుటయే గాక తనయాచారము ననుసరింపని వాడెవ్వడైనను సరియే పరమ దుర్మార్గుడని తలచును. హిందువుడు తన యాచారములు మాత్రమే ధర్మసమ్మతములనియు ప్రపంచమంతటియందును ఉత్తమోత్తమములనియు నెంచుచు వానిననుసరింపనివా డెవ్వడుగానిండు, పరమదుర్మార్గుడని తలపోయును. సహజముగా మనమందఱము ఈ పొరపాటునకు లోనగుచుందుము. కాని యిది చాల హానికరము; లోకమునందలి దయావిహీనతకు—నిర్దాక్షిణ్యమునకు—మూడువంతు లిదియే హేతువు. నే నీ దేశమునకువచ్చి షికాగో ప్రదర్శనమును జూచుచుండ వెనుకనుండి యొకడు నా తలపాగను లాగెను. వెనుకకు జూతునుగదా, నీటగు దుస్తులతో, ఆతడు చాల పెద్దమనుష్యునివలె గనపడినాడు. నే నాతనితో మాటాడుసరికి, నాకు 'ఇంగ్లీషు' వచ్చునని గ్రహించి యాతడు తెల్లబోయి మొగము చిన్నబుచ్చుకొనెను. ఆ ప్రదర్శనముననే మఱియొకప్పుడు ఒకడు నన్నొకత్రోపు త్రోసినాడు. కారణమేమని నే నాతని బ్రశ్నింప నాతడును మొగము వ్రేలవైచుకొని నట్టుచు, "ఆవిధమైన దుస్తు లెందుకు ధరించితి" రని చెప్పి క్షమాపణ వేడుకొనెను. వీరి సానుభూతియంతయు తమయొక్క వేషభాషలను సరిహద్దులలో బంధింపబడియున్నది. లోకమున బలవంతమైనజాతులు బలహీనమగు వాని నణగద్రొక్కి బాధించుటకు జాలవలెకు ఈ దురభి

ప్రాయమే మూలకారణము. అంతటితో సోదరమానవకోటి యెడ వారి సోదరభావము ఇంకిపోవుచున్నది. తనవలె నే నెందులకు దుస్తులను దాల్పలేదని నా (కాషాయ) వస్త్రములను జూచి నన్ను అవమానింప జూచిన యా వ్యక్తియే సజ్జనుడై, సజ్జనకుడై, సత్పురుడై యుండవచ్చును; కాని తనకంటె వేఱువిధమున వస్త్రధారణ మొనర్చిన వ్యక్తిని జూచినంతనే అతని సౌజన్యము సమసిపోయినది, అనురాగ మడుగంటినది. సర్వదేశములందును క్రొత్తవారిని లోకువ జేయుచుందురు; ఏలన తమ గౌరవమర్యాదల నెట్లు నిలువ బెట్టుకొనవలయునో వారికి తెలియదు. అందుచేత తాము చూచిన వ్యక్తులనుగూర్చి వారు దురభిప్రాయములకులోనై అట్టి దురభిప్రాయములనే వ్యాప్తిచేయుచుందురు. నావికులు, సైనికులు, వర్తకులును విదేశములలో అతివిచిత్రముగ ప్రవర్తించుచుందురు. స్వదేశమున గలనైనను అట్లు ప్రవర్తింప దలపరు. ఐరోపాదేశస్థులను అమెరికాదేశస్థులను చైనావారు "విదేశీయ రాక్షసులు" (Foreign devils) అని చెప్పుచుండుటకు ప్రాయికముగా నిదియే కారణము. పాశ్చాత్యజీవన విధానమందలి దయాసౌజన్యములవైపు జూచినచో వారిట్లు పలికియుండరు.

కావున పరులయొక్క ధర్మమును వారి దృక్పథము ననుసరించియే మనము చూడ యత్నింపవలయుననియు మన ధర్మనిర్ణయములనుబట్టి యెన్నడును పరుల యాచార వ్యవహారములను పరిశీలింపరాదనియు ముఖ్యముగా మనము గుర్తింపవలసియున్నది. లోకమునకు నేను ప్రమాణభూతు

డనుగాను, లోకాచారవ్యవహారములకు నే ననుగుణముగా వర్తింపవలయునుగాని, లోకము నాకనుగుణముగా వర్తింపవలయునని భావింపరాదు. కావున పరిస్థితుల ననుసరించి మనయొక్క ధర్మము లేర్పడుచుండుననియు, ఏ సమయమున కేది ధర్మమగునో దాని నాచరించుటయే ఈ లోకమున మనము చేయదగిన ఉత్తమోత్తమ కార్యమనియు స్పష్టము. జాతినిష్ఠమగు ధర్మము నాచరింతుముగాక; అటు లాచరించిన పిమ్మట జీవితమందును సంఘమునందును మనయొక్క స్థితి ననుసరించి నియమితమగు ధర్మము నవలంబింతుముగాక. ఎట్లైనను మానవస్వభావమున నొక గొప్ప ప్రమాదము కలదు—మన మెన్నడును ఆత్మపరీక్ష చేసికొనము. సింహాసనము నధిష్ఠించుటకు చక్రవర్తి కెంతటి యోగ్యతకలదో మనకును అంతటి యోగ్యత కలదని తలచుచుందుము. ఒకవేళ మనకట్టి యోగ్యత యున్నను మనయొక్క విధ్యుక్త ధర్మమును మొదట మనము నెఱవేర్చి చూపవలయును; అపు డంతకంటె ఉన్నత ధర్మములు మన కేర్పడుచుండును. మనఃపూర్వకముగా మనము కర్మాచరణమునకు దిగినంతనే ప్రకృతి మనకు ప్రహారణముల నొసగి నిజముగా మన 'తాహతు' ఎట్టిదో తెలిసికొనుటకు మనకు దోడ్పడును. తనకు అర్హతలేని స్థానము నెవ్వడును చిరకాల మాక్రమింపజాలడు. ప్రకృతినిర్ణయమును, ప్రకృతిచేయు పరిష్కారమును జూచి విసుగుకొనుటవలన ప్రయోజనములేదు. అల్పకార్యములను జేయువా డందుచే అల్పుడుకాడు. కేవలము అతని విధ్యుక్త కర్మములనుబట్టికాక, ఏ దృష్టితో, ఏ విధముగా

ఆతడు తన కర్మములను నిర్వహించునో దానినిబట్టి మానవుని న్యూనతాధిక్యములను నిర్ణయింపనగును.

ధర్మాచరణమున క్రమముగా "ఈ కార్యము మన కర్తవ్యము కావున చేయవలయు" ననుభావము పోవుననియు, ఏవిధమైన స్వార్థచింతయు లేనప్పుడే మహోత్తమ కర్మ మొనర్తుమనియు గ్రహింపనగును. ఐనను కర్తవ్యతాబుద్ధితో గూడిన కర్మాచరణమే కేవల నిష్కామ కర్మాచరణమునకు మనలను సమర్థుల నొనర్చును. కర్మము ఎపుడు ఆరాధనమగునో–ఆరాధనబుద్ధిని సహిత మతిక్రమించునో–అపుడు కేవల నిష్కామకర్మమగును. అహంకార మమకారములను క్షీణింపజేసి, ఆత్మజ్యోతిని ప్రజ్వలింపజేయుటయే—ఆహారనిద్రాదికములతో మనయొక్క శక్తిసామర్థ్యములను దుర్వినియోగ మొనర్చుకొనుటను తగ్గించి, క్రమముగా ఉన్నతాత్మానుభవములను బొందుటయే—సమస్తయోగములకును ముఖ్యోద్దేశమనియు ధర్మతత్త్వమనినను, ప్రేమతత్త్వమనినను ఇదియే కర్మయోగమనియు గ్రహింపనగును. నీచవాంఛలను సర్వదా నిరాకరించిననే కాని ఇట్టిస్థితిని బొందజాలము; ఇయ్యది ధర్మాచరణ కత్యంతావశ్యకము. స్వార్థపరత్వమును బంధించి మానవుని యథార్థస్వభావమును విజృంభింపజేయు మార్గమును జూపుటయే సమస్తానుభవములకును సమస్తకర్మములకును ప్రయోజనము; తెలిసికాని తెలియకకాని సాంఘిక వ్యవస్థయంతయు, తద్వికాసమంతయు నిట్టి కర్మాచరణ కర్మానుభవములమీదనే ఆధారపడియున్నది.

ధర్మమనిన నెవ్వరికిని రుచింపదు. ధర్మచక్రము ప్రేమ స్నిగ్ధమైనపుడే చక్కగా నడచును; కానిచో నిరంతరసంఘర్షణ మేర్పడుచుండును. ప్రేమార్ద్రహృదయులు కానియెడల తల్లిదండ్రులు తమ బిడ్డలయెడను, భార్యాభర్తలొండొరుల యెడలను తమకర్తవ్యము నెట్లు నిర్వహింపగలరు? ప్రేమ రహితుల జీవితమున నిత్యము మన కనేక స్పర్ధలును పోరాటములును గానవచ్చుటలేదా? ప్రేమమూలముననే ధర్మము రుచించుచున్నది. స్వాతంత్ర్యనభోమండలముననే ప్రేమ చంద్రుడు ప్రకాశించుచున్నాడు. ఐనను ఇంద్రియ కింకరులమై, కామక్రోధాదులకు దాసానుదాసులమై మానవజీవితమున నిత్యము తటస్థించు కలహములకు—కతులకు—కార్పణ్యములకు అధీనులమగుటయా స్వాతంత్ర్యము! ఈ యల్ప సంఘర్షణము లన్నిటియందును—ఈ రొండుదొడుకు లన్నిటి యందును సహనమే మహోన్నతమగు స్వాతంత్ర్యప్రకటనము. స్త్రీలు తమ కోపస్వభావమునకును అసహనమునకును అగ్గమై భర్తలను నిందించి తమ "స్వాతంత్ర్యము"ను నిలుపుకొనుచున్నామని భావింతురుగాక,—కాని తన్మూలమున కేవలము తమ దాస్యమును ప్రకటించుకొనుచున్నామని యెఱుగరువారు, పాపము! ఎప్పుడును భార్యలను దూషించుచునే యుండు భర్తల విషయముకూడ నిట్టిదే.

స్త్రీకి గానిండు, పురుషునకు గానిండు—హృదయ పవిత్రతయె ప్రథమసుగుణము. ఎంతటి దుష్ప్రవర్తనుడగు గాక, పరమసాధ్వియు ప్రేమస్వరూపిణియునగు భార్యవలన సత్పథగామి కానేరని మానవు డెక్కడోకాని యుండడు.

ప్రపంచ మింకను అంత చెడిపోలేదు. పశుప్రాయులగు భర్తలనుగూర్చి — పురుషుల దౌష్ట్యమునుగూర్చి — లోకమున గోల చేయుచుందురుగాని పశుప్రాయులు, దుష్టాత్ములు నగు స్త్రీలయొక్క సంఖ్యయు పురుషుల సంఖ్యకు తీసిపోదనుట నిక్కువము. స్త్రీలందఱును తా మనుకొనునంతటి యోగ్యురాండ్రును పవిత్రహృదయలునగుట వాస్తవమేయైనచో అయోగ్యుడును అపవిత్రహృదయుడునగు పురుషుడొక్కడు కూడ లోకమున నుండియుండడని నా సమ్మతము. విశుద్ధతయు పవిత్రతయు నిర్జింపజాలని దౌర్జన్యమేమికలదు! తన భర్తను దక్క ఇతరు డెవ్వనిగాని తనబిడ్డగా భావించు సాధ్వీమతల్లియెదుట పవిత్రభావముల కధీనుడుకాని పశుతుల్యు డెవ్వడు నుండజాలడు; ఆమె పవిత్రత యంతటి మహిమాన్వితయై విరాజిల్లును. భర్తయగువాడును ఇదే విధమున తన భార్యనుదక్క మిగిలిన స్త్రీలనందఱను తనకు తల్లులనియో, కుమార్తెలనియో, సోదరీమణులనియో భావింప వలయును. మఱియు నెవ్వడు ధర్మప్రబోధకుడు గానెంచునో అట్టివాడు స్త్రీలందఱును తన తల్లులని భావించి వారియెడ మాతృబుద్ధికలిగి మెలగవలయును.

లోకమున తల్లియే మహోత్తమసానము నాక్రమించుచున్నది. అఖండమగు స్వార్థరాహిత్యము — స్వార్థత్యాగము — అచటనే యలవఱచుకొని దైనందినజీవితమున జూపగలము. భగవత్ప్రేమ యొక్కటియే మాతృప్రేమను మించునట్టిది; ఇతరమగు సమస్త ప్రేమానురాగములును మాతృప్రేమతో బోల్చి చూచిన, అత్యల్పములు, హేయ

ములు. మొదట బిడ్డల యోగక్షేమములను తదుపరి తన విషయమును జూచుకొనుట మాతృధర్మము. కాని యిందులకు బదులు తల్లిదండ్రులు తమ యోగక్షేమములనే మొదట చూచుకొనుచుండినచో బిడ్డలకును తల్లిదండ్రులకును గల సంబంధము రెక్కలువచ్చినంతనే తల్లిదండ్రులను త్రోసిరాజనునట్టి పక్షిశాబకములకును పక్షులకును గల సంబంధముతో తుల్యమగును. స్త్రీయెడ జగన్మాతృభావమును జూపగల్గునాతడు నిక్కముగా ధన్యుడు. పురుషునెడ జగత్పితృభావమును జూపు స్త్రీ నిశ్చయముగా ధన్యురాలు. తమ తల్లిదండ్రులను సాక్షాత్పరమేశ్వర రూపులనుగా దర్శించు బిడ్డలు ధన్యులు.

ప్రాప్తకర్మములను కర్తవ్యబుద్ధితో నాచరించుటొక్కటియే అభివృద్ధినొందుటకు మార్గము. ఇట్టి కర్మాచరణముచే ఆత్మబలసంపన్నులమై క్రమముగా మహోత్తమస్థితి నొందుదుము. ఒకప్పుడొక బాలసన్న్యాసి అరణ్యమునకు వెడలి జపతపముల నాచరించుచు చిరకాలము యోగాభ్యాస మొనర్చెను. అనేక సంవత్సరము లట్లు కఠినసాధన చేసినపిమ్మట నొకనా డాత డొక చెట్టుక్రింద గూర్చుండియుండ కొన్ని యెండుటాకు లాతనితలపై బడెను. పైకి జూచుసరికి ఒక కాకియు కొంగయు చెట్టుచివర యుద్ధము చేయుచుండెను. అదిగని యాతడుకుపితుడై యిట్లు పలికెను: "ఏమేమి! ఎండుటాకులను నాతలపై రాల్ప సాహసించితిరిగా!" ఇట్లనుచు దనచూడ్కులను క్రోధాగ్నిజ్వాలలను ఆ పక్షులపై పఱపెను. ఆ క్రోధాగ్నిజ్వాలలు నిజముగా

అగ్నిజ్వాలలై ఆ పక్షులను దహించివైచెను. ఆతని యోగ శక్తి యంతటి మహత్తరమైనది. కేవల వీక్షణముచేతనే ఆ కాకిని కొంగను దగ్ధమొనర్పగల్గిన తనయోగశక్తిని దలచి యాతడు బ్రహ్మానందభరితు డయ్యెను. కొంతసేపైన పిమ్మట భిక్షాటనమునకై యాతడు దగ్గఱనున్న పట్టణమునకు వెడల వలసివచ్చెను. అటులు వెడలి యాతడొక ద్వారముకడ "భవతి భిక్షాం దేహి" యని నిలువ, లోపలినుండి, "నాయనా! కొంచెము తాళుము" అను శబ్దము విన నయ్యెను. ఆ పడుచుసన్న్యాసి యా మాటల నుచ్చరించిన పడుచు నుద్దేశించి తనలో తా నిట్లనుకొనెను: "ఓసీ! నిర్భాగ్యురాలా! నన్నిచ్చట నిలువబెట్ట సాహసించితివా! కానిమ్ము, నీవింకను నాశక్తిసామర్థ్యముల నెఱుగవు కాబోలును." ఆత డట్లనుకొనుచుండ లోపలినుండి మఱల నిట్లు వినవచ్చెను: "నాయనా! అహంకారము చెందకుము, ఇచ్చట కొంగగాని కాకిగాని లేదు." అది విని యాత డాశ్చర్యపడెను; ఏమైన నాతడు తాళవలసి వచ్చెను. ఎట్టకేల కామె భిక్షమిడుటకు వచ్చినంతనే సన్న్యాసి యామెపాదములపై వ్రాలి యనంతర మిట్లు ప్రశ్నించెను: "అమ్మా! ఆసంగతి నీకెట్లు తెలియును?" ఆమె యిట్లు బదులుచెప్పెను: "నాయనా! నీయోగములు, నీసాధనలు నెట్టివో నాకు తెలియవు. నే నతిసామాన్యను. నాభర్తకు జబ్బుగానుండుటచే ఆయనకు సేవచేయుచు నిన్ను నిలువ బెట్టితిని. నా ధర్మమును నిర్వహించుటకే నా జీవితమంతయు ధారపోయుచున్నాను. అవివాహితనై యున్నప్పుడు నా తల్లి

దంర్రులయెడ నా ధర్మమును నెఱపితిని; వివాహితనై నా భర్తయెడ నాధర్మమును నిర్వహించుచున్నాను; ఇంతకంటె నేను సాధించుయోగము మఱియొకటిలేదు. కాని స్వధర్మాచరణముచే నాకు జ్ఞానోదయమైనది. ఈ విధముగా నీ మనోభావమును గ్రహించి యడవిలో నీ వొనర్చిన పని తెలిసికొనగల్గితిని. ఇంతకంటె విశేషము గ్రహింపగోరెదవేని నే జెప్పు పట్టణమునకు వెడలి యందలి యంగడివీథిలోనుండు నొకా నొక వ్యాధుని గలిసికొనుము. అతడు చెప్పు విషయములు నిన్ను సంతృప్తు నొనర్పగలవు.'' ''ఆ పట్టణమునకు, మీదు మిక్కిలి ఆ వ్యాధునికడకు నేనేల వెడలవలయును!'' అని సన్న్యాసి మున్ముందు తలచియు క్రమముగా మనస్సమాధానమునొంది యచటికి వెడలెను. పట్టణమును సమీపించుసరికి అంగడిలో ఒకింతదూరమున స్థూలకాయుడగు నొకవ్యాధుడు పెద్ద పెద్ద కత్తులతో మాంసమునుగోయుచు, కొనవచ్చిన వారితో బేరము చెప్పుచు సంభాషించుచుండుట గాంచెను. అంత నా బాల సన్న్యాసి యిట్లనుకొనెను: ''శ్రీరామరక్ష! ఈ వ్యక్తి యొద్దనా నేను ధర్మము నేర్చుట! ఈతడు కేవలము రాక్షసునివలె కనబడుచున్నాడు.'' ఇంతలో వ్యాధుడు సన్న్యాసివైపుచూచి యిటు లాహ్వానించెను: ''స్వామీ! రండు, దయచేయుడు! ఆ సాధ్వి మిమ్ము చటకు బంపినదా! నా పనియగువఱకు ఆ యాసనమున గూర్చుండుడు.'' ''ఇచట నేమి జరుగనున్నదో!'' యని సన్న్యాసి తనలో దా ననుకొనుచు ఆ యాసనమున గూర్చుండెను. వ్యాధుడు

తనపని సాగించి, వ్యాపారాంతమున సొమ్ము లెక్క చూచుకొని, సన్న్యాసిని జూచి, "అయ్యా! రండు, మా యింటికి దయచేయుడు" అని పిలిచెను. ఇల్లు చేరినంతనే సన్న్యాసికి ఒక యాసనమును జూపి, "ఇచట వేచియుండుడు" అని వ్యాధుడు లోనికి జనెను. అంత నాతడు వృద్ధులగు తన తల్లిదండ్రులకు స్నానము చేయించి, భోజనమిడి, శ్రద్ధాభక్తులతో వారలను సంతుష్టులనొనర్చి, పిమ్మట సన్న్యాసికడ కేతెంచి యిట్లు పలికెను: "నన్ను చూచుటకై మీరు వచ్చియున్నారుకదా. నేను మీకు చేయగల కార్యమేమో సెలవిండు." సన్న్యాసి యంతట జీవుని గూర్చియు దేవుని గూర్చియు వ్యాధుని గొన్ని ప్రశ్నలు వేయ వ్యాధుడవ్విషయములను గూర్చి మహోపన్యాసమొనర్చెను. "వ్యాధగీత" యనుపేర నియ్యది మహాభారతమం దొక భాగమై, వేదాంతమహోన్నత తత్త్వరాశియై విరాజిల్లుచున్నది. వ్యాధుడు తన బోధనమునుముగించుసరికి సన్న్యాసి యాశ్చర్య చకితుడై యిట్లు ప్రశ్నించెను: "మీరేల యిట్టి శరీరమును దాల్చియున్నారు? ఇంతటి విజ్ఞానులగు మీరు ఇట్టి నీచకర్మములను జేయుచు ఏల యీ వ్యాధశరీరమును ధరించితిరి?" వ్యాధు డిట్లు సమాధాన మొసగెను. "నాయనా! ఏ కర్మమును నీచము కాదు; ఏ కర్మమును మలినముగాదు. జన్మముచే నా కిట్టి పరిస్థితులు కలిగినవి. బాల్యమున ఈ వ్యాపారమును నేర్చితిని. అనాసక్తుడనై నా కార్యములను చక్కగా నిర్వర్తింపయత్నించుచున్నాను. గృహస్థుడనగు నేను నా విధ్యుక్తధర్మములను నిర్వహింప

ప్రయత్నించుచు యథాశక్తిగా నా తల్లిదండ్రులను సంతుష్టులనొనర్చుచున్నాను. మీ యోగానుష్ఠానము లెట్టివో నే నెఱుగను. నేను సన్న్యాస స్వీకరణము చేయలేదు; సంసారమును విడిచి యరణ్యమునకునుబోలేదు. ఐనను మీరు నా యొద్ద వినినట్టియు గనినట్టియు విశేషములన్నియు స్వవర్ణాశ్రమ ధర్మమును నిష్కామముగా నెఱపుటచే నాకు లభించినవి."

భారతదేశమున నొక మహర్షి, ఒక మహాయోగి, నా జన్మమున నేజూచిన యత్యద్భుత వ్యక్తులలో నొకవ్యక్తి కలడు. విచిత్రమైనవాడాతడు; ఎవ్వరికి నాతడు బోధింపడు; మీ ప్రశ్నల కాతడు సమాధాన మొసగడు. ఆచార్యపదవి నాత డధిష్ఠింపజాలడు. ఆత డట్టి వినమ్రుడు. మీ రొక ప్రశ్న వైచి, కొన్ని దినములచట కనిపెట్టుకొనియుండిన పక్షమున ప్రసంగవశాత్తు ఆత డా విషయమును గైకొని అద్భుతమగు తన బోధన తేజమును దానిపై బఱపి విస్పష్ట మొనర్చును. కర్మరహస్యమును గూర్చి యొకప్పుడు నా కాత డిట్లు తెల్పెను; "కార్యాచరణమున సాధన సాధ్యము లొండొంటితో ఏకీభవింపవలయును." నీవొకకర్మ మొనర్చుచున్నప్పుడు తత్కార్యాచరణమునే కాని మఱి దేనిని లక్షింపకుము. దాని నారాధనగా, మహోత్తమారాధనగా నొనర్చుచు నీ జీవితమును దానికి సమర్పింపుము. ఇవ్విధమున కథలో వ్యాధుడును పతివ్రతయు మనఃపూర్వకముగా, మహానందముతో తమ ధర్మమును నిర్వహించిరి; తత్ఫలిత

ముగా వారికి జ్ఞానోదయమైనది; దీనివలన నే యాశ్రమ ధర్మములనైనను సక్రమముగా, ఫలాపేక్షారహితముగా, నిర్వహించినయెడల మహోన్నతాత్మానుభవము — ఆత్మ సాక్షాత్కారము—లభించునని విశదమగుచున్నది.

ఫలాపేక్ష యున్నప్పుడే తనకు ప్రాప్తమైన ధర్మమును గూర్చియు కర్మమును గూర్చియు మానవుడు విసుగుకొనును; ఫలాపేక్ష లేనిచో సమస్తకర్మములును సమానముగనే యోగ్యమై కన్పట్టును; స్వార్థపరతను కామమును జయించి, ఆత్మస్వాతంత్ర్యమును బడయుటకై వారి కవి యన్నియు పటుతరసాధనములుగనే తోచును. తఱచు మన మందఱము విశేషమగు నహంకారమునకు వశమగుచుందుము. మనమేమో అనుకొనుచుందుము కాని, మన ధర్మములు—కర్తవ్యకర్మములు—మనపాత్రతనుబట్టి నిర్ణీతములగుచున్నవి. స్పర్థ యసహనమును బెంచును. దానిచే దయాళుత్వము నశించును. విసుగుకొనువానికి ఏ ధర్మములును రుచింపవు, ఏ కర్మములును తృప్తి నొసగజాలవు; ఆతని జీవితమంతయు వ్యర్థమైపోవుట విధివిహితము. కావున ప్రాప్తకర్మముల నొనర్చుచు మన బాధ్యతలను వహింప సదా సంసిద్ధుల మయ్యెదము గాక. అపుడు తప్పక మనకు జ్ఞానోదయ మగును!

పరోపకారముచే నెవ రుపకారము నొందుచున్నారు?

ధర్మానుష్ఠానమునందలి శ్రద్ధాభక్తులు ఆత్మశ్రేయమునకై మన కెట్లు తోడ్పడునో విచారించుటకుముందు మఱి యొక దృక్పథము నుండి కర్మమనగా భారతీయులమగు మా యభిప్రాయమేమో సూక్ష్మముగా దెలిపెదను. ప్రతి మతమును తత్త్వవిచారము, పురాణములు, కర్మకలాపములు నను మూడు భాగములను గలిగియుండును. తత్త్వవిచారమే ప్రతిమతముయొక్కయు సారాంశమనుటకు సందియము లేదు; ఇంచుమించుగా ఐతిహ్యములగు మహాపురుష చారిత్రముల చేతను అద్భుతవిషయములనుగూర్చిన గాథలచేతను కథల చేతను పురాణములు సోదాహరణముగా తత్త్వమును విశదీకరించును; కర్మకలాపములు దానినింకను సర్వజనగ్రాహ్యమగునట్లు బోధపఱుచుటకై దానికి రూపకల్పన మొనర్చును—ఇట్టి రూపకల్పనలతోగూడిన తత్త్వశాస్త్రమే కర్మకలాపము. ఇదియే కర్మకాండ. ప్రతిమతమందును ఇయ్యది ఆవశ్యకమై యున్నది. ఏలన విశేషాత్మాభివృద్ధి నొందనిదే దుర్లభమగు పారమార్థిక విషయములను మనలో ననేకులు గ్రహింపజాలరు. అన్నియు మనకు బోధపడునని మనమనుకొనుట సులభమే కాని ఆచరణమునకు వచ్చుసరికి ఆధ్యాత్మికవిషయములను–ఇంద్రియగోచరముకాని తాత్త్విక విషయములను—గ్రహించు టెంత కష్టసాధ్యమో తెలియును. ఇవ్విషయమున ప్రతీకములును సంజ్ఞలును మనకు

విశేషసాహాయ్యకరములు. సంకేతములచేతను అర్థవాదముల చేతను తత్త్వమును బోధించు విధానమును నిరసింపజాలము. అత్యంతప్రాచీనకాలమునుండియు సంకేతములు లేక సంజ్ఞలు సర్వమతములందును వినియోగింపబడుచున్నవి. సంజ్ఞలమూలముననే కాని మనము ఆలోచింపజాలము. శబ్దములు భావముల యొక్క సంజ్ఞలు. పక్షాంతరమున జగత్తునందలి ప్రతి వస్తువును సంజ్ఞయనియే భావింపనగును. జగత్తంతయు నొక సంజ్ఞ. ఈ సంజ్ఞచే దెలియబడువాడు భగవంతుడు. ఈ విధమైన సంజ్ఞాశాస్త్రము కేవల మానవకల్పితము కాదు; ఒకానొక మతమునకు జెందిన కొందఱు జనులొకచో జేరి, కొన్ని సంజ్ఞల నూహించి, వానిని తమ మానసమునుండి వెలువఱుచుచున్నారని భావింపరాదు. పారమార్థికసంజ్ఞలు సహజ వికాసము నొంది యున్నవి. కానిచో ఇంచుమించుగా ప్రతి వ్యక్తియొక్క మానసమందును కొన్ని సంజ్ఞలు లేక చిహ్నములు ప్రత్యేకమగు కొన్ని భావములతో సంబంధము నొంది యుండుటకు కారణమేమి? 'శిలువ' యను † ఈ చిహ్నము మొట్టమొదట క్రైస్తవమతమునుండి పుట్టినదని మీలో ననేకులు భావింపవచ్చును; కాని వాస్తవముగా నిది క్రైస్తవమతమునకు పూర్వము, మోజెస్ (Moses) పుట్టుటకు ముందు, వేదములకు మునుపు, మానవులను గూర్చిన విషయములు చారిత్రకరూపమును దాల్చుటకు పూర్వముననే యుండెను. ఏజెటెక్ (Aztec) ఫినిషియన్ (Phoenician) అను జాతులలో ఈ చిహ్నము ఉన్నట్లు గాన్పించును: ప్రపంచమున ప్రతి జాతియందును శిలువ యను నీ చిహ్నమున్నట్లు గాన్పించును.

ఇటులనే శిలువపై గొఱతవేయబడిన వానిని లేక 'రక్షకుని' దెలుపు సంజ్ఞయు ప్రతిజాతికిని దెలిసియున్నట్లు కానబడును. లోకమంతటను సున్న యొక మహాసంజ్ఞయై యున్నది. మఱియు సమస్త సంజ్ఞలయందును సర్వజనసామాన్య మగు 卐 'స్వస్తికము' మాట చెప్పనక్కఱయే లేదు. బౌద్ధులు దీనిని దమతో గొనిపోయి లోకమంతటను వ్యాప్తమొనరించిరని యొకానొకప్పుడు తలంపబడినది. కాని బౌద్ధమతమునకు అనేక యుగములకు పూర్వము ఇయ్యది వివిధజాతులచే నుపయోగింపబడుచుండెనని కనుగొనవచ్చును. ప్రాచీన బాబిలోనియా, ఈజిప్టు దేశములలో నిది యుపయోగమున నున్నట్లు కాన్పించును. దీనివలన దేలుచున్న దేమి? ఈ సంజ్ఞలన్నియు కేవల దేశాచారము ననుసరించి యేర్పడినవి కానేరవు: వీని కేదియో యొక కారణ ముండియుండవలయును. మానవమానసమునకును ఈ సంజ్ఞలకును అవినాభావ సంబంధ ముండియుండవలయును. భాష కేవల మాచార సంజనితము కానేరదు; కొందఱు కొన్నిసంజ్ఞలచే గొన్ని భావములను బ్రకటింప దమలో దా మొక యొడంబడిక చేసికొనిరనియు భావింపజాలము. భావమున కనురూపమగు సంజ్ఞయు సంజ్ఞ కనురూపమగు భావమును లేకుండిన దెన్నడును లేదు; సహజముగనే భావములును సంజ్ఞలును అవినాభావసంబంధము గలిగియున్నవి. ఇట్లు భావమును దెలుపునట్టి సంజ్ఞలు శబ్దరూపమునగాని వర్ణరూపమునగాని యుండవచ్చును. చెవిటివారును మూగవారును శబ్దేతరములగు సంజ్ఞలతో నాలోచింపవలసియున్నది. మానసమందలి ప్రతి భావ

మునకును ప్రతిరూపము గలదు: వేదాంతశాస్త్రమున నిదియే నామరూపములని చెప్పబడుచున్నది. కేవలాచారముచే భావను సృష్టించు టెంతటి యసాధ్యమో సంజ్ఞాశాస్త్రమును సృష్టించుటయు నంతటియసాధ్యమేయని చెప్పవలసియున్నది. కర్మకలాపమందలి సంజ్ఞలలో మానవకోటియొక్క పార మార్థికజ్ఞానము ప్రకటిత మగుచున్నది. కర్మకలాపములు, దేవాలయములు మొదలగు బాహ్యాచారములు నిష్ప్రయో జనము లనుట సులభమే; ఆధునిక కాలమున ప్రతిబాలకుడు నిట్లు చెప్పుచున్నాడు. కాని దేవాలయమున దేవు నర్చించు వారికిని, అర్చింపని వారికిని పెక్కు విషయములలో భేదమున్న దని జనులు బాగుగా గుర్తింపవలయును. కావున కొన్ని యాలయములను, కర్మకలాపములను, బాహ్యవిధులను కొన్ని మతధర్మములతో నన్వయించుటచే ఆయా మతధర్మముల నవలంబించువారలకు ఆ రూపములు వేనికి సంజ్ఞలై యున్నవో ఆ భావములను స్ఫురింప జేయును. కావున కర్మకలాపములను సంజ్ఞలను త్రోసిరా జనవలయు ననుట సమంజసము కాదు. వీనినిగూర్చిన వివేచనయు వీని అనుష్ఠానమును సహజముగా కర్మయోగాంతర్గతములై యున్నవి.

కర్మయోగమున విచారణీయములగు నితరవిషయము లనేకములు కలవు. శబ్దార్థములకు గల అన్యోన్యసంబంధ మెట్టిదో, శబ్దశక్తిచే నేమి సాధింపగలమో గ్రహించుట యిందు ముఖ్యవిషయము. శబ్దశక్తిని ప్రతిమతము అంగీక రించుచున్నది. కొన్నిటిలో శబ్దమునుండియే సృష్టి యంతయు

ఉత్పన్నమైనదని చెప్పబడియున్నది. *సృష్టించుటకు పూర్వము సృష్టినిగూర్చి భగవంతుడు సంకల్పించియుండుటచే శబ్దము నుండి సృష్టి వెలువడినది; కావున భగవత్సంకల్పముయొక్క బాహ్యాంశమే శబ్దము. మన ఐహిక జీవనాందోళనము చేతను కాడాపుడిచేతను మన నాడీకోశము గ్రహణశక్తిని గోల్పోయి ప్రాణరహిత మగుచున్నది. వయసు వచ్చినకొలదియు, లోకముచే ప్రహారణములు తినినకొలదియు మొండి తేలుచుందుము; నిరంతరము స్పష్టముగా మన కట్టెదుట జరుగుచున్న విషయములను సైతము లక్షింపకుందుము. ఎట్లయినను మానవస్వభావము ఒక్కొక్కప్పుడు ప్రాబల్యము నొందుచుండును. అపుడీ సామాన్యజీవిత సంఘటనములను జూచి యబ్బురపడి వాని తత్త్వమును గ్రహింప ప్రేరితుల మగుచుందుము; ఇటు లబ్బురపడుటయే జ్ఞానార్జనమునకు మొదటిమెట్టు. శబ్దమునకు గల పారమార్థిక ప్రాముఖ్యము నటుంచి, మానవజీవితరంగమున శబ్దసంజ్ఞలు ప్రధానస్థానమును వహించుచున్నవని చెప్పనొప్పును. ఇప్పుడు నేను మీతో మాటలాడుచున్నాను. మిమ్ము నేను తాకుట లేదు. నా మాటలచే జనించు వాయుస్పందనములు మీ చెవులలో ప్రవేశించి, అందలి నాడులను స్పృశించి మీ మానసమున నొకవిధమగు మార్పు గలుగజేయుచున్నవి. దీనిని మీరు నిరోధింపజాలరు. ఇంతకంటె ఆశ్చర్యకరమైన

* "In the beginning was the Word, and the Word was with God, and the Word was God"—Bible. St. John 1-1.

"ఓ మిత్యేతదక్షరమిదం సర్వమ్" —మాండూక్యోపనిషత్తు. 1-1.

చేమి? ఒకడు మఱియొకనిని "మూర్ఖుడా" యనినంతనే ఆతడు లేచి నిలువబడి పిడికిలి బిగియబట్టి తన్ను దూషించిన వాని ముక్కుపై గ్రుద్దుచున్నాడు. శబ్దశక్తి యెట్టిదో గనుడు! అతిదీనురాలై యొకస్త్రీ విలపించుచున్నది; మఱి యొకతె ఆమెను సమీపించి కొన్ని శాంతవచనములు చెప్పుచున్నది! క్రుంగిపోయిన యా దుఃఖితురాలి వెన్ను తిన్నబడ నామె దుఃఖ విరహితయై నవ్వుచున్నది. శబ్దప్రభావ మెట్టిదో చూడుడు! వేదాంతమున శబ్దము లెంతటి శక్తి మంతములో సామాన్యజీవితమునను అంతటిశక్తి మంతము లే. అనాలోచితముగా శేయింబవళ్లు మన మీ శబ్దశక్తిని వినియోగించుచున్నాము. శబ్దశక్తియొక్క స్వభావమును గ్రహించుటయు దానిని చక్కగా వినియోగించుటయును గూడ కర్మయోగాంశమే యైయున్నది.

పరులకు దోడ్పడుటయే, పరహిత మొనర్చుటయే లోకమునెడ మనధర్మము. మనమేల లోకహిత మొనర్ప వలయును? లోకమునకు దోడ్పడుటకనునట్లు పైకి గాన్పించు చున్నను నిజముగా మనకే మనము తోడ్పడుటకై లోక హిత మొనర్పవలయును. పరోపకార మొనర్చుటకై సదా మనము ప్రయత్నింపవలయును. కాని మనము బాగుగా పరిశీలించి చూచినచో పరులకుగాని లోకమునకుగాని మన యుపకార మనావశ్యకమని గ్రహింతుము. నీవును నేనును ఉపకారము చేయుటకై యీ ప్రపంచము సృష్టింపబడ లేదు. నే నొక క్రైస్తవ ధర్మోపదేశమున నిట్లు చదివి యున్నాను: "సుందరమగు నీ ప్రపంచమంతయు జాల

మంచిది, ఏలన పరోపకార మొనర్చుటకై మనకిది యవ కాశమును గల్పించుచున్నది, సమయము నొసగుచున్నది.”

పైకిది చాల చక్కని భావమే కాని ప్రపంచమునకు మన యుపకారము కావలసియున్నదనుట మహాపరాధము కాదా? ప్రపంచము దుఃఖభూయిష్ఠమనుట నిజమే;* అందుచే పరుల కుపకార మొనర్చుటయే మనము చేయగలిగిన మహోత్తమ కార్యమనుటకు సందియము లేదు; ఐనను పరుల కుపకార మొనర్చుట యనగా కేవలము మనకే మన ముపకార మొనర్చుకొనుటయని కాలక్రమమున గ్రహింతుము. నా చిన్నతనమున నాయొద్ద కొన్ని తెల్లని చుంచు లుండెడివి. వానికొఱకై అమర్పబడిన చిన్ని చక్రములతో గూడిన యొక చిన్న పెట్టెలో వాని నుంచువాడను. చుంచు లా చక్రములను దాట యత్నించునపుడెల్ల చక్రములు దిర్దిర తిరుగుచుండుటచే ఎంత ప్రయత్నించినను అవి యథాస్థానముననే యుండెడివి. ప్రపంచవిషయమును ప్రపంచమునకు మన ముపకారము చేయు విషయముగూడ నిట్టివే. ఉన్న ఉపకారమంతయు మనకు నైతికశిక్షణ లభించుటతో గూడు కొనియున్నది. ఈ ప్రపంచము మంచిది కాని చెడ్డది కాని కాదు; ప్రతివ్యక్తియు తనకు తానే యొక ప్రపంచమును నిర్మించుకొనుచున్నాడు. గ్రుడ్డివాడు ప్రపంచమునుగూర్చి భావించు నెడల వానికి ప్రపంచము గట్టిదిగనో, మెత్తనిది

---

* “అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వ మామ్.”

—భగవద్గీత, 9-33.

“...దుఃఖాలయ మశాశ్వతమ్” — ,, 8-15.

గనో, వెచ్చనిదిగనో, చల్లనిదిగనో ఉండునుగదా. ఏ సమయమునగాని మన జీవితము సుఖవంతముగనో దుఃఖమయముగనో ఉండును; వేలకొలదిసారులు మనకిది యనుభవ గోచరమై యున్నది. సర్వసాధారణముగా యువకులు ఆశాపూరితులుగను వృద్ధులు నిరాశామయులుగను ఉందురు. సహస్రసదవకాశములతో జీవితము యువకులకు దమయెదుట గోచరించుచుండును; వృద్ధులు తమ యవకాశములు చెల్లెనని, తమ సమయము తీఱెనని మొఱపెట్టుచుందురు; తీరని వేయికోర్కెలు వారి మానసమును కలవరపఱచుచుండును. ఏమైనను ఈ యిరుతెగలవారును అవివేకులే యని చెప్ప వలసియున్నది. మనయొక్క మనఃస్థితిననుసరించి మన దృక్పథము ననుసరించి జీవితము మంచిదిగా గాని చెడ్డదిగా గాని కాన్పించుచుండును; స్వతస్సిద్ధముగా అది యిందేదియు గాదు. అగ్ని స్వతస్సిద్ధముగా మంచిదిగాని చెడ్డదిగాని కాదు. శీతకాలమున మనము చలిదీర్చుకొనుట కుపయోగించునపుడు "నిప్పెంత మంచిదో!" అనుకొనుచుందుము. నిప్పుచే మన వ్రేళ్లు కాలినప్పుడు దానిని చెడమడ దిట్టుదుము. ఐనను స్వతః అది మంచిదికాని చెడ్డదికాని కాదు. మన ముపయోగించుకొను విధానమునుబట్టి దానియందలి కీడుమేళ్లు మనకు తట్టుచుండును; ప్రపంచవిషయముకూడ నిట్టిదే. ప్రపంచము సమగ్రమైన వస్తువు. ఇచట సమగ్రతయనగా తనయొక్క ప్రయోజనమును నెఱవేర్చుట కది తగియున్నదని భావము. మనతో నిమిత్తము లేకయే ప్రపంచము మిక్కిలి చక్కగా సాగునని మనమందఱము నిస్సంశయముగా నమ్మవచ్చును.

లోకమున కుపకారము చేయుటకై మనము తాపత్రయపడ నక్కఱలేదు.

ఐనను మనము లోకహిత మొనర్పవలయును; లోకోపకార మొనర్చుట—లోకమునకు దోడ్పడుట—మన కనన్య సామాన్యమగు సదవకాశమని గ్రహించినచో పరోపకారేచ్ఛ మనయందలి మహోత్తమ ప్రేరణశక్తియై ప్రకాశించును. నాలుగు దమ్మిడీలను చేతబట్టుకొని, "ఇదిగో నోయి, యాచకుడా!" యని స్వాతిశయముతో—అహంభావముతో—వర్తింపక, వానికి దానముచేయుటచే ఆత్మహిత మొనర్చుకొనుటకై నీ కొఱకా బీదవాడచట నున్నాడని వానియెడల కృతజ్ఞుడవై యుండుము. ధన్యుడగువాడు దాతకాని ప్రతిగ్రహీత కాడు. నీ యౌదార్యమును నీ దయాళుత్వమును లోకమున సాధించుటకై, తన్మూలమున నీవు పవిత్రుడవై, పరిపూర్ణుడవగుటకై నీ కవకాశము లభించినదని లోకమునెడ కృతజ్ఞుడవై యుండుము. సమస్త సత్కార్యములును మనలను పునీతులనుగను పరిపూర్ణులనుగను నొనర్చుట కనుకూలించుచున్నవి. మన యావచ్ఛక్తిని వినియోగించి మనముచేయు ఘనకార్యమేమో చెప్పుడు. ఒక యాసుపత్రిని కట్టించుటయో, కొన్ని బాటలు వేయుటయో, యొక ధర్మశాల నిర్మించుటయో—ఇంతియేకదా! 'ధర్మకార్యమునకు చందా' యని యొక ధార్మికవ్యవస్థ నేర్పఱిచి, లోకులనుండి ఏ రెండు మూడు లక్షలో ప్రోగుచేసి, ఒక లక్షతో నొక యాసుపత్రిని కట్టించి, రెండవ దానితో అల్పాహారపు విందులను, 'అధికాహారపు విందు'

లను 'డ్యాన్సు'లను త్రాగుడులను జరిపి, మిగిలిన దానిలో సగము ప్రభుత్వోద్యోగులు హరించి, సగము బీదల కిచ్చు టయేగదా ! మంచిది. ఇవియన్నియు ఏమాత్రపు ఘనకార్యములు? ఒక్కతుపాను ఐదునిమిషములలో మీ కట్టడముల నన్నిటిని ఎగురగొట్టి వేయునే. అపుడు మనము చేయగలిగిన దేమి? ఒక్క అగ్నిపర్వతము పగిలి మన తోటలను, ఆసుపత్రులను, నగరములను, కట్టడములను సమస్తము తుడిచి వేయునే! కావున లోకోపకారమను నీ మూర్ఖ ప్రలాపమును విరమింతము గాక. లోకము నీ సాయముకొఱకును నా సాయముకొఱకును పడిగాపులు పడియుండలేదు; ఐనను సదా కార్యనిరతులమై లోకహితమొనర్చుట మన విధియై యున్నది; ఏలన, అయ్యది మనకు వరప్రసాదము. ముక్తుల మగుటకు మన కిదియొక్కటే మార్గము. మనము సాయము చేసిన ఏ యాచకుడుగాని మన కెన్నడును ఒక్క గవ్వ యైనను ఋణపడినవాడు కాడు; వానికే మనము సమస్తము ఋణపడియున్నాము. ఏలన మన దానమును తనపై సాధించుటకు ఆతడు మన కవకాశ మొసగుచున్నాడు. లోకోపకారము చేసితి మనికాని, చేయగలమనికాని, ఎవ్వరికో కొందఱకు మనము సాయము చేసియుంటిమనికాని తలచుట కేవలము అపరాధ మగుటయే గాక మూర్ఖాలోచనము; మూర్ఖాలోచన దుఃఖహేతువు. మన మెవ్వనికో సాయము చేసితిమని యెంచి యాతడు మనయెడ కృతజ్ఞత గనబఱుపవలయునని కోరుదుము ; ఆతడటుల చేయకుండుటచే దుఃఖింతుము. మనకార్యములకు మన మేల ప్రతిఫలమాశింపవల

యును? నీవు తోడ్పడిన వానియెడల కృతజ్ఞుడవై వానిని దేవునిగా భావింపుము. సోదర మానవ సాహాయ్యరూపమున భగవదారాధనావకాశము నొందుట అనన్యసామాన్యమగు నవకాశమును బడయుటకాదా? మనము నిజముగా నిష్కామములమై యున్నచో వ్యర్థమగు నీ ఫలాపేక్షచే దుఃఖింపక మహానందముతో లోకమున సత్కార్యాచరణ మొనర్పగలము. నిష్కామకర్మాచరణమువలన నెన్నటికిని దుఃఖముగాని దుఃస్థితిగాని సంభవింపనేరదు. లోకము తన సుఖదుఃఖములతో శాశ్వతముగా సాగుచునే యుండును.

ఒకప్పుడొక బీదవాడు ధనికుడుగానెంచి యొక భూతమును వశపఱచుకొనినచో ధనము తెమ్మనికాని తన యిచ్ఛ వచ్చిన కార్యముల నొనర్పుమనికాని భూతమున కాజ్ఞాపింప వచ్చునని వినియుండెను. అందుచే నాత డొక భూతమును కైవసమొనర్చుకొన నాత్రపడుచు భూతమును తన కొసగగల వ్యక్తికొఱకై ముందు వెదకసాగెను. అట్టి శక్తిసంపన్నుడగు ఋషినొకని నాత డెట్లో కలిసికొని తనకు సాయము చేయుమని ప్రార్థింప, "భూతము నీ కెందుల" కని ఋషి ప్రశ్నించెను. అందుల కాతడు, "నా యాశయములను నెఱవేర్చుకొనుటకై నా కొక భూతము కావలయును; దానిని సంపాదించు విధానమును బోధింపుడు; స్వామీ! నా కిది యత్యావశ్యకమై యున్న" దని చెప్పెను. ఋషి యందులకు, "భూతమును వలదు, ప్రేతమును వలదు, నీకీ తాపత్రయమును వలదు ఇంటికి బొమ్ము!" అనెను. తన ప్రయత్నమును విడువక మఱునాడు మఱల నాతడు ఋషియొద్దకేగి విలపించుచు నిట్లు

ప్రార్థించెను ; "నాకొక భూతమును దయచేయుడు. స్వామీ! దానివలన నాకు చాల ప్రయోజనము కలదు. నాకొక భూతమును దయచేయుడు." తుదకు ప్రాణము విసుగ ఋషి యిట్లు పల్కెను : "ఇదిగో మంత్రము. ఈ మంత్రమును జపింతువేని భూతము నీకడకు వచ్చును. అది నీవు చెప్పినపని చేయును. కాని జాగ్రత్తసుమీ! ఈ భూతములకు నిరంతరము పని కల్పింపవలయును. లేనియెడల అవి నీ ప్రాణము తీయును." పేదవాడందుల కిట్లు పల్కెను. "స్వామీ! అదెంతపని! యావజ్జీవము దానికి నేను పని చూపగలను." అంత నాతడొక యరణ్యమునకు వెడలి చాలకాల మా మంత్రమును జపింప తుదకొక పెనుభూతము ప్రత్యక్షమై యిట్లు పల్కెను : "నేనొక భూతమను. నీ మంత్రశక్తిచే నీకు వశమైతిని; కాని నీవు నాకు సదా పని కల్పింపలయును సుమీ; నాకు నీవు పని చూపజాలని యుత్తరక్షణముననే నిన్ను చంపివైతును." అంత నాతడు తనకై యొక యంతఃపురమును నిర్మింపు మని చెప్ప భూతము, "ఐనది, ఇదిగో నిర్మించితిని చూడుము!" అనియెను. ఆత డంత, "ధనము తీసికొని రమ్ము" అని పలుక భూతము, "తెచ్చితిని, చూడుము" అనియెను. "ఈ యరణ్యమును ఛేదించి యిచట నొక పురము నిర్మింపుము." "ఇదిగో పూర్తియైనది, చేయవలయున దింకేమైన గలదా?" యని భూతము తిండ్రించెను. అంత నాతడు భయపడి యిట్లాలోచింపసాగెను : "దీని కిక నేనేమియు జెప్పజాలను; ఏమి చెప్పిననిది యుత్తరక్షణముననే చేసివేయుచున్నది." భూతము ఊరకుకొనక యిట్లు గద్దించెను. నా కేమైన పనిచెప్పుము, లేకున్న

నిన్ను కబళించి వేయుదును.'' పాప మా నిర్భాగ్యుడు భూత మున కిక నేమియు పనిచూప జాలకుండుటకు భయభ్రాంతుడై పరుగున బోయి ఋషిపాదములకడ వ్రాలి, ''స్వామీ! నా ప్రాణము కాపాడుడు'' అని మొఱపెట్టెను. ''ఏమి జరిగిన'' దని ఋషి యడుగ నాత డిట్లు చెప్పెను. ''భూతమున కిక నేనేమియు పని చూపజాలను. నేను చెప్పిన పనిని మఱుక్షణ మున నే అది చేసివేయుచున్నది. 'పనిచూపజాలని పక్షమున నిన్ను మ్రింగివేయుదు' నని భయపెట్టుచున్నది.'' ఆ నిముస మున నే భూత మచటికి వాయువేగమున వచ్చి, ''ఇదిగో నిన్ను మ్రింగివేసెదను. ఏమి చెప్పెదవు?'' అని గద్దింప నతడు గడగడ వణకుచు తన్ను రక్షింపుమని ఋషిని ప్రార్థింప సాగెను. ఋషి యాతని కిట్లు తెల్పెను. ''ఇదిగో నీ ప్రాణ రక్షణ కుపాయము. వంకరగానున్న ఆ కుక్కతోకను జూచి తివా? కత్తి గైకొని దానిని గోసి వంగియున్న దానిని నిడుపు చేయుమని భూతమున కిమ్ము.'' అంత నాతడు ఆ కుక్క తోకను ఖండించి భూతమున కిచ్చి దానిని తనకొఱకై నిడుపు చేయుమనెను. భూతము దానిని గైకొని అతి జాగరూకతతో నెమ్మదిగా నిడుపుచేసెను గాని, పట్టు వదలినంత నే అది మఱల ముడుచుకొనిపోయెను. భూతము దానిని కష్టపడి సరి చేసినను చేయి వదలినంత నే మఱల ముడుచుకొనిపోయెను. పట్టుదలతోడను ఓరిమితోడను భూతము మఱల ఆ కుక్క తోకను సరిచేసెను. కాని చేయివదలినంత నే మఱల తోక ముడుచుకొని పోయెను. అట్లా భూతము ఆ కుక్కతోకతో అనేక దినములు కొట్టుమిట్టాడి, విసిగి వేసారి యిట్లు తలచెను:

"ఇదివఱ కెన్నడును నా జన్మలో నిట్టిబాధ పొందినవాడను గాను. ఆరితేఱిన వృద్ధభూతమనయ్యు ఇంతవఱ కెన్న డిన్ని తిప్పలు పడియెఱుగను." ఇట్లు భావించి యా భూతము ఆతనితో సంధిచేసికొను తలంపున నిట్లు పల్కెను: "మన మిరువురము ఒక యొడంబడిక చేసికొందము. నన్ను నీవు విడిచిపెట్టుము. నేనింతవఱకు నీ కొసగినవన్నియు నీవుంచుకొనుట కంగీకరించి నిన్నిక బాధింపనని వాగ్దానము చేయుచున్నాను." ఆతడందుల కమితసంతుష్టుడై యంగీకరించెను.

ఈ ప్రపంచము కుక్కతోకవంటిది. వేలకొలది సంవత్సరములనుండి దీనిని సరిచేయుట కనేకులు విశ్వప్రయత్నము చేయుచున్నారు; కాని వారు దీనిని విడిచినంతనే యథాప్రకారము మఱల వక్రమైపోవుచున్నది; వక్రమగుటయే దాని స్వభావము. నిష్కామముగా నెట్లు కర్మమాచరింపవలయునో మొదట తెలిసికొన్నచో మానవుడు దురభిమానగ్రస్తుడు కాకుండును. లోకము కుక్కతోకవంటిదనియు ఎన్నటికిని తిన్నబడదనియు గ్రహించినచో మనము మూర్ఖాభినివేశగ్రస్తులము గాకుందుము. లోకము మూర్ఖాభినివేశము లేకుండినయెడల విశేషముగా వికాసము నొందియుండెడిది. అభినివేశముగాని అభిమానముగాని లోకశ్రేయమునకు దోడ్పడుననుకొనుట మిక్కిలి పొరపాటు. శ్రేయస్కరము గాకపోవుటయటుండ దానివలన ద్వేషమును క్రోధమును బయలుదేఱి జనులలో కలహములకును కఱులకును మార్గదర్శకమగును. మన మేకార్యము చేసినను, ఏమి కలిగియున్నను అదియే లోకమున మహోత్తమమైనదనియు తద్వ్యతిరిక్తమంతయు

నిష్ప్రయోజనమనియు దలచుచుందుము. కావున దురభిమానము నొందుట కవకాశము గాన్పించినపుడెల్ల కుక్కయొక్క వంకరతోకసంగతి జ్ఞప్తికి దెచ్చుకొనుడు. ప్రపంచమునుగూర్చి మీరు తాపత్రయపడనక్కఱలేదు. మీరు లేకున్నను అది సాగుచునేయుండును. దురభిమానరహితులైనపుడే చక్కగా కర్మము నాచరింపగలరు; ఒడుదొడుకులు చెందనివాడు, చిత్తప్రశాంతియుతుడు, న్యాయదృష్టి గలవాడు, నెమ్మదియైనవాడు, విశేషప్రేమసానుభూతియుక్తుడు—ఇట్టివాడే లోకాభ్యుదయ కర్మము నాచరించి తానును అభ్యుదయము నొందగలడు. దురభిమానగ్రస్తునకు వివేకము గాని పరులయెడ సానుభూతిగాని యుండనేరదు; లోకము నాతడెన్నడును చక్కజేయజాలడు. తానును పునీతుడై పరిపూర్ణుడు గాజాలడు.

నేటి యుపన్యాసమందలి ముఖ్యవిషయములను సింహావలోకన మొనరింతము. లోకము మన కేమియు ఋణపడియుండ లేదనునదియు, మనమే లోకమునకు ఋణపడియున్నామనునదియు మనము గ్రహింపవలసిన మొదటి విషయము. ఏ లేశమైనను లోకహిత మొనర్చు నవకాశము నొందుట మన కందఱకు నిరుపమానమగు నవకాశము—గర్వింపదగిన సదవకాశము. లోకోపకార మొనరించు ప్రయత్నమున నిజముగా మనకే మన ముపకార మొనర్చుకొనుచున్నాము. లోకమున భగవంతు డనునొకడు కలడనునది మనము గ్రహింపవలసిన రెండవ విషయము. ప్రపంచము దరిగానక కొట్టుకొని పోవుచున్నదనియు మీరును నేనును

దానిని రక్షింపవలయుననియు అనుకొనుట పిచ్చితనము. భగవంతుడు సదా జగదంతరాత్ముడై యున్నాడు. ఆతడు అవినాశియు. అప్రమత్తుడు, శాశ్వత దక్షుడునై వెల్గొందు చున్నాడు. విశ్వమంతయు నిద్రాణమై యున్నను ఆతడు నిద్రింపడు; ఆతడు నిరంతరము కర్మ మొనర్చుచునే యున్నాడు. విశ్వమందలి సమస్తరూపములును పరిణామములును ఆతనివే. మన మెవ్వరిని ద్వేషింపరాదనునది మనము గుర్తింపవలసిన మూడవ విషయము. ఈ ప్రపంచము సదా మంచిచెడుగుల సమ్మిశ్రితమై యుండక తప్పదు. దుర్బలుల యెడ సానుభూతి జూపుచు దురాచారునిగూడ ప్రేమించుటయే మన ధర్మము. క్రమముగు నాత్మబలాభివృద్ధి నొందుటకై సాధన చేయుట కనువగు మహానైతిక వ్యాయామశాలయే సువిశాలముగు నీ ప్రపంచము. దురభిమానము ప్రేమానురాగవ్యతిరిక్తము. కావున నెట్టి దురభిమానమునకును వశ్యులముగారాదనునది మనము గమనింపవలసిన నాల్గవ విషయము. ''పాపమును ద్వేషింతునుగాని పాపిని ద్వేషింపను'' అని దురభిమాన పూరితులు చెప్పుచుండుట మీరు వినియుందురు. కాని నిజముగా పాపమునకును పాపికిని భేదము నేర్పఱుపగలిగిన వ్యక్తియొక్క ముఖారవిందమును గాంచుటకై ఎంతదూరమైన వెడలుటకు నేను సంసిద్ధుడను. పైవిధమున జెప్పుట సులభమే. గుణమునకును గుణికిని గల భేదమును బాగుగా గ్రహింపగల్గినచో మన మీపాటికి ముక్తులమై యుందుము. కాని యటులచేయుట అంత సులభము కాదు. మఱియు మనము ప్రశాంతచిత్తులమైన కొలదియు, మన యుద్రేకము

తగ్గి మనస్సు స్తిమితపడిన కొలదియు ప్రేమమయుల మధ్యో దయము; మన కర్మాచరణమును మఱింత బాగుగా నుండును.

---

## ఆఱవ అధ్యాయము

## అనాసక్తియే పూర్ణస్వార్థత్యాగము

మనయందుండి వెలువడు ప్రతికర్మమును ప్రతిక్రియా రూపమున మనలను బొందుచున్న విధముననే మనము చేయు ప్రతికార్యమును ఇతరులయందును, ఇతరులకార్యములు మనయందును తమ ప్రభావమును జూపుచుండును. దుష్కార్యములనొనర్చు జనులు మఱింత దుర్జనులగుచుండుటయు వారే యెట్లో సత్కార్యముల నాచరించునపుడు క్రమముగా మనశ్శక్తిని బడసి నాటినుండియు సత్కార్యములనే సదా చేయనేర్చుటయు మీరందఱును గమనించియుండవచ్చును. మన మొండొరులపై కర్మప్రభావమును జూపుచుందుమనుట కంటె నిట్టికర్మఫల ప్రాబల్యమునకు వేఱొక కారణమును జూపజాలము. ప్రకృతిశాస్త్రమునుండి యిందుల కొక యుదాహరణము: నేనొక పని చేయుచున్నప్పుడు నామనస్సు ప్రత్యేకమగు నొక స్పందనస్థితిలో నుండునని చెప్పవచ్చును; ఇట్టిస్థితియందే యున్న ఇతరమానసములన్నియు నామనః స్థితిచే కొంచెమో గొప్పయో మార్పుచెందుట కనుగుణముగా నుండును. ఒకేవిధమగు శ్రుతికూర్పబడిన వివిధవాద్య విశేషములు ఒకగదిలో నున్నప్పుడు వానిలో నొకదానిని ధ్వనించినచో నితరములన్నియు ఆ శ్రుతినే ధ్వనింప బ్రవ

ర్తించునని మీరందఱును గమనించియుందురు. కావున ఒకే స్థితిలో నున్న మానసములన్నియు ఒకేభావముచే సమానముగా మార్పునొందునని చెప్పనొప్పును. భావమునకు మానసముపై గల ఇట్టిప్రభావము దూరమునుబట్టియు నితర కారణములనుబట్టియు మాఱుచుండినను మనస్సు మాత్ర మెప్పుడును మార్పుచెందుట కనువైయుండునని మన మొప్పుకొనవలయును. నేనొక దుష్కార్యము చేయుచున్నా ననుకొనుడు. అపుడు నా మానసము ఒకానొక స్పందన స్థితిలో నుండుటచే లోకమున నట్టిస్థితియందేయున్న ఇతర మానసములన్నియు నా మనస్స్పందనస్థితివలన మార్పు నొందుట కనువుగా నుండును. ఇట్లే నేనొక సత్కార్యమును జేయుచున్నపుడు నా మనస్సు మఱియొక స్పందనస్థితిలో నుండును; అట్టిస్థితిలోనేయున్న ఇతరమానసములన్నియు నా మనస్స్పందనస్థితివలన మార్పునొందు నవకాశము గలిగి యుండును; ఒండొరులపై నిట్టి మనఃప్రభావము స్పందన శక్తియొక్క న్యూనతాధిక్యములనుబట్టి మాఱుచుండును.

పై దృష్టాంతమునే యనుసరించి తేజస్తరంగములు ఏదేనొకవస్తువును జేరుటకు ముందు లక్షలకొలది సంవత్సరములు పయనింప నవకాశమున్నరీతినే భావతరంగములును తమ కనుకూలస్పందనస్థితిలో నుండు విషయమును జేరుటకు ముందు వందలకొలదియేండ్లు పయనింపవచ్చునని తేర్పడుచున్నది. కావున మన యీ వాతావరణము అట్టిభావ స్పందనములతో—మంచివియు చెడ్డవియునగు ద్వివిధమైన భావములయొక్క స్పందనములతో — నిండియున్నదనుట

కింతేనియవకాశము గలదు. ప్రతిమానసమునుండి వెలువడు ప్రతిభావమును తన్ను స్వీకరించుట కనువగు మానసమును గలిసికొనుపర్యంతము పయనించుచు స్పందించుచునే యుండు నని చెప్పనొప్పును. ఇట్టిభావములను గైకొనుటకు సిద్ధముగా నున్న యే మానసమైనను వెంటనే వానిని గైకొనును. కావున నొకడు దుష్కార్యములను జేయుచున్నపుడు అతడు తన మానసమును ఒకానొక స్పందనస్థితికి దీసికొనివచ్చి యుండుటచే తదనుగుణమై, వాతావరణమున నీవఱకే యున్నవని చెప్పదగినట్టి స్పందనములన్నియు అతని మానస మున ప్రవేశించుటకై యత్నించును. సాధారణముగా దుర్జ నుడు దుష్కార్యములను దినదినాభివృద్ధిగా జేయుచుండుట కిదియే కారణము. వానికృత్యములు ప్రాబల్యము నొందు చుండును. సత్కార్యముల నొనర్చువాని విషయముకూడ నిట్టిదే; వాతావరణముననున్న సద్భావస్పందనములను గ్రహింప నాతడు తన మానసము నాయత్తమొనర్చుటచే, అతని సద్భావములు దృఢమగుచున్నవి. కావున దుష్కార్య ముల నొనర్చునెడ మనకు ద్విగుణీకృతమగు ప్రమాద మేర్పడుచున్నది; మనల నావరించియున్న దుర్భావముల నన్నిటిని గ్రహింప మన మానసమును సంసిద్ధము చేయు టొకటి, వందలకొలదిసంవత్సరముల యనంతర మగుగాక, ఇతరులకు బాధకల్గించు చెడుగు నుద్భవింపజేయుట రెండవది. మనము దుష్కార్యాచరణమూలమున మనలను ఇతరులను గూడ బాధించుచున్నాము; సత్కార్యాచరణమూలమున మనకును పరులకునుగూడ మేలు చేకూర్చుచున్నాము;

మఱియు మానవునందలి యితర శక్తులన్నిటివలెనే మంచి చెడుగులను నీ శక్తులును బాహ్యప్రపంచమునుండి మఱింత సామర్థ్యమును సంపాదించుకొనుచున్నవి.

కర్మయోగమునను సరించి చూచునెడ, మన మొనర్చు నేకర్మమైనను ఫలవంతముకానిదే నశింపజాలదనియు, ప్రకృతి యందలి యేశక్తియు దానిని ఫలప్రదముగాకుండ నిరోధింప జాలదనియు గ్రహింపవగును. నేనొక దుష్కార్యమును జేసితి నేని దాని దుష్ఫలమును నే ననుభవించితీరవలయును; దాని నీ ప్రపంచమున నే శక్తియు నిరోధింపజాలదు. ఇట్లే నేనొక సత్కార్యమును జేసితినేని, అయ్యది సత్ఫలప్రదము గాకుండు నట్లు అడ్డుకొనుశక్తి యీ విశ్వమున లేదు. కారణమున్నచో కార్యముండి తీరవలయును. దాని, నేదియు ఆపజాలదు; అడ్డు కొనజాలదు. కర్మయోగమునుగూర్చి యిపుడొక చాల చక్కని విషయము—నిర్ధారణ మగుచున్నది. మనయొక్క సత్కర్మములును దుష్కర్మములునుగూడ అత్యంతము, అన్యోన్య సంబద్ధములై, సమ్మిశ్రితములై యున్నవి. మంచి చెడుగుల నడుమ నొక గీతగీచి, ఇది పూర్తిగా మంచి కార్యము, ఇది పూర్తిగా చెడ్డకార్యమని విభజింపజాలము. ఒకేసమయమున సత్ఫలితమును దుష్ఫలితమునుగూడ నీయ జాలని కార్యము లేనేలేదు. ఇందుల కత్యంతసన్నిహితమైన యొకయుదాహరణము: నేను మీతో ప్రసంగించుచున్నాను. మీలో కొందఱు నేను సత్కార్యము చేయుచున్నానని భావింతురుగాక. కాని వాతావరణమునందలి వేలకొలది క్రిములను జంపుచు ప్రాయశః నేను మఱియొకరికి చెడుగు

చేయుచున్నాను. మనము చేయుకార్యము ఫలదృష్టిచే మన కత్యంత సన్నిహితమై మన మెఱిగినవారికి మేలుచేయుచున్న యెడల దానిని సత్కార్యమనుచున్నాము. ఉదాహరణమునకు మీరు నాయుపన్యాసవ్యాపారము చాలమంచిదని చెప్పవచ్చును. కాని క్రిములట్లు చెప్పునా? చెప్పవు. మిమ్ము మీరు చూచుచున్నారు కాని క్రిములను జూచుటలేదు. నే జేయు ప్రసంగము మీవిషయమున నెట్టి ఫలితమును గల్గించుచున్నదో మీకు గోచరించుచున్నది. కాని క్రిముల విషయమున నెట్టి ఫలితమును గల్గించుచున్నదో మీకంతగా గోచరించుటలేదు. కావున మన దుష్కార్యములనుగూడ మనము పరిశీలించి చూచినయెడల ఎచ్చటనో వానివలన గొంత మేలు కలిగిన కలుగవచ్చునని మనము గ్రహింపవచ్చును. సత్కర్మములయందుగూడ నేదియో కొంత చెడుగున్నదనియు* కేవల దుష్కర్మములందును ఏమూలనో యొకమూల కొంత మే లున్నదనియు గ్రహించు నాతడే కర్మరహస్యమును గ్రహించుచున్నాడు.

కాని దీనివలన దేలున దేమి? మన మెంత ప్రయత్నించినను కేవలసత్కర్మమని చెప్పదగిన కర్మముగాని, కేవలదుష్కర్మమని చెప్పదగిన కర్మముగాని—మంచి చెడుగులనునవి అహింస, హింస యను భావమున గ్రహింతుమేని—యుండనేరదు. పరులకు హింసలేకుండ జీవింపనే చాలము, శ్వాసింపనే చాలము; మనము నోటబెట్టుకొను ప్రతి కబళ

* "సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః."
—భగవద్గీత. 18-48.

మును మఱియొకని నోటినుండి లాగికొనుచున్నామన్న మాటయే: ఇతర జీవములను త్రోసిరాజని మనము జీవించు చున్నాము—మన జీవనస్వభావమే యిట్టిది. మానవుల నగు గాక, జంతువుల నగుగాక, సూక్ష్మమైన క్రిముల నగుగాక, —ఎవ్వరినో యొకరిని త్రోసిరాజనక తప్పదు. కావున కర్మ ముచే పరిపూర్ణత సిద్ధింపదని సహజముగా నేర్పడుచున్నది. ఆచంద్రార్కము మీరు కర్మమొనర్చినను ఈ గహనము నుండి—ఈ కర్మవ్యూహమునుండి—బయల్పడు మార్గము కానబడదు; విధివిరామములనునవి లేక మీరు కర్మమొనర్చి నను కీడు మేళ్లతో కర్మఫలము లనివార్యముగా సమ్మి శ్రితము కాక మానవు.

కర్మయోగాశయము, కర్మప్రయోజనము నేమనునది మనము గమనింపవలసిన రెండవవిషయము. ఈ విశ్వము పరి పూర్ణస్థితికి వచ్చు సమయము—ప్రపంచమున వ్యాధిగాని, జరామరణములుగాని, దుఃఖదౌష్ట్యములుగాని ఎప్పుడు లేకుం డునో అట్టిసమయము—వచ్చునని నమ్ముజనులు అధికసంఖ్యా కులు ప్రతిదేశమునను గానవచ్చుచుందురు. ఇయ్యది చాల చక్కని యభిప్రాయమే, సందియము లేదు; అజ్ఞులకు సదా శయములను గల్పించి, వారల నున్నతినొందించుట కియ్యది శక్తిమంతమగు చక్కని ప్రేరేపణమనుటకు సంశయము లేదు; కాని క్షణమాలోచించితిమేని ఇయ్యది కేవల మసంభవమని స్పష్టము కాగలదు. మంచిచెడుగులు ఒకేనాణెమున కిరు వైపులవంటివని—ఒకేదివసమునకు రేయింబవళ్లవంటివని— విస్పష్టముగా గాన్పించుచుండ నన్యథా యెట్లు భావింప

నగును ? కీడులేని మేలు చేకులు యెట్లు పొసగును? పరిపూర్ణత యనగా నేమి ? పరిపూర్ణ జీవితమనునది స్వవచనవ్యాఘాతము. మనకును బాహ్యప్రపంచమందలి ప్రతివస్తువునకును నిరంతర సంఘర్షణస్థితి యే కదా మనజీవితము. ప్రతిక్షణమును బాహ్యప్రకృతితో మనము పోరాడుచునే యున్నాము ; ఈ పోరాటమున మనము నిర్జితులమైనచో జీవితమే సమసిపోవును. ఆహారముకొఱకును శ్వాసముకొఱకును నిరంతరమైన పోరాటమే జీవితము. వీనిలో నేది లేకున్నను చనిపోవుదుము. జీవితము సుఖదుఃఖ సమ్మిళితముగాక, ఎట్టి యొడుదొడుకులు లేక, "సాపు"గా, సరళముగా నడచునట్టిది కాదు. అంతర్గతమగు నొకానొక తత్త్వమునకును బాహ్యప్రపంచమునకును సంఘటిల్లు బహుప్రకారములగు నీ పోరాటమునే మనము జీవిత మనుచున్నాము. కావున ఈ పోరాటము ముగిసినంతనే జీవితమును ముగియు ననుట విస్పష్టము.

ఆదర్శసౌఖ్యమనగా ఈ పోరాట మంతమగునట్టి స్థితి యన్నమాట. కాని యపుడు జీవితమే అంతమొందుచున్నది. జీవితమంతమగునపుడే కదా ఈ పోరాటమును అంతము కాగలదు. పరోపకారయత్నమున మనకే మన ముపకారము చేసికొనుచున్నా మనుసంగతి మన మిదివఱకే గ్రహించి యున్నాము. పరార్థకర్మము యొక్క పరమప్రయోజనము మనలను మనము పునీతుల నొనర్చుకొనుటయే కాని మఱి యొకటికాదు. పరులకు మేలుచేయవలయునను సంతత ప్రయత్నముచే మనలను మనము మఱవ యత్నించుచున్నాము. అహంకార విముక్తులముగా నెంచుచున్నాము. ఇట్టి స్వార్థ

రాహిత్యమే—స్వార్థవిస్మృతియే— జీవితమున నేర్పడగిన మహా గుణపాఠము. అవివేకముచే మానవుడు స్వసుఖమును గూర్చి తలపోయును. కాని పెక్కు సంవత్సరము లట్లు ప్రయత్నించి తుదకు స్వార్థరాహిత్యముననే నిజమగు సౌఖ్యము—ఆనందము—గలదనియు తాను దక్క మఱెవ్వరును తనకు సౌఖ్యము గల్గింపజాలరనియు మానవుడు గ్రహించుచున్నాడు. ప్రతిధార్మికకృత్యమును, ప్రతిప్రేమభావమును, ప్రతి పరహితార్థకర్మమును, ప్రతి సత్కార్యమును మన యల్ప వ్యక్తిత్వమును, అహంభావమును తొలగించి మన క్షుద్రతను గుర్తింప జేయుచుండుటచే నివి యన్నియు శ్రేయస్కర కార్యములే. జ్ఞాన భక్తి కర్మములిచటనే ఐక్యమొందుచున్నవి. ఎచట తానుగాక పరుడు గాన్పించునో, నిరంతరమైన యట్టి స్వార్థత్యాగమే మన మహోన్నతాదర్శము; మనము దీని నెఱిగినను ఎఱుగకున్నను కర్మయోగము మనల నీ పరమావధిని బొందించును. నిర్గుణబ్రహ్మభావమనినచో ధర్మప్రబోధకులు భీతిల్లవచ్చును. తమ వ్యక్తిత్వమును, ప్రత్యేకతను నిలుపుకొనవలయునను తలంపున "యథార్థమగునది సగుణబ్రహ్మ" మని వారు నొక్కి వక్కాణింపవచ్చును—వ్యక్తిత్వమన, ప్రత్యేకత యన వారి యభిప్రాయమేమైన నగుగాక. ధర్మమునుగూర్చి వారి భావములు—నిజముగా నవి యోగ్యములై యున్నచో—అత్యున్నత స్వార్థత్యాగముపై నాధారపడియుండుట విధాయకము. సమస్తధర్మములకును—సమస్తనీతి నియమములకును—స్వార్థత్యాగమే మూలాధారము; మానవుల విషయమున నగుగాక, జంతువుల విషయమున

నగుగాక, దేవతల విషయమున నగుగాక, సమస్త ధర్మశాస్త్రములకును ఇదియే మూలతత్త్వము, ప్రధానాశయము.

వివిధములగు మానవులు లోకమున మనకు గాన్పింతురు. తమ ప్రాణమునైనను త్యజించి పరహిత మొనర్చునట్టి సంపూర్ణస్వార్థత్యాగులగు భగవదాయత్తచిత్తులిందు మొట్టమొదటి తరగతివారు. వీరే మానవోత్తములు. ఏ దేశమునగాని యిట్టి మహానీయులు ఒకవందమందియున్నచో ఆ దేశమున కిక భయము లేదు. కాని దురదృష్టవశమున నిట్టివారరుదుగా గాని లేరు. స్వార్థమునకు ప్రతికూలము గాకుండునంతవఱకు పరహిత మొనర్చునట్టి సజ్జనులు రెండవ తరగతివారు; ఇక స్వప్రయోజనమునకై పరులకు హానిచేయునట్టి జనులు మూడవ తరగతివారు. "యే తు ఘ్నన్తి నిరర్థకం పరహితం తే కే నజానీమహే*—వృథాస్వార్థభంగము గావించెడి వార లెవ్వరో యెఱుంగన్ శక్యమే యేరికిన్" అని భర్తృహరికవీంద్రుడు నాల్గవతరగతి జనులనుగూర్చి వారి నేమనవలయునో తెలియకున్నదని పలికె

* శ్లో. "ఏతే సత్పురుషాః పరార్థఘటకా స్స్వార్థాన్ పరిత్యజ్య యే
సామాన్యాస్తు పరార్థ ముద్యమభృతః స్వార్థావిరోధేన యే,
తేఽమీ మానుషరాక్షసాః పరహితం స్వార్థాయ నిఘ్నన్తి యే
యే తు ఘ్నన్తి నిరర్థకం పరహితం తే కే నజానీమహే."

మ "తమకార్యంబుఁ బరిత్యజించియు బరార్థప్రాపకుల్ సజ్జనుల్
దమకార్యంబు ఘటించుచున్ బరహితార్థవ్యాపృతుల్ మధ్యముల్
దమకై యన్యహితార్థఘాతుకజనుల్ దైత్యుల్ వృథాస్వార్థభంగము గావించెడువార లెవ్వరో యెఱుంగన్ శక్యమే యేరికిన్."

యున్నాడు. జీవితరంగమున నొకవైపున కేవల నిస్స్వార్థముగా పరహిత మొనర్చునట్టి మహోత్తములున్నరీతినే మఱియొకవైపున కేవలము అకారణముగా పరహింసచేయు దుర్మార్గులును గలరు. దానివలన వారికి లేశమును లాభము లేకున్నను దుష్కార్యముల నొనర్చుట వారి స్వభావము.†

ఇప్పట్టున మనకు విచారణీయములగు "ప్రవృత్తి" "నివృత్తి" యను రెండుపదములు కలవు. "నేను, నాది" యనునట్టి అహంకార మమకారములతో గూడిన ప్రపంచమును లేక సంసారమునే ప్రవృత్తి యనుచున్నాము. సిరిసంపదలు, అధికారము, పేరుప్రఖ్యాతులు మున్నగునవన్నియు "నేను" అనునట్టి మూలస్థానమున సర్వము ప్రోగిడజూచుచు, "నాది" యనుభావము నావరించుకొనియున్నవి. ఇవి యన్నియు ప్రవృత్తిలోనివే. సర్వప్రదేశములనుండియు సమస్త వస్తువులను తనకు ప్రియతమమగు "నేను" అను స్థానమున గూడబెట్టుకొనజూచు మానవసహజగుణమే యీ ప్రవృత్తి. ఈ ప్రవృత్తి నిర్మూలముగా నారంభించి నివృత్తి యుదయించునపుడే ధార్మికచింత, పారమార్థికదృష్టి యనునవి

---

† శ్లో. "అకరుణత్వ మకారణవిగ్రహః, పరధనే పరయోషితి చ స్పృహా,
సుజనబన్ధుజనేష్వసహిష్ణుతా, ప్రకృతిసిద్ధమిదం హి దురాత్మనామ్."

తే. "కారణము లేని కలహంబు ♦ గరుణ లేమి
పరవధూ పరధనవాంఛ ♦ బంధు సాధు
జనములం దసహిష్ణుత్వ ♦ మనఁగ జగతిఁ
బ్రకృతిసిద్ధంబు లివి ♦ దుష్ట నికరమునకు."

—భర్తృహరి సుభాషితము, 1-5-41

పొడకట్టుచున్నవి. ప్రవృత్తి నివృత్తులు రెండును కర్మముతోడనే సంబంధించియున్నవి: దుష్కర్మమే ప్రవృత్తి, సత్కర్మమే నివృత్తి. సమస్త నీతి నియమములకును సమస్త ధర్మములకును నివృత్తియే మూలాధారము. పరులకొఱకై తనుమనః ప్రాణములను — జీవితసర్వస్వమును — త్యజింప సంసిద్ధమగునట్టి పరిపూర్ణ స్వార్థరాహిత్యమే నివృత్తికి పరమావధి. ఈస్థితిని ప్రాపించినచో మానవుడు కర్మయోగ పరమావధిని బొందుచున్నాడు. ఇదియే సత్కర్మాచరణము వలని మహోన్నత ఫలము. ఎవ్వడేని యొక్క తత్త్వశాస్త్రమునైన నభ్యసింపకపోయినను, భగవంతుడు కలడని నమ్మకపోయినను, నమ్మియుండకపోయినను జన్మమున నొక్కసారియైనను భగవంతుని ప్రార్థింపకపోయినను కేవల సత్కర్మాచరణ ప్రభావముచేతనే పరులకొఱకు తన జీవిత సర్వస్వమును సమర్పింప సంసిద్ధుడగునట్టి స్వార్థరహితస్థితికి వచ్చినచో, భక్తుడు తన ప్రార్థనలవలనను, జ్ఞాని తన జ్ఞానమువలనను ప్రాపించునట్టి పరమావధినే ప్రాపించుచున్నాడు. కావున స్వార్థరాహిత్యమనునది జ్ఞానికిని, కర్మికిని భక్తునకునుగూడ సమావేశనిలయమగు గమ్యస్థానమైయున్నది. తమ మతధర్మములు, తమ తత్త్వశాస్త్రములు నెంత భేదించినను సమస్తమానవకోటియు పరులకొఱకై తన సర్వస్వమును త్యజింప సంసిద్ధుడగు నాతని ప్రేమాల భక్తిపూర్వక భయాన్వితమై నతులొనర్చును. ఇయ్యది కేవల మతవిషయముకాని మతసిద్ధాంత విషయముకాని కాదు—పారమార్థిక విషయములయెడ విశేష విముఖులగు

వారు, వ్యతిరేకాభిప్రాయపూరితులగువారు సైతము ఇట్టి సంపూర్ణ స్వార్థత్యాగసంజనిత కృత్యమును గాంచినంతనే దాని కంజలి ఘటింతురు. స్వమత దురభిమానపూరిత క్రైస్తవుడుకూడ ఎడ్విన్ ఆర్నాల్డ్ (Edwin Arnold) వ్రాసిన "ఆసియాఖండ జ్యోతి" (Light of Asia) ని జదివి స్వార్థత్యాగమును దక్క మఱి దేనినిగూర్చియు బోధింపని—ఏ దేవునిగూర్చియు బోధింపని—బుద్ధునియెడ నెట్టి గౌరవభావము జూపునో మీరు కనలేదా? విషయమేమన, తన జీవితాశయమును తన కెవ్వరితో భేదాభిప్రాయము గలదో వాని జీవితాశయము నొక్కటియే యని స్వమత దురభిమాని యెఱుగడు. పాపము! భగవద్భావనను సత్కర్మాచరణమును సదా లక్షించుచు ఉపాసకుడును తుదకు ఆ గమ్యస్థానమునే చేరి భగవంతు నుద్దేశించి, "నీ యిచ్ఛయే నెఱవేఱుగావుత" మని పలుకుచు అహంకార మమకారములను విడుచుచున్నాడు. స్వార్థరాహిత్య మన్న నిదియే. తన జ్ఞానముచే జ్ఞానియు "నేను" అనునది వట్టిభ్రాంతి యని తెలిసికొని అహంకార మమకారములను విసర్జించుచున్నాడు; ఇదియు స్వార్థరాహిత్యమేకదా. కావున నిచట కర్మమును భక్తియు జ్ఞానమును ఐక్య మొందుచున్నవి. భగవంతుడనగా సంసారముకాదని ప్రాచీన మహాప్రబోధకు లెల్లరును బోధించినపుడు వారి యభిప్రాయ మిదియే. సంసారము వేఱు, భగవంతుడు వేఱు—ఇది యథార్థము. సంసారమనగా స్వార్థపరత్వమని వారి యభిప్రాయము. స్వార్థరాహిత్యమే భగవంతుడు. స్వర్ణమయాంతఃపురమున నవరత్నఖచిత సింహా

సనము నధిష్ఠించియు నొకడు సంపూర్ణముగా స్వార్థరహితుడై యుండవచ్చును; అపుడే యాతడు భగవంతునియందు సుప్రతిష్ఠితుడై యుండును. మఱియొకడు మిక్కిలి పేదయై చింపిగుడ్డలను గట్టుకొని గుడిసెలో నివసించుచుండవచ్చును; ఐననాతడు స్వార్థపరుడై యున్నచో సంసారపంక నిమగ్నుడే కదా.

ఇక మన ప్రధానవిషయమును పరిశీలించునెడల ప్రతి సత్కార్యమునను ఏదియోకొంత చెడుగుండుననియు నిట్లే ప్రతి దుష్కార్యమునను ఏదియోకొంత మంచియుండుననియు జెప్పెదము. ఇట్లు గ్రహించినచో మన మిక కర్మమొనర్చు టెట్లు? మానవుడు జీవించియున్నయెడల, పాపము, క్షుద్ర జంతువులను మొక్కలను చంపవలసియుండునని, లేదా మఱి యెవ్వరికో యొకరికి హానిచేయక తప్పదని క్రమముగా ఆత్మహత్యనొనర్చుకొనుటయే సంసార తరణోపాయమని బోధించు మత సంప్రదాయములును కలవు. ఇది అత్యాశ్చర్యకరము కాదా? కేవలము అసంగతము కాదా? మరణించుటయే సంసార తరణోపాయమట! ఇదియే తమ మహోత్తమాదర్శముగా నెంచి జైను లీ సిద్ధాంతమును బోధించియున్నారు. ఈ సిద్ధాంతము చాల న్యాయసమ్మతముగా నున్నట్లు కాన్పించును; కాని యీ సమస్యకు సరియైన సమాధానము భగవద్గీతయందు గానబడును. ఇదియే నిష్కామకర్మసిద్ధాంతము. నిష్కామ కర్మమనగా జీవితమున మన విధ్యుక్త కర్మములను జేయుచు ఫలసంగరహితులమై యుండుట. నీవు సంసారమున నున్నను సంసారముకంటె సంపూర్ణముగా భిన్నుడ

వనియు, అందే కర్మ మొనర్చుచున్నను నీకొఱకు నీవు చేయుటలేదనియు గ్రహింపుము. నీకొఱకు నీవే కర్మమొనర్చినను తత్ఫలితముగా నీవు బద్ధుడవయ్యెదవు. అయ్యది సత్కర్మమైనచో సత్ఫలితమును దుష్కర్మమైనచో దుష్ఫలితమును నీ వనుభవించి తీరవలయును; కాని స్వార్థరహితముగా నొనర్పబడిన యే కర్మమును నిన్ను బంధింపజాలదు. గీతలలో ఈ భావమును దెలుపు నొక చక్కని వాక్యము కలదు:—

"యస్యనాహంకృతో భావో బుద్ధిర్యస్య నలిప్యతే,
హత్వాపి స ఇమాన్ లోకాన్ నహన్తి న నిబధ్యతే."—

అహంకారవిరహితుడై (తనకొఱకు తాను ఎంతమాత్రము వర్తింపనివాడై) యొకడీ లోకమునంతను హతమార్చినను (లేక హతుడైనను) తాను హంత (కాని హతుడు గాని) కాడు; కర్మఫలముచే బద్ధుడునుగాడు.* కావున కర్మయోగ మిట్లు బోధించును: "లోకమును విడనాడకుము. లోకమున వర్తించుచు అందలి సుఖదుఃఖానుభవములను గుణపాఠములను శక్తికొలదియు గ్రహింపుము. కాని నీ భోగముకొఱకైనచో, నీ సుఖముకొఱకైనచో — కర్మము చేయనే చేయకుము." భోగానుభవము మన పరమావధి కాదు. మొట్టమొదట అహంకారమును జంపుకొని సమస్తలోకమును నీవలెనే భావింపుము. ప్రాచీన క్రైస్తవులు చెప్పునట్లు "ముసలివాడు చనిపోవలయును." సమస్తప్రపంచమును మన సుఖముకొఱకే

* భగవద్గీత, 18-17. మూలానుగుణముగా నయ్యున స్వామి యించుక స్వతంత్రముగా ఈ శ్లోకముయొక్క భావమును దెలుపు చున్నాడు.

యను స్వార్థబుద్ధియే ఈ ముసలివాడు. అవివేకులగు తల్లి దండ్రులు తమ బిడ్డల కిట్లు ప్రార్థింప బోధింతురు: "ప్రభూ! నాకొఱకు నీవీ సూర్యుని సృజించితివి. ఈ చంద్రుని సృజించితివి..." ఈ పసిపాపలకొఱ కన్నిటిని సృజించుటకంటె భగవంతునకు మఱియొక పని లేదు కాబోలును! ఇట్టి యర్థరహిత ప్రలాపముల నెన్నడును మీ బిడ్డలకు బోధింపకుడు. ఇక మఱియొకవిధమైన మూర్ఖులును కలరు. చంపి తినుటకై యీ జంతువులన్నియు మనకొఱకు సృజింపబడినవనియు, ఈ ప్రపంచమంతయు మన భోగముకొఱకే సృజింపబడినదనియు వారు మనకు బోధింతురు. ఇదియంతయు కేవల మూర్ఖత్వము. తనకొఱకే మానవుడు సృజింపబడినాడని పెద్దపులియు నిట్లు ప్రార్థింపవచ్చును: "ప్రభూ! నాచే తినబడుటకై వచ్చి తమ్ము తాము సమర్పించుకొనని యీ మానవు లెంత దుర్మార్గులో చూడుము, వీరు నీ శాసనమును ధిక్కరించుచున్నారు." లోకము మనకొఱకు సృజింపబడినచో మనమును లోకముకొఱకు సృజింపబడియున్నాము. మన భోగములకై యీ లోకము సృజింపబడిన దనుకొనుట మనలను సంసారబద్ధుల నొనర్చు పరమ దుష్టాభిప్రాయము. లోకము మనకొఱకు నిర్మింపబడినది కాదు; ప్రతిసంవత్సరమును కోట్లకొలది జనులు ఇందుండి గతించుచున్నారు; దానివలన లోకమున కిసుమంతయు లోపము కలుగుట లేదు; వారితావున కోట్లకొలది జను లితరులు సమకూరుచున్నారు. లోకము మనకొఱ కేర్పడియున్నచో మనమును లోకముకొఱ కేర్పడియున్నాము.

కావున సక్రమముగా కర్మమొనర్చుటకై నీవు మొట్ట మొదట అనాసక్తత నలవఱచుకొనవలయును. తదుపరి సంసార సాగర నిమగ్నుడవుగాకుండ సాక్షీభూతుడవై కర్మ మును సాగింపుము. నా గురుదేవు డిట్లు వచించువాడు: "మీ పిల్లలయెడ దాది వహించు భావమును వహింపుడు." దాది నీ బిడ్డను గైకొని ముద్దాడి దానితో నాటలాడుచు అది తన బిడ్డయే యనురీతిని నీ బిడ్డయెడ విశేష ప్రేమానురాగము లను జూపును; కాని నీ యిల్లు విడిచిపోవలయునని నీ వామెకు తెలిపినంతనే తన మూటయు ముల్లెయు గట్టుకొని వెంటనే బయలుదేఱుటకు ఆయత్తపడును. సమస్త రాగమును అపుడు విస్మరింపబడుచున్నది; నీ బిడ్డలను విడిచి యితరుల బిడ్డలను గైకొనుటకు సాధారణమైన దాదికెట్టివ్యాకులతయు గలుగదు. "నాది" యని నీవు భావించునట్టి సర్వవిషయములందును నీ విట్టులే ప్రవర్తింపవలయును. నీవు దాదివి, భగవంతుని నీవు నమ్మినచో "నాది" అని నీవు భావించునట్టి సర్వము నిజ ముగా ఆ భగవంతునిదని నమ్ముము. మహాదౌర్బల్యము తఱచు మహాబలము, సౌజన్యము నను కృత్రిమవేషమున దాగియుండును. నాపై నొకడాధారపడి యున్నాడనియు నే నొకనికి సాయము చేయగలననియు తలచుట వట్టి మనో దౌర్బల్యము కాని మఱియొకటి కాదు. మన సమస్త రాగ మునకును ఇదియే పుట్టినిల్లు, రాగమువలననే బాధలన్నియు గలుగుచున్నవి. లోకమున నెవ్వడును మనపై నాధారపడి యుండలేదని, ఏ బిచ్చగాడును మన దానధర్మములపై నాధారపడియున్నవాడు కాడని, ఏ జీవియు మన దయా

దాక్షిణ్యములకై, ఏ ప్రాణియు మన సాహాయ్యమునకై దేవులాడుచుండుట లేదని మన మానసమునకు మనము దెలుప వలయును. ప్రకృతియే సమస్త జీవులకును దోడ్పడుచున్నది. మనలో కోట్లకొలది జను లిచట లేకున్నను ప్రకృతియే వానికి దోడ్పడును. నీవంటి నావంటి వ్యక్తులకొఱకై ప్రకృతివిధానము మాఱదు. ప్రకృతిప్రవాహము ఆగిపోదు; పరహితాచరణ మార్గమున ఆత్మహిత మొనగూర్చుకొనుటకై అవకాశమును బడయుట వరప్రసాదముగా భావింపవలయునని యీవఱకే చెప్పియున్నాను. జీవితమున మనము నేర్వవలసిన మహాగుణపాఠ మిది; దీనిని పూర్తిగా నేర్చినంతనే మనకిక నెన్నడును అసౌఖ్యము కలుగదు; ఎట్టి భయమును లేక యథేచ్ఛగా సంఘముతో మన మపుడు కలిసిమెలసి మెలగవచ్చును. భార్యాపుత్త్రులతో, సేవక బృందములతో మీరపుడు రాజ్యము నేలినను ఏలవచ్చును; ప్రపంచము మీకై నిర్మింపబడినది కాదని, ప్రపంచమునకు మీ యావశ్యకత లేదని గుర్తించి మీరు వర్తించినచో దానివలన లేశమును మీకు భయముకలుగదు. ఈ సంవత్సరముననే మీ స్నేహితులలో కొందఱు చనిపోయి యుండవచ్చును. ప్రపంచము వారు లేకపోవుటచే ఆగిపోయినదా? వారు మఱల రావలయునని నిరీక్షించుకొని యున్నదా? లేదు, ప్రపంచము సాగుచునే యున్నది. కావున ప్రపంచమునకు నీ వేదియో ఉపకారము చేయవలయునను భావమును, ప్రపంచము నుద్ధరింపవలయునను దురభిప్రాయమును విడిచిపెట్టుము. ప్రపంచమునకు నీ యుపకారము అనావశ్యకము, ఎవ్వడుగాని ప్రపంచ

మునకు తాను ఉపకారము చేయుటకై జన్మించితిననుకొనుట అవివేకము, అహంభావము; అయ్యది సుగుణరూపమున నటించు స్వార్థపరత్వము. నీ మీదగాని మఱియెవ్వరి మీద గాని ప్రపంచ మాధారపడినది కాదని గ్రహించునట్లు నీ మనస్సునకు- నీ పంచకోశములకు* -నీవు బోధించితి వేని కర్మము నిన్ను బంధింపదు, కర్మాచరణమువలన నీకు బాధ కలుగదు. నీ వొకని కేదైన నొసగి ప్రతిఫల మపేక్షింపనియెడల— ఆతడు నీయెడ కృతజ్ఞుడై యుండవలయుననికూడ భావింపనియెడల—ఆతని కృతఘ్నతవలన నీకు బాధకలుగదు. ఏలన, నీవు దేనిని ఆశింపలేదు, ఎట్టి ప్రతిఫలమును ఆశింపలేదు; ఆతడు దేనికర్హుడో దాని నాతనికి నీ వొసగినావు; ఆతని కర్మమే దానిని సంపాదించినది; నీ కర్మము అందులకు నిన్ను నియమించినది. ఏదియో దాన మొనర్చితినని నీవు అహంకారము చెందు టెందులకు? ద్రవ్యదానముననో, మఱియే యితరదానముననో నిర్వహించుటకు నీవు సేవకుడవైతివి; తా నొనర్చిన కర్మముచే లోకము దానిని బడయుటకు అర్హత నొందినది. నీ యహంకారమున కిందు హేతు వేమున్నది? లోకమునకు నీ వొసగుదానిలో విశేషమేమియు లేదు. నిష్కామబుద్ధిని నీ వలవఱచుకొనినచో పుణ్యపాపములు నిన్నంటవు; కీడుమేళ్లు నిన్ను బంధింపవు. స్వార్థపరత్వముచేతనే వీనిని విభజించుచు భేదముల నేర్పఱచుచున్నావు. దీనిని గ్రహించుట కష్టసాధ్యమే కాని, నీవు

* అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయ కోశము లనునవి పంచకోశములు.

8

అంగీకరించు పర్యంతము దేనికిని నిన్ను బంధించుట కధికారములేదని సకాలమున నీవు గ్రహింతువు. వివేకవర్జితమై స్వాతంత్ర్యమును గోల్పోకుండునంతవఱకు మానవాంతఃకరణమును వశ మొనర్చుకొనుటకు ప్రపంచమున దేనికిని శక్యము లేదు. కావున నీపై పెత్తనము నెఱపుటకు దేనికిని అధికారము లేదని నిశ్చయముగా నమ్ముము; నిష్కామబుద్ధిచే సమస్త శక్తులను నిర్జింపుము. నీ వంగీకరింపనిదే నీపై తన ప్రభావమును జూప దేనికిని శక్యము లేదనుట సులభమే కాని నిజముగా నిట్లు వర్తింపగల మానవుని—బాహ్యప్రపంచము తనకు కీడుమేళ్లు గల్గించునపుడు దుఃఖముగాని సుఖముగాని పొందనివాని—లక్షణమేమి? కీడుకాని, మేలుకాని, అదృష్టముగాని, దురదృష్టముగాని గల్గునపు డెట్టి మనోవికారము నొందకుండుటయే అట్టివాని లక్షణము; సమస్త పరిస్థితులందును అత డొకేవిధముగా నుండును.

వేదాంత సూత్రకర్తయగు వ్యాసమహర్షి యొక్క తండ్రి పరాశరుడు పరిపూర్ణుడగుటకు బ్రయత్నించియు కృతార్థుడు కాలేదు. వ్యాసుని తాతయగు శక్తియు నిటులే ప్రయత్నించియు విజయము నందలేదు. వ్యాసుని ముత్తాతయగు వసిష్ఠుడును విజయోపేతుడు కాలేదు. వ్యాసుడును పూర్తిగా కృతార్థత నందకున్నను అతని పుత్రుడగు శుకుడు ఆజన్మసిద్ధుడై వఱలెను. వ్యాసుడు శుకునకు తత్త్వోపదేశ మొనర్చి పిమ్మట జనకమహారాజు సభ కంపెను. జనకమహారాజు అఖండజ్ఞానియై విదేహుడన బరగిన మహనీయుడు. చక్రవర్తియయ్యు జనకుడు పరిపూర్ణముగా దేహాభిమానరహి

తుడై, దేహస్మృతిరహితుడై, ఆత్మారాముడై విలసిల్లెను. ఇట్టి జనకునివలన బోధోపదేశములను బడయుటకై తన బాలశుకుని వ్యాసు డాతనియొద్ద కనిపెను. శుకుడు తన యొద్దకు తత్త్వోపదేశార్థము వచ్చుచుండె నను సంగతి జనకునకు దెలియును. అందుచే నాతడు ముందుగనే అందులకు వలయు సన్నాహము నొనర్చెను. శుకుడు అంతఃపురద్వారము సమీపింప ద్వారపాలకు లాతని నిసుమంతయు లక్షింపరైరి. శుకుడు లోకపూజ్యుడగు వ్యాసమహర్షి యొక్క తనయుడు, స్వయముగా మహాపూజనీయుడు, ఐనను అల్పులగు ద్వారపాలకు లాతని లక్షింపరైరి. అనంతరము అకస్మాత్తుగా జనకమహారాజు మంత్రులును, ఉన్నతోద్యోగు లెల్లరును వెడలి శుకునకు అఖండగౌరవసముచితమగు స్వాగతము నొసగి యంతఃపురములోనికి దోడ్కొనిపోయి, పన్నీట జలకమాడించి, దివ్యాంబరములగట్టి, ఎనిమిదిదినము లట్లు సమస్తోపచారముల నొనర్చుచు నట నిల్పిరి. ఇట్టి మహారాజసముచిత గౌరవాదరములు శ్రీశుకుని ప్రశాంతముఖవికాసమును అణుమాత్రమైనను మార్పజాలవయ్యెను. అంతఃపురద్వారమునొద్ద వేచియుండునపు డెట్లుండెనో ఇప్పుడును శుకుడట్లే నిర్వికారుడై యుండెను. అపుడు వా రాతని జనకమహారాజునొద్దకు దోడ్కొనిపోయిరి. మహారాజు సింహాసనాసీనుడై యుండ నృత్యగీతవాద్యాదు లతి మనోహరముగా జరుగుచుండెను. జనకమహారాజు శుకునకు పాలతో నిండిన యొకపాత్రనిచ్చి యొక చుక్కయైనను తొణకకుండ సభాభవనముచుట్టు నేడు సారులు తిరిగి రమ్మని చెప్పెను. బాలశుకు

డా పాత్రను గైకొని యచటి దివ్యగానములచేగాని సుందర వదనములచేగాని లేశము నాకృష్ణుడుగాక రాజు చెప్పినరీతిని పాత్రను గైకొని సభాభవనముచుట్టు నేడుసారులు తిరిగి వచ్చెను. పాలొక చుక్కయైనను తొణకలేదు. శుకు డిచ్చగింపనిదే ప్రపంచమున నేదియు నాతని మానసము నాకర్షింపలేకపోయెను. పాత్ర నాతడు జనకచక్రవర్తియొద్దకు దీసికొని వచ్చినంతనే జనకు డిట్లు వచించెను: "నీ తండ్రి నీకుపదేశించిన, స్వయముగా నీవు గ్రహించిన తత్త్వమునకు మించి నే నేమియు జెప్పజాలను. నీవు తత్త్వజ్ఞానము నొందితివి. ఇంటికి వెడలుము."

మనోనిగ్రహమును సాధించిన మానవు డిట్లు ప్రపంచమున దేనికిని వశ్యుడుగాడు. అతడు బంధవిముక్తుడు, సర్వ సంపూర్ణస్వతంత్రుడు. అట్టివాడే సంసారమున జక్కగా మెలగుటకు సమర్థుడు. లోకమునుగూర్చి సాధారణముగా నిరుతెఱగులగు నభిప్రాయములు గల జనులు గాన్పించుచుందురు. కొందఱు నిరాశావాదులై "ప్రపంచ మెంత ఘోరమో, ఎంత దుష్టమో!" అనుచుందురు. మఱికొందఱు ఆశావాదులై "ప్రపంచ మెంత చక్కనిదో! ఆశ్చర్యకరమైనదో!" యనుచుందురు. మనోనిగ్రహము సాధింపనివారలకు ప్రపంచము చెడ్డదిగా గాని, మంచిచెడుగులసమ్మిశ్రితముగా గాని తోచుచుండును. మనోనిగ్రహసంపన్నులమైనచో మనకు ఈ ప్రపంచమే ఆశాజనకమై, సదాశయనిలయమై కన్పట్టును. ప్రపంచమున మన కపు డేదియు మంచిదిగాగాని చెడ్డదిగాగాని తోపదు; సర్వము ఉచిత

స్థానమున నున్నదని పొడకట్టుచు సామరస్యనిలయమై దీపించును. మనోనిగ్రహాయత్నమునకు పూర్వము కొందఱు ప్రపంచము నరకప్రాయమని చెప్ప మొదలిడినను మనోనిగ్రహమును సాధింపగల్గినంతనే ప్రపంచము స్వర్గతుల్యమని తెలిచుగా జెప్పుచుందురు. మనము నిజముగా కర్మయోగులమై ఆత్మనిగ్రహసాధనచేయుదుమేని ప్రారంభమున నెట్టి స్థితిలో నున్నను పర్యవసానమున పరిపూర్ణ స్వార్థరహితులమై చెల్వొందుదు మనుట నిశ్చయము; అహంభావమంతరించినంతనే, మొట్టమొదట కష్టభూయిష్ఠముగా గాన్పించిన ప్రపంచము పరమానందప్రదమై వెల్గొందును. అపుడు ప్రపంచవాతావరణమే ధన్యమై భాసింప ప్రతివదనము సౌజన్యనిలయమై దీపించును. కర్మయోగాశయము, కర్మయోగప్రయోజన మింతటి మహత్తరము. కర్మయోగాచరణ మింతటి మహిమాన్వితము.

కర్మజ్ఞానాది వివిధయోగములకు ఒండొంటితో నెట్టి విరోధమును లేదు. ప్రతియోగమును మనల నొకే పరమావధి నొందింపజేసి పరిపూర్ణులను చేయును. వానిని మనము పూనికతో సాధింపవలయుననుటయే ఇందలి ముఖ్యవిషయము. కీలకమంతయు సాధనలో నున్నది. మున్ముందు తత్త్వమును వినవలయును. తదుపరి దానినిగూర్చి మననము చేయవలయును.* ప్రతియోగవిషయమునను ఈ సూత్రమే వర్తించును. ఏ యోగమునుగూర్చి కాని మొదట

* "...శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః."

—బృహదారణ్యకోపనిషత్తు.

విని, అది యెట్టిదో గ్రహింపవలయును; దురవగాహముగా నుండు విషయము లనేకములు సంతతశ్రవణమననములచే చక్కగా బోధపడును. ఒకేసారిగా సర్వము గ్రహించుట దుస్తరము. ఏదియైనను తుదకు నీ మూలముననే నీవు గ్రహింపగలుగుచున్నావు. నిజముగా నెవ్వనికిని మఱియొకడు బోధింపజాలడు. బోధించియుండ లేదు—మన యంతట మనమే బోధపఱుచుకొనవలయును. బాహ్యమున నున్న బోధకుడు కేవలము మనకు మార్గదర్శియై విషయమిట్టిదని సూచించుచున్నాడు,—దానిని గ్రహించుటకై యాతడు చేయు సూచన మన యాంతరంగికబోధకుని మేల్కొల్పు చున్నది. అపుడు మనయందలి భావనాశక్తిచే, గ్రహణ శక్తిచే విషయము మనకు విస్పష్టమగుచున్నది. దానిని మన మపు డనుభూతికి దెచ్చుకొనగలము; ఇట్టి యనుభూతియే అఖండసంకల్పశక్తిగా పరిణమించుచున్నది. మొట్టమొదట భావము గలుగును, అపుడది సంకల్పముగా పరిణమించును, అంత నందుండి యద్భుతమగు క్రియాశక్తి యుదయించును, అంతట మన యావచ్ఛరీరమును కర్మయోగసాధనముగా మాఱుపర్యంతము, పరిపూర్ణ స్వార్థరాహిత్య స్వార్థత్యాగ ములు ప్రాప్తించుపర్యంతము, ఆ క్రియాశక్తి మన ప్రత్యవ యవమునందు—ప్రతికండరమునందు—ప్రతినాడియందును వ్యాపించును. ఇట్టి స్వార్థత్యాగము ఏ వాదముమీదను, ఏ సిద్ధాంతముమీదను, ఏ విశ్వాసముమీదను ఆధారపడి యుండునది కాదు. ఒకడు క్రైస్తవుడా, యూదుడా, హిందు వుడా యనున దెంతమాత్రము మనకు విచారణీయము కాదు.

నీవు స్వార్థరహితుడవా, కాదా? ఇదియే లక్షింపవలసిన విషయము. స్వార్థరహితుడవైనచో ఒక్క పారమార్థిక గ్రంథమునైనను జదువకయే, ఒక్క ప్రార్థనాలయమునకైనను వెడలకయే, ఒక్క దేవాలయమైనను దర్శింపకయే ముక్తుడవయ్యెదవు. సమస్తయోగములకును గమ్యస్థాన మొక్కటియే యైయుండుటచే ఇతరయోగాపేక్ష లేకయే ప్రతియోగమును స్వయముగా మానవుని ముక్తుని గావింపజాలియున్నది. కర్మ జ్ఞాన భక్తి యోగమార్గములలో నేదియైనను సరిగా స్వయముగా మోక్షమార్గము కాదగియున్నది. "సాఙ్ఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి న పణ్డితాః*—జ్ఞానయోగ కర్మయోగములు భిన్నములని చెప్పువా రవివేకులగు బాలురు, పండితు లట్లు వచింపరు." పైకి వేర్వేఱుగా నున్నట్లు గాన్పించినను ఈ రెండును మానవు నొకే పరమావధిని ప్రాపింపజేయునని పండితు లెఱుంగుదురు.

---

* శ్లో. "సాఙ్ఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి న పణ్డితాః,
ఏకమప్యాస్థితస్సమ్యగుభయోర్విన్దతే ఫలమ్.
యత్సాఙ్ఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపిగమ్యతే,
ఏకం సాఙ్ఖ్యఞ్చ యోగఞ్చ యఃపశ్యతి సపశ్యతి."
—భగవద్గీత, 3-4,5.

# ఏడవ యధ్యాయము

## మోక్షము

కర్మమనుమాట క్రియ లేక వ్యాపారమను నర్థమే కాక శాస్త్రీయముగా కర్మఫలమనియు నర్థముకలదని యిది వఱకే చెప్పియున్నాము. కర్మతత్త్వమున కార్యకారణము లకు పరస్పరసంబంధము గలదనుభావము ఇమిడియున్నది. ఏదేనొకఫలమును గల్గించు నే వ్యాపారమైనను, ఏ క్రియ యైనను ఏ భావమైనను కర్మమనబడుచున్నది. ఇట్లు కర్మ నియమమన, అనివార్యమగు కార్యకారణసంబంధనియమ మని భావము. కార్యమున్నచో కారణముండితీరవలయును; మన తత్త్వశాస్త్రమునననుసరించి యీ నియమము సమస్త ప్రపంచమునకును వర్తించునని గ్రహింపనగును. మనము చూచున దెల్ల, చేయున దెల్ల, అనుభవించున దెల్ల ప్రపం చమున నెచ్చటగాని జరుగు నే కార్యమైనను ఒక వైపున పూర్వకర్మ ఫలమైయుండ మఱియొక వైపున స్వయముగా ఫలమునొసగుచు మఱియొక కార్యమునకు కారణమగు చుండును. ఈ కార్యకారణభావముతో బాటు "నియమము" అనగానేమో మనము గ్రహింపవలసియున్నది. వరుసగా గొన్ని ఫలితములు లేక కార్యములు మఱల మఱల సంభ వించు నవకాశమునకే నియమమని పేరు. ఒక కార్యము వెంబడిని మఱియొక కార్యము జరుగుటకాని, అవియే ఒక్కొక్కప్పు డేకకాలమున జరుగుటకాని మనము చూచు నప్పుడు ఈ క్రమముగాని ఏకకాలసంభవత్వముగాని మఱి

రొకప్పుడుగూడ జరుగునని యూహింతుము. మన తార్కికులును నైయాయికులును ఈ నియమమును 'వ్యాప్తి' యందురు. నియమమును గూర్చినట్టి మన భావములన్నియు వీరి ననుసరించి 'సంసర్గము' లేక చేరికవలన గలుగుచున్నవి. బాహ్యాంతర ప్రపంచములందు జరుగు సంఘటన పరంపర ఒకవిధమైన నిత్యక్రమమున మన మానసమందలి విషయములతో సంయుక్తమగుచున్నది; దానిచే ఎపుడు మనము దేని నవలోకించినను వెంటనే అయ్యది మానసమందలి యితర విషయములతో లేక భావములతో నన్వయింపబడుచున్నది. భారతీయుల మనశ్శాస్త్రము ననుసరించి ప్రతి భావమును లేక చిత్తమున నుదయించు ప్రతివృత్తియు అట్టి యనేక చిత్తవృత్తులను గల్గించునని చెప్పనగును. మానసిక శాస్త్రము ననుసరించి ఇదియే 'సంసర్గము' (Association) అని నియమము; మహత్తరమగు ఈ వ్యాపన నియమమున లేక తత్త్వమున కార్యకారణములు పరస్పర సంబద్ధములనునట్టి కార్యకారణ భావము ఒకయంశము. ఈ నియమమే 'వ్యాప్తి' యనబడుచున్నది. నియమమనునది ఆంతర ప్రపంచమున నెట్టిదో బాహ్యప్రపంచమునను అట్టిదియేయనియు, ఒక సంఘటన మఱియొక సంఘటనచే అనుసరింపబడుననియు, అట్టి సంఘటన క్రమము మఱల మఱల సంభవింపవచ్చునని యు భావింపనగును. కావున నియమమనునది నిజముగా బాహ్య ప్రకృతియందు లేదని చెప్పవలసియున్నది. అనుభవమునుబట్టి చూచినచో గురుత్వాకర్షణ శక్తి భూమియందున్నదని కాని వస్తుతః ప్రకృతిలో నేదియో యొక నియ

మము కలదనికాని చెప్పుట పొరపాటు. వరుసగా జరుగు కొన్ని సంఘటనలయొక్క క్రమమును మనస్సు గ్రహించునట్టి రీతియే నియమము; అది కేవలము మనస్సులో నున్నది—మన స్తత్త్వముతో సంబంధించియున్నది. కొన్ని సంఘటనలు వరుసగాగాని ఏకకాలమునగాని జరుగుటను, అవి యెప్పుడు నట్లే జరుగుననుభావ ముదయింపజేయుచు సంఘటన క్రమమును మన మానసములచే గ్రహింపజేయుటను—దీనినే మనము నియమ మనుచున్నాము.

నియమము సర్వసామాన్య మనునపుడు మన భావమేమో ఇక వివేచింపవలసియున్నది. 'సత్త' యందొక యంశమునకు దేశకాల నిమిత్తములనునవి లక్షణములై యున్నవి. సత్తయందలి యీ యంశమే మన ప్రపంచము. అనంత సత్తయందు కేవల మొక యంశము దేశకాల నిమిత్తము లనునట్టి విచిత్రరూపము నొందియున్నది — ఇదియే మన ప్రపంచము. కావున దేశకాల నిమిత్తబద్ధమగు నీ ప్రపంచముననే నియమమనునది వర్తించును, ఇచటనే నియమముండుట కవకాశము కలదు; ప్రపంచాతీతస్థితియం దెట్టి నియమము నుండనేరదు. ప్రపంచమునుగూర్చి మనము మాటలాడునపుడు సత్తయందలి మనోగోచరమగు నంశమనియే—మనము చూడగలిగిన, అనుభవింపగలిగిన, తాకగలిగిన, వినగల్గిన, భావింపగల్గిన, ఊహింపగల్గిన ఇంద్రియపరికల్పిత ప్రపంచమనియే — మన యభిప్రాయము; ఈ ప్రపంచమే నియమబద్ధమైయున్నది. దీని కతీతమగు సత్తా నియమబద్ధము కానేరదు; ఏలన మనోగోచర ప్రపంచమున

కవ్వల కార్యకారణ నియమము వర్తింపనేరదు. మానసా తీతము, ఇంద్రియాతీతము నగునదేదియు కార్యకారణ నియమబద్ధము కాదు. ఏమన, ఇంద్రియాతీతమగు తావున విషయముల నన్వయించు మనోవ్యాపారము ఉండనేరదు. అయ్యెడ కార్యకారణ భావమనునది యసంగతము కదా. సత్త నామరూప నియమితమైనపుడే కార్యకారణనియతి కధీనమై నియమబద్ధమని చెప్పబడును. ఏలన సమస్త నియమములకును కార్యకారణ నియతియే కదా నిలయము. కావున "స్వతంత్రమగు నిచ్ఛ" యనునది కల్లయని విశేష మాలోచింపకయే గ్రహింపవచ్చును. స్వతంత్రేచ్ఛ యనుట స్వవచనవ్యాఘాతము; ఏలన ఇచ్ఛయనునది మన మెఱుంగునదికదా; ఇక మన మెఱుంగునది సర్వము మన ప్రపంచమునందే యుండవలయును. ప్రపంచమునందలి సర్వము దేశకాల నిమిత్తబద్ధమైయున్నది. మనము గ్రహించునది, గ్రహింపగల్గునది, సమస్తము కార్యకారణ నియమబద్ధమై యుండవలయును. నియమబద్ధమగునది స్వతంత్రమైయుండు టెట్లు పొసగును? అన్యవిషయ ప్రభావమున కధీనమై మఱలనది మఱియొక కార్యమునకు కారణమగుచున్నది. కాని యెయ్యది ఇచ్ఛారూపమగు మార్పునొందినదో, ఎయ్యది యింతకుమునుపు ఇచ్ఛ కాదో, కాకుండియు దేశకాల నిమిత్తములందు దగుల్కొని మానవేచ్ఛారూపము నొందినదో, అయ్యది స్వతంత్రము; ఈ యిచ్ఛ దేశకాల నిమిత్తములను పంజరమునుండి వెలువడినంతనే మఱల స్వతంత్రమై యొప్పుచున్నది. ఇయ్యది స్వాతంత్ర్యమునుండి జనించుచు సంసార

బద్ధమై మఱల నందుండి వెలువడి ఆత్మస్వాతంత్ర్యమును — మోక్షమును — బొందుచున్నది.

ఈ విశ్వ మెందుండి యుద్భవించుచున్నది? ఎందు నిలిచియున్నది? మఱల నెందు లీనమగుచున్నదను జిజ్ఞాసకు ఇయ్యది స్వాతంత్ర్యమునుండి యుద్భవించి సంసారమున నిలిచి మఱల స్వాతంత్ర్యమున లీనమగుచున్నదని మా సమాధానము. అనేక నామరూపములలో వ్యక్తమగుచున్న యా పరమాత్మయే మానవుడని మనము చెప్పునపుడు అందు కేవల మొక సూక్ష్మాంశమే మానవుడని మన తాత్పర్యము; మనకు గోచరించు నీ మన శరీరములు మూలతత్త్వమునం దొకయంశము, పరమాత్మయం దణుప్రాయము. ఈ సమస్త ప్రపంచము ఆ పరమాత్మయం దొకలవలేశము.* ఇక మన నియమములును నిబంధనలును, సుఖములును దుఃఖములును, ఆశలును సర్వము ఈ యల్పప్రపంచములోనివే; మన యభివృద్ధియు క్షీణతయుగూడ ఈ చిన్నయవధిలోనివే. కేవల మనఃకల్పితమైన ఈ ప్రపంచము శాశ్వతముగా నిలిచి యుండవలయునని యాశించుచు స్వర్గప్రాప్తిని గోరుకొను నట్టి బాల్యాలోచనయో నిమిష మాలోచించిన మీకు వెల్లడి కాగలదు. స్వర్గమనగా నేమి? మనకు దెలిసిన యీ ప్రపంచము, మఱియొక రూపమున గానిందు, మఱల సంభ

---

* "పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి."

— పురుషసూక్తము.

"విష్టభ్యాహమిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్."

— భగవద్గీత, 10-42.

వించుటయే కదా! మన మెఱుంగునట్టి యీ నియమిత స్థితికి—ఈ పరిమితస్థితికి—అనంతమగు సమస్త సత్తయును లోబడుట యసంభవమని — లోబడవలయు ననుకొనుట బాల్యాలోచనయని—వెంటనే మనకు విస్పష్టము కాఁగలదు. ప్రస్తుత మనుభవించుచున్నదియే మఱల మఱల తా ననుభవింపవలయునని యొక డనుచో, లేదా, నే నొక్కొక్కప్పు డనునట్లు, తనకు సుఖదాయకమగు మత ధర్మములు కావలయుననుచో, ఆతడు అత్యల్పుడైన తన ప్రస్తుత స్థితి కంటె అధికమేమియు భావింపజాలకున్నాడని మీరు గ్రహింపవచ్చును; క్షుద్రమగు తన ప్రస్తుత పరిస్థితులతో అతడు తాదాత్మ్యము నొందియున్నాడు—ఈ యల్పపరిస్థితులే తా ననుకొనుచున్నాడు. తా ననంతుడను, అప్రమేయుడ నను సంగతి నాతడు మఱచి ఈ యల్ప సుఖదుఃఖములే—తాత్కాలికమగు నీ కామక్రోధాదులే — తన స్వభావమనుకొనుచున్నాడు. ఈ క్షుద్రప్రపంచమే పరతత్త్వమని యాతని భావము; అంతియేగాక ఈ మూర్ఖత్వమున కాతడు దాసుడు. బౌద్ధులు 'తన్హా' 'త్రిస్న' యని చెప్పునట్టి తృష్ణ నాతడు గట్టిగా అంటిపట్టుకొనియున్నాడు. మనకు గోచరించు నీ యల్ప ప్రపంచమున కతీతమగు కోట్లకొలది సుఖము లుండవచ్చును. అనంతవిధములగు జీవులు, నియమములు, వృద్ధిక్షయములు, కార్యకారణభావము లుండవచ్చును. తుద కివి యన్నియు గలిసి మన యనంతాత్మతత్త్వమున కేవల మొకయంశమని గ్రహింపనగును.

స్వాతంత్ర్యమును బడయుటకై ప్రపంచాతీతులము గావలయును, స్వాతంత్ర్యము నిచట గనజాలము. పరిపూర్ణ సమత, లేక క్రైస్తవులు దెల్పునట్టి భావనాతీత ప్రశాంతి* యీ విశ్వమునగాని, స్వర్గమునగాని, మానసగోచరమగు మఱి యెచ్చటగాని, ఇంద్రియానుభూతమగు నేతావునగాని, తుదకు భావింపదగిన యే ప్రదేశమునగాని లభ్యము కానేరదు. అట్టి యే తావును మనకు స్వాతంత్ర్యము నొసగజాలదు. ఏలన సమస్త ప్రదేశములును ఈ విశ్వములోనివే కదా. ఇక నీ విశ్వమో, దేశకాలాదిబద్ధమైయున్నది. మన యీ భూమ్యంతరిక్షములకంటెను దివ్యమైన ప్రదేశములుండవచ్చును. అందలి సుఖము లింతకంటె విశేషములై యుండవచ్చును. కాని యవియు విశ్వములోనివే కావున నియమబద్ధమై, ప్రకృతిశాసన వశీభూతమైయున్నవి. కావున మనము ప్రపంచాతీతులము కావలయును. ఐహిక దృష్టి తొలగునపుడే నిజమైన ఆముష్మికచింత గలుగుచున్నది. ఈ యల్ప సుఖములును, దుఃఖములును, ఈ క్షుద్ర లౌకిక జ్ఞానమును అణగునపుడే తాత్త్వికదృష్టి ప్రారంభమగును. క్షణికము, పరిమితము, తుచ్ఛమునగు సంసారమునెడ—సంసార సుఖములయెడ—మన వ్యామోహము నశించిననే కాని ఆత్మస్వాతంత్ర్యతేజము నణుమాత్రమైనను గనజాలము. సమస్త మానవాళియు పరమావధియగు ఆత్మలాభమును బడయుటకొకేమార్గము కలదనుట సమంజ

* "And the peace of God which passeth all understanding."

—Bible, Philippians, 4-7

కము. లౌకిక జీవితమును, ఈ క్షుద్ర ప్రపంచమును, ఇహ లోకమును, స్వర్గమును, అహంకారమును మమకారమును — పరిమితమగు సమస్తము — త్యజించిననే కాని ఆత్మానుభవమార్గ మలవడజాలదు. ఇంద్రియపరికల్పితమగు నీ యల్పప్రపంచమునందలి మన మోహమును త్యజించినచో వెంటనే విముక్తుల మగుదుము. సంసారబంధమునుండి వెలువడుటకు కార్యకారణాదినియమాతిరిక్తులమగు టొక్కటే మార్గము.

కాని సంసారమోహమును త్యజించుట చాల కష్టసాధ్యము; అదృష్టవంతులగు నే యల్పసంఖ్యాకులకో ఇయ్యది సాధ్యమగును. మన శాస్త్రములలో నిందులకు ద్వివిధమార్గములు చూపబడియున్నవి. ఒకటి "నేతి, నేతి—ఇది కాదు, ఇది కాదు" అనునట్టి వ్యతిరేకమార్గము. మఱియొకటి, "ఇతి, ఇతి—ఇది, ఇది" యనునట్టి అన్వయమార్గము. ఇందు వ్యతిరేకమార్గ మత్యంత కష్టసాధ్యము. "వలదు, నాకీ సంసారము వలదు" అని మహాధైర్యశాలులై నిలిచి వక్కాణించు మహాధీవిధులకు, అసాధారణ సంకల్పబలాన్వితులకు మాత్రమే ఈ వ్యతిరేక మార్గము సాధ్యమగును. మనశ్శరీరములు వారి సంకల్పశక్తి కధీనములగుటచే వారే యిందు విజయము నందగలరు. కాని యట్టివా రరుదుగా గాని లేరు. మానవకోటియం దధికసంఖ్యాకులు బంధవిమోచనమునకు కామక్రోధాది బంధములనే వినియోగించుచు ప్రాపంచికమగు నన్వయమార్గమును — సంసారమార్గమును—ఎన్నుకొందురు. ఇదియు నొకవిధమగు త్యాగమే.

కాని యిట్టి విషయగ్రహణముచే, సుఖదుఃఖానుభవముచే సంసారస్వభావమును గుర్తించి తుదకు దానియెడ మనస్సు రాగరహితమై క్రమముగా, నెమ్మదిగా, త్యాగము నలవఱచుకొనును. సంగరాహిత్యము నలవఱుచుకొనుట కిందు జెప్పిన మొదటిమార్గము హేతువాదమును — జిజ్ఞాసను — గైకొనుచున్నది. రెండవమార్గము కర్మమూలమునను అనుభవమూలమునను సంగరాహిత్యమును సాధింపనెంచుచున్నది. మొదటిది కర్మమును జేయ నిరాకరించునట్టి జ్ఞానయోగము, రెండవది కర్మమును విడువక యాచరించునట్టి కర్మయోగము. ప్రపంచమున ప్రతిజీవియు కర్మ మొనర్పవలసియేయున్నది.* ఆత్మచేతనే సంతుష్టులై, ఎవ్వ రాత్మారాములై యుందురో, ఎవ్వరి కోరికలు, ఎవ్వరి మానస మెన్నడును ఆత్మపరాఙ్ముఖముగాకుండునో, ఆత్మయే ఎవరికి సర్వస్వమో, అట్టివారు మాత్రమే కర్మ మొనర్పరు; ఇతరు లందఱును కర్మ మాచరించి తీరవలయును.† సహజముగా నీటివెల్లువ అతివేగముగా ప్రవహించుచు లోతగు ప్రదేశమునబడి సుడిగుండమును నిర్మించును; ఆ సుడిగుండమున గొంచెముసేపు పరిభ్రమించి మఱల స్వేచ్ఛగా, నిరా

* "న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠ త్యకర్మకృత్,
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః."
— భగవద్గీత, 3-5.

† "యస్త్వాత్మరతిరేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః,
ఆత్మ న్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం నవిద్యతే."
— భగవద్గీత, 3-17.

టంకముగా బ్రవహించును. ప్రతి మానవజీవితమును ఈ వెల్లువవంటిది. అయ్యది సంసారావర్తమున బడి దేశకాల నిమిత్తబద్ధమై, "నా తండ్రి, నా తల్లి, నా పేరు, నా ప్రఖ్యాతి" యని పలవించుచు ఈ సుడిగుండమున గొంత కాలము పరిభ్రమించి, యెట్లో వెలువడి తుదకు మోక్షమును బొందుచున్నది. సమస్తలోకము నిట్లే చేయుచున్నది. మనకు గోచరించినను, గోచరింపకున్నను, మన మెఱిగినను, ఎఱుగకున్నను, ఈ సంసార స్వప్నమునుండి వెలువడుటకే మన మందఱము కృషి చేయుచున్నాము. మానవునిలో కాను భవము ఆతని నీ సంసారావర్తమునుండి వెలువడ జేయుటకే నిమిత్తమైయున్నది.

కర్మయోగ మనగా నేమి? కర్మరహస్యమును గూర్చి నట్టిజ్ఞానము. సమస్తప్రపంచమును కర్మ మొనర్చుచునే యున్నది. ఎందులకు? స్వాతంత్ర్యముకొఱకు, మోక్షము కొఱకు; మనస్స్వాతంత్రమునకై, శరీరస్వాతంత్ర్యమునకై అణువు మొదలుకొని బ్రహ్మాండమువఱకును కర్మ మొనర్చుచున్నది. స్వాతంత్ర్యమే అన్నిటికిని పరమావధి, పరమ ప్రయోజనము. సమస్త వస్తువులును స్వాతంత్ర్యముకొఱకే సదా యత్నించుచున్నవి. బంధమును ద్రెంపుకొని పరుగిడ జూచుచున్నవి. సూర్యుడు, చంద్రుడు, భూమి, నక్షత్రములు, గ్రహములు, సమస్తము బంధమును విదళించుకొనుటకే ప్రయత్నించుచు బరుగిడుచున్నవి. ప్రకృతియందలి ఆకర్షణ

అపకర్షణశక్తులు† — రాగద్వేషములు — మన విశ్వముయొక్క స్వభావమును దెలుపుచున్నవి. ప్రపంచమున అడుగడుగునను ప్రహారణములను పశ్చాత్తాపములను బొందుటకు బదులు — ఎన్నియో యిడుమలబడి, ఎంతయో విలంబమైన పిమ్మట ప్రపంచ వాస్తవస్థితిని గ్రహించుటకు బదులు — కర్మయోగావలంబనచే కర్మరహస్యమును, కర్మాచరణవిధానమును, కర్మమందలి యఖండ నిర్మాణశక్తిని గ్రహింతుము. వినియోగించువిధానము తెలియకున్నచో విశేషమగు శక్తిసామర్థ్యములు వ్యర్థము కావచ్చును. కర్మాచరణమునకై కర్మయోగము శాస్త్రము నేర్పుచుచున్నది; ప్రపంచశక్తిసామర్థ్యముల నన్నిటిని చక్కగా నెట్లు వినియోగించుకొననగునో కర్మయోగము నీకు బోధించును. కర్మము అనివార్యము, ఇయ్యది కర్మస్వభావము; కావున మనము మహోత్తమ ప్రయోజనముకొఱకై కర్మ మొనర్పవలయును. ఈ సంసారము మూడునాళ్ల ముచ్చటయని మోక్షమునకియ్యది సాధనము కావున నిందుండి మనము తరింపవలయునని, నిజమగు స్వాతంత్ర్యము సంసారాతీతమై యున్నది కాని సంసారమున లేదని కర్మయోగము మనకు బోధపఱుచును. సంసార తరణోపాయమునకై సంసారానుభవమును — లోకానుభవమును — క్రమముగా, నెమ్మదిగా మనము

---

† ఇచట స్వామి కేంద్రాభిముఖ కేంద్రాపసారశక్తులు (Centripetal and centrifugal forces) అని చెప్పియున్నాడు. ఇయ్యవి క్లిష్టపదములగుటచే స్వామిభావమును దెలుపుటకై పై పదముల నుపయోగించియున్నాము.

పొందవలయును. పాము తన కుబుసమును విడిచి, యెన్నడు తిరిగి అలక్ష్యముగా దాని నవలోకించునట్లు సంసారమును త్యజించి వైచి నిర్లిప్తులై వర్తించు నసాధారణపురుషులు లోకమున గొందఱుందురు; వారిని గూర్చి నే నిదివఱకే చెప్పియున్నాను. లోకమున నిట్టి యలౌకికపురుషులున్నమాట వాస్తవము; కాని మిగిలిన మానవకోటి నెమ్మదిగా కర్మానుభవము పొందవలయును. అత్యంత లాభకరమగునట్లు కర్మరహస్యమును కర్మాచరణవిధానమును కర్మయోగము మనకు దెలుపును.

కర్మయోగ మేమని బోధించును! "తస్మాదసక్తస్సతతం కార్యంకర్మ సమాచర—(అట్లు అజ్ఞానియగువాడు కర్మము చేయవలసినదే కావున) ఫలాపేక్షారహితుడవై విహితమైన కర్మము నెల్లప్పుడు చేయుచుండుము."* దేని తోడను తాదాత్మ్యమును బొందకుము, సంగము నొందకుము, మనస్సును రాగద్వేషరహిత మొనర్పుము. లోకమున నీకు గాన్పించు నీ దుఃఖములన్నియు ఈ బాధలన్నియు ప్రపంచస్థితి కావశ్యకమై యున్నవి; దారిద్ర్యము, సంపదలు, సౌఖ్యము—అన్నియు కేవల క్షణికములు, ఇవి మన యథార్థస్వభావములోనివి కావు. యథార్థస్వభావము సుఖ

* "తస్మాదసక్తస్సతతం కార్యంకర్మ సమాచర,
అసక్తోహ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః."
—భగవద్గీత, 3.19.

[ఫలాపేక్షలేక కర్మము చేయునట్టివాడు సత్త్వశుద్ధినొంది క్రమముగా మోక్షము నొందునని రెండవపాదము నభిప్రాయము.]

దుఃఖాతీతము, ఇంద్రియాతీతము, భావనాతీతము. ఐనను మన మెప్పుడును కర్మ మొనర్చుచుండవలయును. "కర్మముచే గాదు, మోహముచే దుఃఖము గలుగుచున్నది." మనముచేయుకర్మముతో తాదాత్మ్యమును బొందినంతనే దుఃఖ మనుభవింతుము. తాదాత్మ్యమును బొందనిచో దుఃఖ మనుభవింపము. ఎవ్వడైనను తనదిగాక మఱియొకని దగు చిత్రపటము తగులబెట్టబడినచో సాధారణముగా బాధపడడు; కాని తనయొక్క చిత్రపటమే తగులబెట్టబడినచో తా నెంత బాధపడునో! ఎంత పరితపించునో! ఎందుచేత? రెండును చక్కని పటము లేకదా, రెండును బహుశః ఒకేమూలముయొక్క ప్రతులు, కాని యొకదానిపట్ల రెండవదానికంటె విశేషబాధ గలుగుచున్నది. ఏలన, ఒక పటముపట్ల నాతడు తనదని తాదాత్మ్యము నొందుచున్నాడు; రెండవదాని విషయమున బొందుట లేదు. ఈ "నేను, నాది" యను నహంకార మమకారములే దుఃఖకారణములు. "నాది" యను భావము కలిగినంతనే స్వార్థపరత్వ మేర్పడుచున్నది. దానితో దుఃఖము గలుగుచున్నది. స్వార్థపరమగు ప్రతికార్యమును, ప్రతిభావమును దేనియందో ఒకదాని యందు బంధము గల్గించి వెంటనే దానికి మనలను దాసులను జేసివేయును. చిత్తమున నుదయించు "నేను, నాది" యను ప్రవృత్తియు వెంటనే మనకు బంధమును గల్పించుచున్నది,—అహంకార మమకారములను సంకెలలచే మనలను బంధించివేయుచున్నది; ఈ యహంకార మమకారములకు మనము దాసులమైన కొలదియు దుఃఖమునకు

లోనగుచుందుము. కావున "లోకమందలి సమస్త పటముల సౌందర్యమును అనుభవింపుము, కాని వానిలో దేనితోడను తాదాత్మ్యమునుమాత్రము బొందకుము" అని కర్మ యోగము మనకు బోధించును. ఏదియు "నాది" యనుకొనకుము. "నాది" యనుకొనినంతనే దుఃఖము మనల నావరించును. "నాబిడ్డ" యని కలనైనను భావింపకుము. నీకు బిడ్డయుండుగాక, కాని "నాది" యన కుము; అంటివా, దుఃఖమే నీకు ఫలము. "నా యిల్లు" అన కుము, "నా శరీరము" అనకుము. ఉన్న చిక్కంతయు ఇం దున్నది. ఈ శరీరము నీది కాదు, నాది కాదు. మఱి యెవ్వరిదియును గాదు. ప్రకృతి స్వభావముచే, ప్రకృతి నియమములచే ఈ శరీరములు వచ్చుచు బోవుచున్నవి; కాని మనము స్వతంత్రులమై, సాక్షీభూతులమై వీని నవలోకించుచున్నాము. పటమున కెంత స్వాతంత్ర్యము గలదో, గోడ కెంత స్వాతంత్ర్యమున్నదో ఈ శరీరమునకును అంతియే స్వాతంత్ర్యము గలదు. అట్టియెడ ఈ శరీరమున మనకింత మోహ మెందులకు? ఆసక్తి యెందులకు? చిత్ర కారు డొక చిత్తరువు వ్రాసినచో వ్రాసి యాతడు వెడలి పోవుచున్నాడు. "ఇది నా యధీనమున నుండవలయు" నను నహంకారము నొందకుము. పొందితివా, నీకు దుఃఖ మారంభమగును.

కావున కర్మయోగ మిట్లు బోధించుచున్నది: "స్వార్థచింతను మమకారమును తలయెత్త నీయకుము, వీనిని నీవణపగల్గినంతనే మనస్సునఁ తత్సంబంధమగు వృత్తినిగూడ

కలుగనీయకుము. అటుపిమ్మట నీవు సంసారమున బ్రవేశించి యథేచ్ఛముగా కర్మ మొనర్పవచ్చును. అపుడు లోకమున నీ యిచ్ఛవచ్చినవారితో సంచరింపుము, ఇచ్ఛవచ్చిన ప్రదేశమునకు బొమ్ము, దానివలన లేశమును నీకు దోషము గలుగదు. నీటిలో నున్నను తామరాకును నీ రంటుటలేదు, నీవు నిట్లే సంసారమున వర్తింపవచ్చును. ఇదియే వైరాగ్యము.'' వైరాగ్యము లేనిదే ఏ యోగమును సాధింప జాలమని చెప్పియున్నట్లు జ్ఞప్తి. సమస్తయోగములకును వైరాగ్యమే మూలాధారము, మూలమంత్రము. ఇండ్లలో నుండుటను, నీటగుబట్టలు కట్టుటను, మధురాహారములు దినుటను మానివైచి, ఏ యెడారికో, అరణ్యమునకో బోయి నివసించువాడు పరమరక్తుడై యుండవచ్చును. శరీరమే వాని సర్వస్వమై అహంకార మమకారములకు వానిని దాసుని జేయువచ్చును; ఇక నాత డెల్లప్పుడును శరీరమును గూర్చియే — శరీరసౌఖ్యమునుగూర్చియే — ధ్యానించుచుండును. శరీరపోషణకై మన మే కార్యమును జేయరాదని కాదు, వైరాగ్యముయొక్క తాత్పర్యము. వైరాగ్యమనునది ముఖ్యముగా మనస్సంబంధమైనట్టిది. 'నేను, నాది' యనునవి మానసికపాశములు. ఈ పాశములచే శరీరముతోడను ఇంద్రియములతోడను బంధింపబడనియెడల మన మెచ్చట నున్నను, ఏమిచేయుచున్నను విరక్తులమే. ఒకడు రాజ్యాధిపతియై యుండియు పరమవిరక్తుడుగను, మఱియొకడు చింపి గుడ్డలను గట్టుకొనియు పరమరక్తుడుగను, నుండవచ్చును. మొట్టమొదట మనము వైరాగ్యమును సంపాదించి పిమ్మట

కర్మాచరణదక్షులము గావలయును. వైరాగ్యము కష్టసాధ్య మనుట వాస్తవమే. ఐనను కర్మయోగము మనకు తత్సా ధన కనువగు మార్గమును జూపును.

వైరాగ్యసాధనకు రెండుమార్గములు కలవు. ఇం దొకటి భగవంతునియందుగాని, మఱి యెట్టి బాహ్యసాహా య్యమునగాని నమ్మకము లేనివారలకై ఉద్దిష్టమగు మార్గము. వారల సాధకబాధకములను వారే చూచుకొనవలయును. "నేను విరక్తుడను గావలయును" అను దృఢనిశ్చయమును బూని వారు తమ మనోబలముతో, వివేకబలముతో కృషి చేయవలసియున్నది. ఆస్తికులకు, అనగా భగవంతునియందు విశ్వాసముగలవారి కింతకంటె సులభమైనమార్గము కలదు. వారు తమ కర్మఫలములను భగవంతునకు సమర్పించి, సంగరహితులై కర్మ మొనర్తురు. దేని నవలోకించినను, దేని ననుభవించినను, దేనిని వినినను, దేని నొనర్చినను— సర్వము వారు భగవదర్పిత బుద్ధితోడనే యొనర్తురు. మన మే కర్మ మొనర్చినను దానివలన స్వలాభమునుగాని, పరు లచే స్తుతినిగాని ఆశింపకుందముగాక. సర్వము భగవంతు నిదే, కర్మఫలమును భగవంతునికే సమర్పింపుము. మనము జగన్నాథుని సేవకులమనియు, ఆతని యాజ్ఞలను నిర్వర్తించు చున్నామనియు, కర్మమొనర్ప ప్రతిక్షణమును ఆతడే మన లను ప్రేరేపించుచున్నాడనియు భావించి కర్మఫలముల యెడ నిర్లిప్తులమై యుందముగాక. నీ వారాధించునదెల్ల, అవలో కించునదెల్ల, చేయునదెల్ల భగవానునకు సమర్పించి శాంత చిత్తుడవుగమ్ము. పరిపూర్ణ ప్రసన్నచిత్తులమైన మన మన

శ్శరీరములను సర్వమును భగవానునకు నిరంతర సమర్పణ
ముగా—యజ్ఞముగా—నొనర్తముగాక. అగ్నిలో హవి
స్సులను వ్రేల్చుటకు బదులు అహోరాత్రములు యజ్ఞనారా
యణునకు అహంకార సమర్పణమను నీ మహాయజ్ఞమును,
ఈ వైశ్వకయజ్ఞము నొనర్పుము. "ఈ ప్రపంచమున నిధి
నిక్షేపముల నన్వేషించుచు నీవే నా పెన్నిధానమవని కను
గొంటిని; నన్ను నీకు సమర్పించుకొనుచున్నాను. ఈ సంసార
మున ప్రియు నన్వేషింపసాగుచు నీవే నా ప్రాణప్రియుడవని,
నా ప్రేమజ్యోతివని కనుగొంటిని; నన్ను నీకు సమర్పించు
కొనుచున్నాను." భగవానునకు రేయింబవళ్లు ఇటు లాత్మ
నివేదన మొనర్చుకొనుచు నిట్లు వక్కాణింతముగాక: "నా
కేదియు వలదు, నాయొద్దనున్న వస్తునిచయ మెట్టిదైన నగు
గాక. నేను దానిని లక్షింపను; నా సర్వస్వము నీకే సమ
ర్పింతును" ఆత్మార్పణము మనకు అలవాటగువఱకు, అను
క్షణము మన శరీరమంతయు ఆత్మార్పణభావమున కధీన
మగు పర్యంతము, రేయింబవళ్లు భగవానునకు మనలను
మనము సమర్పించుకొందముగాక. రణభేరీనినాదములతో,
ఫిరంగుల యగాదులతో, అఖండ కోలాహలములతో గూడిన
రణరంగమధ్యమున కేగినను నీ వపుడు ప్రశాంతచిత్తుడవై
నిర్లిప్తుడవై యుందువు.

ధర్మమునుగూర్చి మన కర్తవ్యమని, లేక విధ్యుక్త
మని భావించునట్టి సామాన్యాభిప్రాయము అంతగా ఉత్తమ
మైనది కాదని కర్మయోగము మనకు బోధించును; ఐనను
మనమందఱము మన కర్తవ్యము నాచరింపవలసియున్నది.

కాని విచిత్రమగు నీకర్తవ్యబుద్ధి తలచు మహా దుఃఖకారణ మగుచుండుట మనకు విదితము. కర్తవ్య మనునది మనలో నొక రోగముగా పరిణమించియున్నది; ఇదియే మనలను కర్మరంగమునకు లాగుచున్నది. ఇయ్యది మనల నావహించి మన జీవితమును దుఃఖభూయిష్ఠ మొనర్చుచున్నది. ఇదియే మానవ జీవితవృత్తమునకు వేరుపురుగు. ఈ కర్తవ్యము— ఈ కర్తవ్యచింత — మానవ మనఃకమలమును దహించి వేయుచున్నది. పాపము, కర్తవ్యమునకు — విధ్యుక్తమునకు — దాసులగు జనుల దురవస్థ యెట్టిదో చూడుడు! (తమ కార్యాలయమందలి) "విధ్యుక్త కర్మాచరణము" చే వారికి స్నానము చేయుటకు తీఱిక లేదు. భగవత్ప్రార్థన చేయుటకు తీఱిక లేదు. సదా "విధ్యుక్తము" వారి నావహించియున్నది. ఇంటినుండి వెడలి వారు కార్యనిమగ్నులై యుందురు. "విధ్యుక్తము" వారి నావహించియున్నది! ఇంటికివచ్చి మఱల మఱునాటి కార్యములనుగూర్చి యాలోచింతురు. "విధ్యుక్తము" వారి నావహించియున్నది! భారవహమైన బండికి బూన్పబడిన గుఱ్ఱమువలె తుద కే నడివీధిలోనో ప్రాణములు విడువవలసివచ్చు నట్టి జీవితము నట్టి బానిస జీవితము గదా! విధ్యుక్తమునుగూర్చి జనుల యభిప్రాయ మిట్లున్నది. సంగరహితులమై, స్వేచ్ఛామయులమై కర్మఫలమును భగవంతునకు సమర్పించి కర్మముల నాచరించు టొక్కటే విధ్యుక్త కర్మాచరణము. మన విధ్యుక్త కర్మములన్నియు భగవంతునివి. అతని కార్యముల నొనర్చుటకు నిమంత్రితులమైనందులకు—నిమిత్తమాత్రులమై

నందులకు—మనము ధన్యులము. మన నియమితకాలము మనము సేవచేయవలసియున్నది; అయ్యది బాగుగా చేయుదుమో, ఓగుగా చేయుదుమో యెవ్వరెఱుంగుదురు! బాగుగా జేసినచో ఫలము మనదికాదు; ఓగుగా జేసినను ఫలచింతతో మనకు నిమిత్తము లేదు. కావున శాంతచిత్తుడవై, బంధరహితుడవై కార్యముల నొనర్పుము. ఇట్టి స్వాతంత్ర్యమును బడయుట సులభసాధ్యమని భావింపకుడు. దాస్యమును విధ్యుక్తమని చెప్పుట—ఈ రక్తమాంసకల్పిత శరీరమందలి వ్యామోహమునకు విధ్యుక్తము (Duty) అని నామకరణముచేయుట—చాల సులభము! జనులు లౌకిక జీవితములోనికి దిగి, ధనముకొఱకో, మఱి దేనికొఱకో విశ్వ ప్రయత్నము చేయుచుందురు, కలహించుచుందురు. కారణ మేమన, వారికి దానియందు వ్యామోహము. "ఎందులకీ గందరగోళము?" అని వారి నడుగుడు. "ఇది మా విధ్యుక్తము, కర్తవ్యము" అని సమాధానము చెప్పుదురు. కాని యథార్థమున కిది విపరీతమైన కాంచన వ్యామోహము, స్వలాభాపేక్ష. ఐనను వారు దీనిని కర్తవ్యమను కృతకాంబరముచే గప్పిపుత్తురు.

ఇంతకును ఈ కర్తవ్యమనగా 'నెట్టిది? విధ్యుక్తమనగా నెట్టిది? మమకారజనిత కర్మమునే మనము కర్తవ్యమనుచున్నాము, విధ్యుక్త మనుచున్నాము. మమకారము స్థిరపడినంతనే దానికి మనము విధ్యుక్తమని నామకరణము చేయుదుము. ఉదాహరణమునకు, వివాహాచారములేని దేశములలో భార్యాభర్తల నడుమ నెట్టి విధ్యుక్తమును లేదు.

ఒండొరులయెడ రాగముచే స్త్రీపురుషులు పెండ్లిచేసికొని భార్యాభర్తలై మనుచుందురు. పలుతరములైన వెనుక ఆ విధమైన జీవనము స్థిరపడును; స్థిరపడినంతనే అది విధ్యుక్తమగుచున్నది, ధర్మమగుచున్నది. ఇది యొక విధమైన వ్యాధియని చెప్పవచ్చును. అస్వస్థత పరిపక్వమైనపుడు దానిని మనము వ్యాధి యనుచున్నాము; ఆ వ్యాధియే జీర్ణించినపుడు దానిని మనము స్వభావ మనుచున్నాము, నైసర్గిక మనుచున్నాము. కాని వ్యాధి యెప్పుడును వ్యాధియే. కావున రోగము మనలో జీర్ణస్థితి నొందినంతనే దానికి మనము ధర్మమనియు విధ్యుక్తమనియు నామకరణ మొనర్చి యారాధన నారంభించుచున్నాము. దానిపై అక్షతలు చల్లుచున్నాము; పువ్వులు వేయుచున్నాము; మంత్రములు పఠించుచున్నాము;—ఇక నీ ధర్మముకొఱకై లోకమంతయు నడుముగట్టుకొని యుద్ధమునకు దిగుచున్నది; ఇక లోకులు ధర్మదీక్షాబద్ధులై యొకరినొకరు దోచుకొన నారంభించుచున్నారు. మానవునందలి పశుస్వభావమును నిరోధించు పర్యంతము విధ్యుక్తబుద్ధి మంచిదే. ఇంతకంటె ఉన్నతాదర్శము నవలంబింపజాలని నికృష్టులగువారి కిది కొంతవఱకు శ్రేయస్కరమనుటకు సందియము లేదు; కాని కర్మయోగులు కానెంచువారలు ఈ విధ్యుక్తబుద్ధిని త్రోసిరాజనవలయును. మీకును నాకును విధ్యుక్తమనున దేమి కలదు? లోకమునకు నీవొసగుదానిని ఒసగవలదని యెవ్వరును చెప్పుట లేదు, తప్పక యొసగుము. మనఃపూర్వకముగా నొసగుము, కాని విధ్యుక్తమనిమాత్రము వలదు.

లోకమునకు నేను దీని నొసగితినని కలనైనను దలపకుము. కర్మాచరణమున నిర్బంధితుడవుగాకుము. నీవేల నిర్బంధితుడవు గావలయును? నిర్బంధముచే నే కార్యమును జేసినను అయ్యది బంధమును గల్గించును — మోహమును గల్గించును. విధ్యుక్తచింత నీ కెందుల కుండవలయును? సమస్తము భగవానునకు సమర్పింపుము. విధ్యుక్తచింతయను దావానలము ఎల్లరను దహించి వేయుచుండ, ఈశ్వర ప్రణిధానమను నమృతము గ్రోలి సుఖింపుము. పరమేశ్వర సంకల్పమునే మన మనువర్తించుచుండ, పుణ్యపాప ఫలములతో మనకు బనియేమి? నీకు పుణ్యము కావలసియున్నచో పాపమును అనుభవించి తీరవలయును; పాపఫలమునుండి తప్పించుకొనుటకు పుణ్యఫలమునుగూడ విడుచుటయే మార్గము. దుఃఖవిముక్తుడవు గావలయునన్నచో సుఖాసక్తిని విడువవలయును. సుఖదుఃఖములు పరస్పరసంబద్ధములు గదా. ఒకవైపున సుఖమున్నచో మఱియొకవైపున దుఃఖమున్నది. ఒకవైపున జన్మమున్నచో మఱియొకవైపున మృత్యువున్నది. మరణాతీతులము కావలయునన్నచో జీవితాభినివేశమును విడువవలయును. జననమరణము లేకమయ్యును భిన్నదృక్పథములతో జూచుటచే మనకవి భిన్నముగా నున్నట్లు గాన్పించుచున్నవి. కావున దుఃఖరహితమగు సుఖమును మృత్యురహితమగు జన్మమును ఉండవలయునను భావము బడిపిల్లలకును పసిబాలురకును చాలమంచిదే కాని యాలోచనా పరుడగువాని కిది కేవల మసంగతమనితోప నాతడా రెంటిని విడిచిపెట్టును. కావున నీ వే కార్య మొనర్చినను

దానివలన నీకు స్తుతిగాని బహుమానముగాని కలుగవలయు నని భావింపకుము. మన మొక సత్కార్యమును జేసితిమో లేదో వెంటనే జను లందులకు మనలను శ్లాఘింపవలయునని కోరుచుందుము. ఏ ధర్మకార్యమునకో కొంత ధనము నిచ్చి నంతనే మన పేరులు పత్రికలలో అభివర్ణింపబడవలయునని వాంఛించుచుందుము. దుఃఖమేకదా యిట్టి వాంఛలకు ఫలము, ప్రపంచమందలి మహామహులు తమ్మిగూర్చి ఎవ్వరికిని తెలియకుండగనే వెడలిపోయినారు. లోక మించు కయు నెఱుగని యీ మహామహులతో బోల్చిచూచినచో మన బుద్ధులును క్రీస్తులును రెండవ తరగతి వారని చెప్ప వలసియున్నది. అజ్ఞాతులగు వందలకొలది యిట్టి వీరులు నిరాడంబరముగా, నిశ్శబ్దముగా కృషిచేయుచు ప్రతిదేశ మందును మనియున్నారు. నిశ్శబ్దముగా జీవించి, వారు నిశ్శబ్దముగా వెడలిపోవుదురు. కాలక్రమమున వారి భావ ములు బుద్ధులందును క్రీస్తులందును రూపొందుచుండును; వీరే లోకమునకు దెలియవచ్చువారు. ఉత్తమోత్తము లెన్న డును తమ జ్ఞానవిజ్ఞానములవలన పేరు ప్రతిష్ఠలను బొంద నాశింపరు. లోకమునకు వారు తమ భావముల నొసగుదురు; అవి తమవని చెప్పరు, తమపేర సంప్రదాయములను సిద్ధాంత ములను స్థాపింపరు. అట్టి కార్యములు వారల స్వభావమునకు కేవల విరుద్ధములు, అసంభవములు. వారు ఎట్టి యార్భాట మును లేని పరమ సాత్త్వికులు; ప్రేమసాగరమున వారి హృదయము లీనమైపోవును. భారతదేశమున నొక గుహలో

నివసించు నిట్టి యోగిపుంగవు* నొకని నే జూచియున్నాను. నే గాంచిన యత్యద్భుత వ్యక్తులలో ఆత డొకడు. ఆతడు తన వ్యక్తిత్వమునే మఱచినాడు, అహంకార మాతనియందు కలికమునకైనను కానరాదు. సమస్తము భగవత్స్వరూప మని యాతని భావము. ఏదేని జంతువు ఆతని చేతిని కఱచి నచో రెండవచేతినిగూడ దాని కొసగ సంసిద్ధుడై యాత డంతయు పరమేశ్వరేచ్ఛ యని పలుకును; తన కేమి ప్రాప్తించినను పరమేశ్వర సంకల్పమనియే ఆతని భావము. లోకుల కాతడు కాన్పింపడు, ఐనను దివ్యాశయప్రపూర్ణుడు; ఆతడు ప్రేమామృత సింధువు.

ఇట్టి యోగిపుంగవులకు తరువాత గణింపదగినవారు ధర్మరక్షణార్థము నడుముగట్టుకొని పోరాడునట్టి తీవ్ర కార్య దక్షులు. విశేష రజోగుణవంతులు వీరు; పరిపూర్ణులయొక్క భావములను గైకొని వీరు లోకమునకు బోధింతురు. ఉత్త మోత్తములగువారు నిశ్శబ్దముగా మహోదార భావములను తాత్త్వికాశయములను సేకరింతురు; ఇతరులు—బుద్ధులు, క్రీస్తులును—ఇంటింటికి వెడలి ధర్మప్రబోధ మొనర్చుచు ప్రపంచసేవ నొనర్తురు. గౌతమబుద్ధుని జీవితమున నాతడు తాను ఇరువదియైనవ బుద్ధుడనని తఱచు చెప్పుచుండి నట్లు కాన్పించును. అతనికిముందు మనిన యిరువదినలుగురును

* ఈతడు పవ (పవసా) హారిబాబా యను గాజీపురపు సాధువు. స్వామి యాతని గూర్చి ప్రత్యేకముగా నొక మహోపన్యాస మొసగి యున్నాడు. ఈ సాధుపుంగవు నొకప్పు డొక పాము కఱవ, "పరమే శ్వరునుండి వార్తావహు డరుదెంచె" నని నిర్లిప్తుడై యుండెను.

చరిత్రకు దెలియరైరి. ఐనను వారు వైచినపునాదులమీదనే బుద్ధుడు తన ధర్మసౌధమును నిర్మించి యుండవలయును. ఉత్త మోత్తము లెప్పుడును నిశ్శబ్దముగా, నిరాడంబరముగా, అజ్ఞాత ముగా జీవింతురు. వారేభావప్రభావమును నిజముగా గ్రహించిన వారు. తామొక గుహాలోనికి వెడలి, ద్వారమును బంధించి, యథార్థమగు నైదు భావములను భావించి యంతటితో గతించి నను, ఆ యైదుభావములును ఆచంద్రార్కము వెల్గొందునని వారికి బాగుగా దెలియును. నిజముగా నట్టిభావములు పర్వ తములను పగుల్చుకొని, సాగరములను లంఘించి, ప్రపంచ వ్యాప్తినిగాంచి మించును. అయ్యవి మానవ హృదయాంత రాళమున బ్రవేశించి, మనోబుద్ధులందు వ్యాపించి, స్త్రీపురు షుల నుద్ధరించును; వారి దైనందిన జీవితమున నయ్యవి అను ష్ఠానరూపమును దాల్చును. ఇట్టి సత్త్వస్వరూపులు సర్వదా పరమేశ్వరసాన్నిధ్యము నొంది తన్మయులై యుండుటచే కార్య రతులు కాజాలరు; ధర్మప్రచారమనియు, లోకహితమనియు జెప్పబడు నీ గందరగోళములోనికి — ఈ కోలాహలము లోనికి — ఈ కర్మసంరంభములోనికి — దిగజాలరు. ఎంత మంచివారైనను తీవ్రకార్య నిమగ్నులగు వారియందే లవ లేశమో అజ్ఞాన మింకను నిలిచియుండును. మనయొక్క స్వభావమున గొంతమాలిన్య ముండిననే కాని కర్మ మొనర్ప జాలము. సాధారణముగా రాగము చేతను ప్రయోజనేచ్ఛ చేతను బ్రేరేపింపబడుట కర్మస్వభావముననే కలదు. చీమ చిటుకుమన్న గ్రహించునట్టి జగద్రక్షకుని బ్రోల మానవుడు తన కర్మములకు బ్రాముఖ్యము గలదని ఎట్లు భావింపగలడు?

జగన్నాథుడే జగత్తునందలి ప్రత్యల్ప వస్తువును గూర్చియు శ్రద్ధ వహించుచున్నాడని గ్రహించియు మన చెయిదములకు ప్రాముఖ్యమును గల్పించుకొనుట మహాపరాధము గాదా! భక్తిపూర్వక భయాన్వితులమై కరములు మోడ్చి, "సర్వేశ్వరా! జగద్రక్షకా! నీ యిచ్ఛయే నెఱవేఱుగావుత" మని ప్రార్థించుటయే గదా మన విధి! ఉత్తమోత్తములుపూర్తిగా రాగవిరహితులై యుండుటచే కర్మ మొనర్పజాలరు. ఎవ్వారి మానసము ఆత్మలీనమై యున్నదో, ఎవ్వారి కోర్కె లెన్నడును ఆత్మవిముఖములు గావో, ఎవ్వ రాత్మాభిరతులో అట్టి వారికి ఎట్టి విధ్యుక్తముగాని కర్తవ్యముగాని లేదు. వారే నిజముగా మానవోత్తములు, వారు దక్క ఇతరు లందఱును కర్మ మొనర్చి తీరవలయును. కాని యట్టి కర్మాచరణమున లోకమునకు మన మణుమాత్రమును మే లొనర్పగల మని భావింపకుందుము గాక. మేలొనర్చుట మనవలన గాదు. ప్రపంచమను నీ మహా వ్యాయామశాలలో పారమార్థిక సాధనరూపమున మనకే మేలొనర్చుకొనుచున్నాము,— ఉపకార మొనర్చుకొనుచున్నాము. ఇదియే కర్మాచరణమున మన మవలంబింపవలసిన సరియగు మనోభావము. ఈ విధముగా కర్మ మొనర్చితిమేని, యిట్టి కర్మాచరణము మనకు భగవద్దత్తమగు మహావకాశమని — అధికారమని — సదా మనము గుర్తించి వర్తించితిమేని దేనిచేతను బద్ధులము కానేరము. మీబోంటి నాబోంటి లక్షలకొలది జనులు తాము ఈ లోకమున ఘనులమని తలపోయుచుందురు. కాని మనము మరణించిన ఐదునిమిషములకే ప్రపంచము మనలను మఱచి

పోవును. కాని, భగవంతుడు శాశ్వతుడు, భాగవత జీవనము శాశ్వతము. "సర్వశక్తిమంతుడగు సర్వేశ్వరుడు సంకల్పించినచో క్షణమైన నెవ్వడు జీవింపగలడు! శ్వాసింపగలడు!" అతడే శాశ్వత జగద్రక్షకుడు. అతడే సర్వశక్తిమంతుడు, సర్వ జగన్నియామకుడు. "భీషాఽస్మాద్వాతః పవతే, భీషోదేతి సూర్యః, భీషాఽస్మాదగ్నిశ్చ ఇన్ద్రశ్చ మృత్యుర్ధావతి పంచమః* – అతని యాజ్ఞకు వెఱచియే గాలి వీచుచున్నది. సూర్యుడు ప్రకాశించుచున్నాడు, ఇంద్రుడును అగ్నియు తమ తమ ధర్మముల ననువర్తించుచున్నారు. మృత్యువు ప్రాణులను గ్రసించుచున్నది." అతడే సర్వలోకాధీశ్వరుడు, సర్వ లోకాంతర్యామి, అతడే సర్వము. అతడు మనకు ఆరాధ్యుడు. సర్వ కర్మఫలత్యాగ మొనర్పుము. నిర్హేతుకముగా లోకహిత మొనర్పుము: అపుడే అఖండ వైరాగ్య మబ్బును. ఇట్లు అజ్ఞానపాశములు విచ్ఛిన్నమై మోక్షము కరతలామలక మగును. ఇట్టి మోక్షమే కర్మయోగ పరమావధి. కర్మయోగ పరమ ప్రయోజనము.



* తైత్తిరీయోపనిషత్తు, 2.8.

# ఎనిమిదవ అధ్యాయము

## కర్మయోగాదర్శము

భిన్నమార్గములచే ఒకే పరమావధిని ప్రాపింపగల మనునది వేదాంత మతమందలి మహోత్తమాశయము*. కర్మము, భక్తి, యోగము, జ్ఞానము నని వీనిని నేను నాలుగింటిక్రింద సామాన్యీకరించి యున్నాను. ఐనను మీరీ విభాగములు కేవల ప్రత్యేకములును పరస్పర భిన్నములును గావని గుర్తింతురుగాక. ఒకయోగము మఱియొక యోగమున గలియుచున్నది. కాని యేది విశేషించి యుండునో దాని ననుసరించి విభాగము నేర్పఱుచుచుందుము. కర్మయోగమునకు దక్క ఇతరయోగములకు కేవల మసమర్థులగువా రుందురనికాని, ఉపాసకులు మాత్రమే యగువా రుందురనికాని, జ్ఞానాన్య విహీనులగువారు కలరనికాని మీరు భావింపరాదు. ప్రతివ్యక్తియందును ఈ యోగములలో నేది విశేషముగా నుండ నవకాశము కలదో దాని ననుసరించి యీ విభాగము లేర్పఱుపబడుచుండును. తుద కివి యన్నియు ఒకే గమ్యమును బొందుననియు, అం దైక్య మొందుననియు మనము గ్రహించియున్నాము. సర్వమతములును, ధర్మములును, కర్మములును, ఉపాసనలును మనల నొకే గమ్యమును—పరమావధిని—ప్రాపింపజేయుచున్నవి.

---

* "మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః."

—భగవద్గీత, 3-23.

ఆ గమ్య మెట్టిదో నే నిదివఱకే చూప యత్నించి యున్నాను. నేను గ్రహించినంతవఱకు మోక్షమే ఆ గమ్యము. నిర్జీవమగు—జడమగు—భౌతిక పరమాణువు మొదలుకొని జీవలోకమున మహోత్తమ తత్త్వమగు మానవాత్మపర్యంతము, అణువు మొదలుకొని మానవునివఱకు మన చుట్టును మనకు గాన్పించు సమస్తము మోక్షముకొఱకే ప్రయత్నించుచున్నది. ప్రపంచమంతయు నిజముగా ఈ మోక్ష సంరంభముయొక్క ఫలితమే కాని మఱియొకటి కాదు. సమస్త సంయోగములందును ప్రత్యణువును స్వీయమార్గమున సంచరింప నితరాణువులనుండి విడివడ యత్నించుచున్నది; కాని యితరాణువులు దానిని నిరోధించుచున్నవి. సూర్యమండలమునుండి మన భూమండలము పరుగెత్తుకొని పోవ యత్నించుచున్నది. ఇట్లే భూమండలమునుండి చంద్రమండలము పాఱిపోవ బ్రయత్నించుచున్నది. ఆత్మవిమోచనము కొఱకే అన్నియు ఆందోళనపడుచున్నవి. ఈ బంధవిమోచన ప్రయత్నమే ప్రపంచమందలి సమస్త సంఘటనలకును మూలకారణము. మోక్షేచ్ఛచేతనే తాపసుడు, ప్రార్థించుచున్నాడు, దొంగ దొంగిలించుచున్నాడు. అవలంబిత కార్యవిధానము సరియైనది కానిచో ఆ కార్యమును మనము చెడ్డదనుచున్నాము. అది సక్రమమై ఉత్తమమార్గము ననుసరించినచో ఆ కార్యమును మనము మంచి దనుచున్నాము. కాని యీ రెంటికిని విమోచనయత్న సంబంధమగు ప్రవృత్తి లేక ప్రేరణ మొక్కటియే. అజ్ఞానపాశబద్ధుడనను భావము తాపసుని బాధించుచున్నది, తద్బాధా విమోచన

మునకై యాతడు భగవంతుని ప్రార్థించుచున్నాడు. తన కేవో కొన్ని వస్తువులు లేవను భావము దొంగను బాధించు చున్నది. ఆ లోపమును నివారించుకొనుటకై -ఆ బాధనుండి విముక్తి నొందుటకై — యాతడు దొంగిలించుచున్నాడు. చేతనాచేతన సమస్త ప్రకృతికిని మోక్షమే పరమావధి. తెలిసినను తెలియకున్నను సర్వము ఆ పరమావధిని బొందు టకే ప్రయత్నించుచున్నది. తపస్వి వెదకుచున్న విమోచన మునకును దొంగ వెదకుచున్న విమోచనమునకును చాల భేదము కలదు; తపస్వికి ప్రియమగు విమోచనము అనిర్వచ నీయ బ్రహ్మానందప్రదమగుచున్నది. దొంగ కోరుకొను నదియో, వానికి మఱింత బంధమును గల్పించుచున్నది.

సమస్త మతధర్మములందును ప్రబలమగు నీ విమోచ నేచ్ఛయే వ్యక్తమగుచున్నది. క్షుద్రమగు నీ శరీరాభిమాన మును విడనాడ నెంచు స్వార్థరాహిత్యమున కేమి, ధార్మిక జీవనమున కేమి, బంధవిమోచన ప్రయత్నమే పట్టుగొమ్మ. ఎవ్వడేని పరహిత మొనర్చుచు సత్కర్మముల నొనర్చు చున్నచో "నేను, నాది" యను సరిహద్దులలో ఆతడు బంధింపబడజాలకున్నాడని యర్థము. స్వార్థరాహిత్యమునకు- స్వార్థత్యాగమునకు—పరిమితియనునది లేదు. సమస్త నీతి శాస్త్రములును సంపూర్ణ స్వార్థత్యాగమే పరమావధియని బోధించుచున్నవి. పూర్తిగా స్వార్థరహితుడగు వాని స్థితి గతు లెట్లుండునని మీ రడుగవచ్చును. ఆత డిక పూర్వపు వ్యక్తిగాడు, — 'ఫలానా' పుల్లయ్యగాని ఎల్లయ్యగాని గాడు; ఆత డఖండాభివృద్ధి నొందియున్నాడు. అనంత విస్తృతి

పొందియున్నాడు. మునుపటి యల్పవ్యక్తిత్వము శాశ్వతముగా గతింప నాతడు అనంతుడై యున్నాడు; అఖండుడై యున్నాడు. ఇట్టి యనంత వికాసము నొందుటయే సమస్త మతధర్మములకును బోధనలకును పరమావధి. తత్త్వశాస్త్ర మీ భావమును దెలుపుటగాంచి తన వ్యక్తిత్వమే మగునో యని వ్యక్తివాది భయమందవచ్చును. ఐనను తాను నీతినియమములనుగూర్చి బోధించునపు డీ భావమునేకదా అతడును దెలుపుచున్నాడు. స్వార్థరాహిత్యమున కాతడు హద్దు లేదనుచున్నాడు, మంచిది. వ్యక్తిత్వసిద్ధాంతము ననుసరించి యొకడు పూర్తిగా స్వార్థరహితుడైనా డనుకొందము; ఇతర సిద్ధాంతములు దెలుపు ముక్తులకును వానికిని భేదమేమి? విశ్వముతో నాతడు ఐక్యము నొందియున్నాడు. ఇట్టి యైక్యమేగదా సమస్త మతధర్మములకును పరమావధి. వ్యక్తివాదికి తన హేతువాదమును సక్రమ సిద్ధాంత పర్యంతము అనుసరించుటకు దగినంతటి ధైర్యములేదు, పాపము! సమస్తమానవపరమావధియగు మోక్షమును స్వార్థరహిత కర్మమూలమున బొందుటయే కర్మయోగాశయము. స్వార్థరహితమగు ప్రతికార్యమును మనలను గమ్యమువైపునకు గొనిపోవును. కావున "ఎయ్యది స్వార్థపరమో అదియే అధర్మము, అవినీతి, స్వార్థరహితమగున దేదియో అదియే ధర్మము, నీతి" అనునది యొక్కటియే నీతిధర్మములకు సరియగు నిర్వచనము.

కాని వివరములను గమనించుచో విషయ మంత సులభముగా గాన్పింపదు. ఉదాహరణమునకు, పరిస్థితుల

ననుసరించి నైతిక నియమములయొక్కయు ధార్మిక నియమ
ములయొక్కయు వివరములు మారుచుండునని నేనిదివఱకే
చెప్పియున్నాను. ఒకే కార్య మొకరీతిపరిస్థితులలో స్వార్థ
రహితమైయుండ, వేఱొకరీతి పరిస్థితులలో పూర్తిగా స్వార్థ
పరమై యుండవచ్చును. కావున సర్వసాధారణ నిర్వచన
మును మాత్రమే తెలుపుచు వివరములను దేశకాల పరిస్థితు
లకు వదలివేయుట మనకు సమంజసము. ఒక దేశములో
నొకవిధమైన ప్రవర్తన ధర్మచోదితముగా పరిగణింపబడు
చుండ నదియే మఱియొక దేశమున అధర్మయుక్తముగా
పరిగణింపబడుచున్నది; ఏలన రెండింటను పరిస్థితులు భిన్న
ముగానున్నవి. బంధవిమోచనమే సమస్త ప్రకృతికిని
పరమావధి; పూర్ణమగు స్వార్థరాహిత్యమే తత్ప్రాప్తి
కుపాయము. స్వార్థరహితమగు ప్రతిభావమును ప్రతిశబ్ద
మును ప్రతికార్యమును మనలను గమ్యమువైపునకు గొని
పోవుటచే ధార్మిక మనబడుచున్నది. ఈ నిర్వచనమే సమస్త
మతధర్మములకును నీతిశాస్త్రములకును మాన్యము కాగ
లదు. కొన్ని ధర్మశాస్త్రముల ననుసరించి కొందఱు ధర్మము
అతీతుడగు భగవంతుని మూలమున సంప్రాప్తమగునని
భావించుచున్నారు. ఎవ్వడేని యొక కర్మమును జేయవలయు
ననుటకుగాని, చేయరాదనుటకుగాని హేతువేమని వీరు
వారి నడిగినయెడల "అది భగవదాజ్ఞ కావున" అని వారు
సమాధానము చెప్పుదురు. కాని వారి ధార్మిక నియమము
లకు మూలమేమైనను, స్వార్థచింతను విడువవలయుననుటయే
వారి ధర్మశాస్త్రములయొక్క ముఖ్యోద్దేశము. ధర్మము

గూర్చి యిట్టి యుత్తమభావమును గలిగినవారయ్యు తమ యల్పవ్యక్తిత్వమును ప్రత్యేకతను విడువవలయుననినంతనే కొందఱు భయపడుచుందురు. పూర్తిగా స్వార్థరహితుడు—స్వార్థచింతనే విడనాడినవాడు—స్వార్థమై యెట్టికార్యమును జేయనివాడు—ఎట్టిమాటయు నాడనివాడు—ఇట్టివాని స్థితిని గూర్చి పర్యాలోచించి, "తాను" అనునది యెచ్చట యున్నదో చెప్పుమని వ్యక్తిత్వమును బట్టుకొని ప్రాకులాడు వానిని మనము అడుగవచ్చును. స్వార్థమై తా నెంతవఱ కాలోచించునో, సంభాషించునో, ప్రవర్తించునో అంతవఱకే ఆ "తాను" అనునది వానికి పొడకట్టుచుండును. పరులను గూర్చి, ప్రపంచమునుగూర్చి భావించినప్పుడు "తాను" అనునది యేది? ఏమైనది? శాశ్వతముగా అంతరించినది. కావున స్వార్థరహిత సత్కర్మాచరణ మూలమున మోక్షమును బొందుట కేర్పడిన ధర్మశాస్త్రమే కర్మయోగము. కర్మయోగియగువా డేసిద్ధాంతమును విశ్వసింపనక్కఱలేదు. భగవంతుని యస్తిత్వమునుగూడ నాతడు నమ్మనక్కఱ లేదు. ఆత్మ యెట్టిదనికాని, పరతత్త్వ మెట్టిదనికాని విచారింప నక్కఱలేదు. స్వార్థరాహిత్యమును సాధించుటయే అతని ముఖ్యాశయము; అతడు దానిని స్వయముగా సాధింపవలయును. అతని జీవితమందలి ప్రతిక్షణమును అనర్వానుభవమై యుండవలయును. ఏలన, జ్ఞాని దేనిని తన వివేకము వలనను భక్తుడు తన ప్రేమచేతను సాధింపజూచునో ఆ పరతత్త్వమునే ఎట్టివాదములను సిద్ధాంతములను అపేక్షింపక కర్మయోగి తన కర్మాచరణముచేతనే సాధింపవలసియున్నది.

ఈ కర్మ మెట్టిదనునది, లోకహితాచరణ మెట్టి దను నది, తరువాతి ప్రశ్న. నిజముగా మనము లోకహిత మొనర్ప గలమా? వ్యావహారికముగా జూచినచో "ఔను" అనియు, పారమార్థికముగా జూచినచో "కాదు" అనియు జెప్పవలసి యున్నది. శాశ్వత మగు నెట్టిహితమును శ్రేయమును లోక మునకు మనము సమకూర్పజాలము; సమకూర్ప గల్గినచో లోక మీ విధముగా నుండదు. ఐదు నిమిషములు ఒకని యాకలి మనము బాపవచ్చును; కాని వానికి మరల ఆకలి యగుచున్నది. ఒరుల కొనగూర్పగలిగిన యే సౌఖ్యమైనను కేవలతాత్కాలికము, క్షణికము. లోకమున కెట్లు శాశ్వతా నందమును గల్గింపగలము? సముద్రమున తరంగము బయలు దేఱినతావునకు ప్రక్కనే పల్లమేర్పడుచున్నది. మానవుని యాశలకును అక్కఱలకును వలయు సద్వస్తునిచయము లోక మున నెల్లప్పుడును ఒకేపరిమితి గలిగియున్నది. దానిని మనము వృద్ధి చేయ జాలము, తగ్గింపను జాలము. ఇంతవఱకు జరిగిన మానవచరిత్రను గైకొని చూడుడు. ఒకేరీతి సుఖ ములు, ఒకేరీతి దుఃఖములు, స్థితిగతులలో ఒకేరీతి తారత మ్యములును గాన్పించుట లేదా? కొందఱు ధనవంతులు గను, కొందఱు దరిద్రులుగను, కొంద ఱధికులుగను, కొంద ఱల్పులుగను, కొందఱు ఆరోగ్యవంతులుగను, కొంద ఱనా రోగ్యవంతులుగను లేరా? ఈ పరిస్థితు లన్నియు నేటి యమె రికా దేశస్థులపట్ల నెట్లున్నవో ప్రాచీనకాలమున ఈజిప్టు, గ్రీసు, రోమను దేశస్థులపట్లను సరిగా నట్లే యుండినవి. మానవచరిత్ర మన మెఱిగినంతవఱకు ఇవి యన్నియు నెల్ల

ప్పుడు నొకేవిధముగా నున్నవి; ఐనను అనివార్యములైన యీ సుఖదుఃఖముల వెనువెంటనే తరణోపాయ యత్నమును గావించుచున్నది. పరుల జీవయాత్రను కష్టరహితమొనర్చుటకై యఖండ కృషిసల్పిన వేలకొలది స్త్రీ పురుషులు ప్రతి దేశమునను ప్రభవించియున్నారు. కాని, వారి యత్నము లెంతవఱకు ఫలించినవి? ఆటబంతి నొక-చోటినుండి మఱియొక-చోటికి త్రోయుటయే మనము చేయగలిగిన పని. ఇయ్యది డాన్టె (Dante) కవి తన కావ్యమున వర్ణించిన నరకములోని లోభులవిషయమును తలపునకు దెచ్చుచున్నది. బంగారుబంతిని ఆ లోభులు కొండమీదికి దొరలింప నాజ్ఞాపితులైరి. కొంచెము దొర్లించినంతనే ప్రతి పర్యాయమును అది మరల క్రిందికి వచ్చుచుండెడిది. పరిపూర్ణ న్యాయ్యముగా, పరిపూర్ణానందప్రదముగా, క్రీస్తు భూలోకమున వేయేండ్లు రాజ్యము చేయబోవు ననెడు "మిలినియమ్" (Millennium) ను గూర్చిన మన యాశలును మాటలును చాల మంచివే కాని కేవల మవి బడిపిల్లల కథలు కాని మఱియొకటి కావు. ఇటు లువ్విళులూరుచుండు జాతులన్నియు లోకమున నందఱికంటెను తమకే విశేషమైన మేలు కలుగునని తలచుచుండుట మఱియొక విషయము. 'మిలినియము'ను గూర్చిన మన యద్భుత స్వార్థరహిత భావము లిట్లున్నవి!

లోకమునందలి సుఖమునుగాని దుఃఖమునుగాని మనము వృద్ధిచేయజాలము. ఆ తట్టుననుండి యీ తట్టునకును ఈతట్టుననుండి యాతట్టునకును దానిని మనము త్రోసినను త్రోయగలిగినను—అవి యెప్పుడు నొకరీతిగా నుండును.

ఏలన, వాని స్వభావమే అట్టిది. ఇంతలో పోటు, అంతలో పాటు, ఇపుడు ఉవ్వెత్తుగ మీఁది కెగురుట, అపుడు బల్లిన క్రిందబడుట—ఇదియే లోకస్వభావము; వేఱువిధముగా నుండవలయు ననుట జీవనము మృత్యురహితమై యుండవలయు ననుట వంటిది. అది వట్టి పిచ్చిమాట. ఏలన జననమనినంతనే మరణమును మరణ మనినంతనే జననమును స్ఫురించును గదా. స్వయముగా దగ్ధమగుట చేతనే దీపము ప్రకాశించుచున్నది—ఇదియే దాని జీవనస్వభావము. నీకు జీవనము కావలసియున్నచో అనుక్షణమును అందులకై మరణింపవలయును. జీవనముగను మరణముగను గూడ వ్యక్తమగున దొకేతత్త్వము. అది భిన్నముగా నున్నట్లు గాన్పించుటకు మనము భిన్నదృక్పథములనుండి చూచుటయే కారణము. ఒకే తరంగము పైకి లేచుచు గ్రింద బడుచున్నది. లేచుటయే జననము, పడుటయే మరణము; రెండును తుద కొక్కటియే. ఒక డీయలయొక్క విజృంభణమువైపు జూచి, "అన్నియు మన మేలుకొఱకే" యని ఆశావాది యగుచున్నాడు; మఱియొకడు తత్పతనము వైపు జూచి, "అన్నిటికిని తుదకు పతనమే గతి" యని నిరాశావాది యగుచున్నాడు. బాలుడు బడికి వెడలుచు తల్లిదండ్రులు తన్ను సంరక్షించుచుండునప్పుడు సర్వము వానికి మహానందప్రదముగా నుండును. అపుడు వాని కేకొఱతలు నుండవు. ఆశావాదులలో నాత డగ్రగణ్యుడై యుండును. కాని వివిధానుభవములను బొందిన వృద్ధుని విషయమో, అతని యావేశము చాలవఱకు శాంతించుటచే విస్మయముల నాతడు

ఓరిమితో పరిశీలించును. కావున నెటు చూచినను క్షీణదశా చిహ్నములతో గూడిన వృద్ధజాతు లంతటి ఆశాపూరితములై యుండ నేరవు. "వేయేండ్లు పట్టణము, వేయేండ్లు అరణ్యము" అని భారత దేశమున నొక సామెత కలదు. పట్టణము అరణ్యమును అరణ్యము పట్టణమునగు నీ మార్పు ఎల్లెడలను సాగుచునే యున్నది. మార్పు నే దృష్టితో జూతురో దాని ననుసరించి మానవులు ఆశావాదులు గాని నిరాశావాదులు గాని యగుచుందురు.

ఇక సమత్వభావమునుగూర్చి విచారింతము. న్యాయమును సౌఖ్యమును రాజ్యమేలు సమయము వచ్చునను నీ 'మిలినియము' నకు సంబంధించు భావములు జనులను కార్యాచరణమునకు బురికొల్ప ప్రబలశక్తిమంతములై యున్నవి. భగవాను డీ లోకమును బరిపాలింపవచ్చుచున్నా డనియు అపు డెట్టి భేదములు నుండవనియు బోధించుట పెక్కు మతములకు ప్రధానలక్షణముగా గానబడుచున్నది. ఈ సిద్ధాంతమును బ్రకటించువారు కేవల స్వమతదురభిమానపూరితులనియు పిచ్చినమ్మకములు గలవారనియు జెప్పవలసియున్నది. కాని మానవకోటిలో వీ రెప్పుడును అత్యంత నిష్కపట చిత్తు లనుటకు సందియములేదు. స్వమత దురభిమానము ఘాతగాగాని యే క్రైస్తవమతము బోధింపబడినది; గ్రీసు రోమను దేశములందలి బానిసలకు క్రైస్తవమత మెడ వ్యామోహము గల్గించిన దీ క్రైస్తవమతస్థుల స్వమత దురభిమానమే కాని మఱియొకటి కాదు. పరిపూర్ణ న్యాయసౌఖ్యములు జనులను బరిపాలింప బోవుచున్న వను నీ క్రైస్తవ

మతము నవలంబించినచో నాటితో తమ బానిసత్వము
నిర్మూల మగుననియు, తినుట కేమి, త్రాగుట కేమి, వలసి
నంత లభించుననియు నమ్మి యా బానిసలు క్రైస్తవమతమున
గుంపులు గుంపులుగా వచ్చి చేరిరి. మొట్టమొదట ఈతత్త్వ
మును బోధించినవారు స్వమతాభిమానగ్రస్తులగు నజ్ఞానులే
యైనను నిజముగా వారు చాల నిష్కపటచిత్తులు. ఈ 'మిలి
నియము' సంబంధపుటాశయములు నేడు స్వాతంత్ర్యము,
సమత్వము, సౌభ్రాత్రము అను సామ్యభావరూపమును దాల్చి
నవి. ఇవియు వట్టి పిచ్చినమ్మకములే కాని మఱియొకటి కావు.
నిజమైన సమత్వము ప్రపంచమున నిదివఱకెన్నడును ఉండినది
లేదు. ముందుండబోదు. ఇచటగూడిన మనమందఱును సమా
నులమై యుండు టెట్లు పొసగును? అసాధ్యమగు నిట్టి సమత్వ
మనగా సంఘమరణ మన్నమాట. లోక మిట్లుండుటకు హేతు
వేమి? సమత్వము లేకుండుటయే. సృష్టికి పూర్వము ప్రళయా
వస్థలో సంపూర్ణమైన సమత్వ ముండును. అపుడు విశ్వమందలి
సృజనశక్తు లెట్లు వెలువడుచున్నవి? పరస్పరసంఘర్షణవలన
వెలువడుచున్నవి. పోరాటమువలన వెలువడుచున్నవి. ప్రకృతి
యందలి యణువులన్నియు సర్వసమత్వము పొందియున్న వను
కొనుడు. అపుడెట్టి సృష్టిక్రమమైన నుండ నవకాశముండునా!
ప్రకృతి శాస్త్రతత్త్వమునుబట్టి చూచిన, అయ్యది అసంభవ
మని మనకు దెలియును. నిశ్చలమైయున్న నీటిని కలచి
చూడుడు; అందలి ప్రత్యణువును ఒకదానిపై నొకటి లేచుచు
మఱల నిశ్చలత్వము నొందుటకు బ్రయత్నించును గదా.
విశ్వమనబడు నీ దృశ్యమంతయు అందలి పృథివ్యాది భూతము

లన్నియు—అదే విధమున మరల సంపూర్ణసామ్యస్థితి నొందు టకై ప్రబలయత్నము చేయుచున్నవి. ప్రళయము సంభ వించుచున్నది. మరల సత్త్వాదుల సంయోగముచే సృష్టియు నేర్పడుచున్నది. అసమత్వమే సృష్టికిమూలము. ఐనను సమత్వనాశక మగు శక్తులు సృష్టి కెంత యావశ్యకములో సమత్వమును బొంద యత్నించు శక్తులును అంత యావశ్యక ములై యున్నవి.

కేవలసమత్వము, అనగా విభిన్న ప్రకృతిశక్తుల యొక్క పరిపూర్ణసామ్యస్థితి, జగత్తున నుండుట యసంభ వము. ఈ స్థితి సంభవించుటకు ముందు ఏవిధమైన జీవన స్థితికిని ప్రపంచము కేవల మనర్హమైయుండును. అపు డే ప్రాణియు నుండనేరదు. కావున సంపూర్ణసమత్వము ఉండ వలయునను ఈ 'మిలినియము' సంబంధపు టాశయము లన్నియు అసంభావ్యము లగుటట్లుండ, వానిని మన మవలం బింప యత్నించినచో, నిజముగా మనలను అవి ప్రళయా వస్థను బొందించును. మానవునకును మానవునకును గలభేద మెందున్నది? అయ్యది విశేషముగా ధీశక్తిలోనున్నది. మన మందఱము ఒకే ధీశక్తిలో బుట్టినామని మతిహీనుడు దక్క నేడు మఱెవ్వరును జెప్పరు. మనమందఱము వేర్వేఱు శక్తి సామర్థ్యములతో ఈ లోకములోనికి వచ్చుచున్నాము: అధికబలముగాగాని, అల్పబలముగాగాని జన్మించుచున్నాము. జననపూర్వమే నిర్ణీతమగు నీ స్థితి యనివార్యము. అమెరికా ఇన్డియనులు (American Indians) ఈ దేశమున (అమెరికాలో) వేలకొలది వత్సరములుగా నున్నారు; మీ పూర్వులే యల్ప

సంఖ్యాకులో వారి దేశములోనికి వచ్చినారు, వచ్చి దేశ
స్థితిలో వా రెట్టి మార్పు గలిగించిరో చూడుడు; అందఱును
సముల్లైనయెడల అమెరికా ఇన్డియనులు పట్టణములను
నిర్మించి బహువిధముల దేశము నెందుల కభివృద్ధి చేయ
లేదు? మీ పూర్వులు వేఱువిధమైన ధీశక్తితో, వేఱువిధ
మైన సంస్కారములతో, నిచ్చటికి వచ్చిరి. వచ్చి తమ
శక్తి సామర్థ్యములను జూప మొదలిడిరి. మరణమే పరిపూర్ణ
సమత్వము. ప్రపంచమున్నంతవఱకు భేదములుండును, ఉండి
తీరవలయును. యుగాంతిక ప్రళయమున మాత్రమే పరిపూర్ణ
సమత్వము సిద్ధించును. అంతకుముందు సిద్ధింపజాలదు. ఐనను
పరిపూర్ణ న్యాయ సౌఖ్యములు గలుగు సమయమును—
'మిలినియము'ను — సాధింపవలయునను భావము జనులను
కర్మాచరణమునకు బురికొల్పునట్టి మహాప్రేరణశక్తి.
సృష్టికి అసమత్వ మెట్లావశ్యకమో అసమత్వమును పరిమిత
మొనర్పవలయునను యత్నమును అట్లే ఆవశ్యకమైయున్నది.
ముక్తులమై మరల భగవంతుని బ్రాపింపవలయునను ఈ
ప్రయత్నము లేకున్నచో సృష్టియుండుటయే అసంభవము.
ఈ శక్తులకు రెంటికిని గల భేదమే మానవాశయము
లందలి—మానవ సంకల్పములందలి—మంచి చెడుగులను
నిర్ణయించుచున్నది. ఈ యాశయములలో గొన్ని మోక్ష
మును గొన్ని బంధమును గల్పించుచు ననాదిగా నున్నవి.

సంసారమను చక్రముతో గూడిన యీ ప్రపంచ
యంత్రము అతిభయంకరము. మన మిందు తగుల్కొనినచో
నురల మనకు గతియుండదు. ఏదియో కర్తవ్య కర్మమును

నెఱవేర్చినంతనే ఇక నే యలజడియు లేక ప్రశాంతముగా నుందు మనుకొనుచుందుము కాని యా కర్తవ్యమును గొంత వఱకు సాగించితిమో లేదో, మఱియొక కర్తవ్యము వచ్చి కనిపెట్టుకొని యుండును. ఈ మహాఘోరసంసార చక్రమున మన మందఱము పరిభ్రమించుచున్నాము, కాదు — పరిభ్రమింప జేయబడుచున్నాము. ఇందుండి వెలువడుటకు రెండే మార్గములు కలవు. సంసారము నెంతమాత్రము లక్షింపక కోరికలను విడిచి, తటస్థులమై యుండుటయొక మార్గము: కాని యిట్లు చెప్పుట చాల సులభము, ఆచరించుట దుష్కరము. కోటి కొక డిట్లు ఒనర్పగలడో లేడో యని నా సంశయము. సంసారములోనికిదిగి కర్మరహస్యమును గ్రహించుట రెండవ మార్గము, ఇదియే కర్మయోగమార్గము. సంసారభయ భ్రాంతుడవై వెనుకంజవేయక, అందు నిలిచి కర్మరహస్యమును గ్రహింపుము. సంసారమున సరియగు కర్మ మాచరించినచో అందుండి తరింపవచ్చును. సంసారమునందే సంసార తరణోపాయమును గలదు.

మన మిపుడు కర్మమన నెట్టిదో గ్రహించియున్నాము. ప్రకృతిసిద్ధమగు నీ కర్మము సదా సాగుచునే యుండును. ఆస్తికుల కియ్యది చక్కగా బోధపడును. ఏలన, భగవంతుడు మన సాయమునకై దేవులాడుచుండుట లేదు, భగవంతుడంతటి యసమర్థుడుగాడు. ప్రపంచము సదా సాగుచునే యుండును. కాని మన పరమావధి మోక్షము, స్వార్థరాహిత్యము. కర్మయోగము ననుసరించి మోక్షము కర్మమూలమున సాధింపదగియున్నది. ప్రపంచమును సుఖమయముగా

చేయవలయునను నాశయములు స్వమత దురభిమానులను కర్మాచరణమునకు బాగుగా బురికొల్ప జాలినవయ్యు స్వమతదురభిమానమువలన నెంతటి మేలు కలుగునో అంతటి కీడును కలుగుననిమాత్రము మనము జ్ఞప్తిలో నుంచుకొనవలయును. సహజమగు ముముక్షుత్వముకంటె కర్మాచరణమునకు వేఱొక ఆశయ మేల యని కర్మయోగి ప్రశ్నించును. సామాన్యమగు నీ సదాశయముల నతిక్రమింపుము. "కర్మణ్యే వాధికార స్తే మాఫలేషు కదాచన"* —కర్మ మొనర్చుటకే కాని ఫలవిషయమై నీ కెన్నడును అధికారములేదు. ఈ తత్త్వమును గ్రహించి మానవుడు కర్మము నాచరింప సుశిక్షితుడు గావచ్చునని కర్మయోగి వక్కాణించును. సత్కర్మ మొనర్పవలయునను భావము స్వాభావికమైనంత నే కర్మయోగికి నట్టి సంకల్పముగాని ఆశయముగాని యుండుట అనావశ్యకము. శ్రేయస్కరమను హేతువుచేతనే సత్కర్మము చేయుదుము. స్వర్గాభిలాషతో సత్కర్మ మొనర్చువాడు సహితము బద్ధుడగునని కర్మయోగి వచించును. స్వార్థచింత యణుమాత్రమున్నను అట్టికర్మము మనలను ముక్తుల నొనర్చుటకు బదులు మఱింత బద్ధులను జేయును.

కావున సర్వకర్మఫలత్యాగ మొనర్చుటయే, ఫలములయెడ ననాసక్తులమై యుండుటయే, మనకు తరణోపాయము. మనము ఈ సంసారము కామని, నిజముగా మనము కర్మ మొనర్చుట లేదని గ్రహింతముగాక. నిత్యశాంతినిలయము, నిష్క్రియము నగు ఆత్మయే మనము, దేనిచే

* భగవద్గీ, 2-47.

గానిండు, మన మేల బద్ధులము కావలయును! పరిపూర్ణముగా మనము అనాసక్తులమై యుండవలయుననుట చాల మంచిదే, సందియము లేదు, కాని యందుల కుపాయమేమి? స్వార్థచింతారహితముగా జేయు ప్రతిసత్కార్యమును సంసార బంధ విముక్తికి మనకు దోడ్పడును. ఫలాపేక్షను విడనాడి చేయు ప్రత్యాలోచనయు, భావించు ప్రతిసద్భావమును లోకమున నిలిచి, కర్మబంధమును సడలించి, మనలను క్రమముగా పవిత్రుల నొనర్చును. ఐన నిది యంతయు విపరీతముగను, అనుష్ఠానమున కయోగ్యముగు మహావేదాంతముగను దోపవచ్చును. భగవద్గీతనుగూర్చి నే ననేక పూర్వపక్షములను జదివియున్నాను. స్వార్థచింతలేనిదే మనము కర్మ మొనర్పజాలమని యనేకులు వక్కాణించియున్నారు. స్వమత దురభిమానప్రేరణమూలముననేకాని మఱియొక విధమున స్వార్థరహితకర్మ మొనర్పబడుట వా రెన్నడును కనలేదుకాబోలును! అందుచేతనే వా రట్లు పల్కుదురు.

కర్మయోగబోధనలను అనుష్ఠానమున జూపిన యొక మహాసీయునిగూర్చి కొన్నిమాటలను జెప్పి విరమింతును. ఆతడే బుద్ధుడు. కర్మయోగమును పూర్తిగా ఆచరణమున జూపిన మహాసీయు డాత డొక్కడే యని వక్కాణింతును. ప్రపంచమున బుద్ధుడు దక్క మిగిలిన ప్రవక్తలందఱును తమ్ము స్వార్థరహిత కర్మాచరణమునకు బురికొల్ప బాహ్యాశయములను గలిగియుండిన వారే. బుద్ధుని విడిచి మిగిలిన ప్రవక్తలందఱను రెండుతరగతులక్రింద విభజింపవచ్చును. ఒక తరగతివారు తాము భగవదవతారమూర్తులమని పలుక,

రెండవతరగతివారు తాము కేవలము భగవద్దూతలమని చెప్పియున్నారు; తమభావము లెంతటి పరమార్థరూపమును దాల్చినను ఉభయపక్షములవారును కర్మాచరణమునకు బాహ్యమునుండియే ప్రేరణమును బొందిరి. బాహ్యలోకము నుండి ఫలముల నాశించిరి. కాని బుద్ధుడొక్కడే యిట్లు వక్కాణించిన మహాప్రవక్త: "పలువిధములగు మీ సిద్ధాంతములతో నాకు పనిలేదు. ఆత్మను గూర్చి సిద్ధాంతరాద్ధాంతములను జేయుటవలన నేమి ప్రయోజనము? సత్కర్మమొనర్చుచు సజ్జనులై యుండుడు. మోక్షమునుగాని మఱియే యితర తత్త్వమునుగాని ఇదియే మిమ్ము పొందించును." బుద్ధుని జీవితమును గాలించి చూచినను ఎట్టి స్వార్థచింతయు నందు గానరాదు; లోకహితార్థమై బుద్ధునికంటె విశేషముగా కృషిసల్పినవా రెవ్వరు? బోధాచరణములం దెల్లర కతీతుడైన యట్టి సచ్చరిత్రుని మానవకోటి చరిత్రలో వేఱొక్కని జూపుడు. అట్టి మహోన్నత తత్త్వజ్ఞానమును, సమస్త జీవుల నాలింగన మొనర్చుకొనిన యట్టి యఖండ సానుభూతిని జూపిన యట్టి సచ్చరిత్రుడు ఆతడుదక్క మానవకోటి చరిత్రలో వేఱొక్కడు ఇంతవఱకు పుట్టలేదు.

మహోన్నత తత్త్వమును బోధించిన యీ తత్త్వజ్ఞశిఖామణి పరమనికృష్టజంతువులనుగూడ కృపాపూర్ణుడై ప్రేమించెను. ఐనను తన్నుగూర్చి యాతడెన్నడును జెప్పుకొనలేదు. తలపనేలేదు. కేవలస్వార్థరహితుడై వర్తించిన యీ మహనీయుడే ఆదర్శ కర్మయోగి. అఖండధీశక్తితో అతులితౌదార్యము వియ్యమొంద ననంతాత్మప్రభావభాసు

పడై వెల్గొందిన యాతడు అనుపమానుడు గదా! మానవ చరిత్రయం దాతని కెనయగు వారెవ్వరు? ప్రపంచమందలి మహాసంస్కర్తలలో ఆతడే అగ్రగణ్యుడు. మఱియు నిట్లు పక్షాణింప సాహసించినవారిలో ఆతడే ప్రథముడు: "ఏవో కొన్ని ప్రాచీనపు వ్రాతప్రతులలో నున్నంత మాత్రమున ఏదే నొక విషయము యథార్థమని నమ్మకుడు; పరంపరాను గతమనియు సత్యమని నమ్మకుడు; దేశాచార మనియు వాస్తవమని నమ్మకుడు, పెద్దలు మిమ్మట్లు చిన్ననాటి నుండియు నమ్మించుచున్నారనియు నిజమని నమ్మకుడు; సంపూర్ణముగా విమర్శించి, కార్యకారణములను బాగుగా పరామర్శించిన పిమ్మట, నయ్యది సమస్త మానవ శ్రేయ స్కరమని మీకు పొడకట్టిన పక్షమున నమ్ముడు; నమ్మి తదనుగుణముగా వర్తింపుడు. ఇతరు లనువర్తించుటకై తోడ్పడుడు." ధనమును గాని, పేరుప్రతిష్ఠలనుగాని, మఱి దేనినిగాని వాంఛింపక, స్వార్థరహితకర్మపరాయణుడగు నాతడే మహోత్తమ కర్మయోగి. ఇట్టు లాచరించు మానవుడు అపరబుద్ధుడై ప్రకాశించును. ప్రపంచ పరివర్తన గావించు శక్తి యాతనినుండి వెల్వడును. ఆతడే మహోత్తమ కర్మయోగాదర్శమును జూపును.

ఓం తత్ సత్

శ్రీ రామకృష్ణార్పణ మస్తు।

